# తొలిపలుకు

అది ఇరవైయేళ్లనాటి సాహిత్యరంగం - అందులోనూ యుద్ధరంగం. పూజ్యులు గిడుగు రామమూర్తి పంతులుగారు ఇటూ, జయంతి రామయ్య పంతులుగారు వారి ఆంధ్ర సాహిత్యపరిషత్తుతో అటూ ఢీ అని ఎదురిస్తున్నారు. యూనివర్సిటీవారు గ్రాంథికాభిమానంతో వ్యావహారికాన్ని చేరనీయలేదు. పత్రికలవారుగూడా గ్రాంథికమని తామనుకుంటున్న భాషనే వాడుతూ ఉండేవారు.

వాదన పండితుల పరమయి ఉండేది. దుష్టప్రయోగం అని గ్రాంథికవాదులన్న వాటిని, కాదు శిష్టప్రయోగమే అని వ్యావహారికులు సమర్థిస్తూండేవారు. కాబట్టి జనసామాన్యానికి 'ఇది మనవిషయం కాదు' అనే భావం కలిగింది. తటస్థులుగా ఉండిపోయారు. రైల్వేపుస్తకాలుగూడా వచ్చీరాని గ్రాంథికంలోనే ఉండేవి. వ్యావహారికులు ప్రజలను గట్టిగా ఆకర్షించగల గ్రంథాలు వ్రాయలేదు. గిడుగువారి బాలకవి శరణ్యము, వ్యాసావళి పండితుల వాదనలకిందనే చెలామణి అయిపోయాయి. ప్రజలకు పట్టలేదు.

ఈ కారణం చేతనే వ్యావహారికానికి కావలసినంత ప్రచారం జరగలేదని అనుకున్నాను. సాధారణ ప్రజలకు కూడా ఈ వివాదంలోని విషయం తెలిస్తే వ్యావహారికం ప్రచారం చాల సులభం అవుతుందని తోచింది, గిడుగువారు పండితులను మేలుకొలపడానికి చూస్తే, నేను ఇతరులకు నిజం చెప్పుదామని తలచాను. ఆ ఉద్దేశంతో వ్రాసిన వ్యాసాలు కాబట్టి కొంత మిషనరీ మత బోధకుల పద్ధతి అవలంబించవలసి వచ్చింది.

ఈ తరువాత జరిగిన పరిణామాలను పట్టీ, ప్రచురణ అయిన గ్రంథాలను పట్టీ, పత్రికల అంగీకారాన్ని పట్టీ చూస్తే, ఈ వ్యాసాలు వ్యర్థంగా పోలేదని తేలుతుంది. వీరగ్రాంథిక వాదులయిన శ్రీ పిఠాపురం మహారాజా వారు స్థాపించిన 'జనవాణి' దినపత్రిక కేవలం వ్యావహారికం మీదనే నడిచిందంటే, అది ఒక మహావిజయం కింద లెక్కపెట్టవలసిందే. అటువంటి విజయాన్ని సాధించిన వ్యాసాలు, అప్పటి రూపంలోనే, యథాతథంగా, ప్రచురించడం మంచిదని అనుకున్నాను. అందుచేత మార్పులు చేయడానికి తలపెట్టలేదు. పాఠకులు మన్నిస్తారనుకుంటాను.

ఈ కొత్త పాళీ సూత్రాలతోనే నేను నాటినుంచి నేటివరకు (ఇరవై సంవత్సరాలు) వ్రాస్తూ ఉన్నాను. జనవాణి (దినపత్రిక), కాగడా, జనవాణి (వారపత్రిక) అన్నీ ఈ పద్ధతినే ఆశ్రుల ఆదరాన్ని అపారంగా సంపాదించాయి. ఈ ఉద్దేశాలతోనే ఎన్నెన్నో వ్యాసాలు వ్రాశాను. రేడియో ప్రసంగాలు చేశాను. 'దేవాలయాల మీద బూతుబొమ్మ లెందుకు' వంటి పరిశోధన గ్రంథాలు వ్రాశాను. టాల్‌స్టాయి వ్రాసిన అనాకెన్నీనా వంటి నవలను తెలుగున వ్రాయగలిగాను. దాదాపు ముప్పయి సినీమా చిత్రాలకు మాటలూ, పాటలూ వ్రాశాను. అన్ని విధాలయిన సన్నివేశాలూ, రసాలూ నిరూపించగలిగాను. ఎక్కడా "తెలుగు చాలిందికాదు" అనిపించలేదు. అన్నిటిలోనూ ఆంధ్రప్రజలు, పండితులు పామరులు గూడ ఎంతో ఆదరాభిమానాలు చూపించారు. ఇంకా చూపిస్తున్నారు. కాబట్టి ఈవలవనిసంస్కృతం మోజు అర్థంలేనిది అనకతప్పదు.

నాకు సంస్కృతంమీద ద్వేషమని కొందరయ్యలంటుంటారు. కాదు; నాకు కావాలి సంస్కృతం, కొద్దోగొప్పో ఇప్పటికీ చదువుకుంటూంటాను. అది గొప్ప రత్నాల గని. నిజమే. ఇష్టమున్నవాళ్ళు సంస్కృతం చదవవలసిందే, దానిలో ఉన్న విజ్ఞానం తెలుసుకోవలసిందే, ఆ విజ్ఞానాన్ని తెలుగులోనికి

తీసుకురావలసిందే. అది కూడదనను. అనవసరంగా ఆ భాషను దిగుమతి చేయకుండంటాను. తెలుగుతనం నిలపమంటాను. అంతే. *

---

*ఈ మాటలకు నిదర్శనగా, ఒకానొక సందర్భంలో "కవి" నుద్దేశించి వ్రాసిన కొన్ని పద్యాలు యిక్కడ చేరుస్తున్నాను.

చదవంగ వలదని చెప్పము,
చదువుము నీ యిచ్చవచ్చు సంస్కృత; మైనన్
వదలుము కానిస భావము
గదియించుము జాతి పెంపుకవనమున కవీ.

అందరికి తెలియు మాటలు
వందలుగద, మారుబాస వాగగనేలా ?
అందమ్మనియా, నీసుల
విందనియా, దాస్యమెంత వెఱ్ఱిదిర కవీ -

నీభావము నీజాతికి
నీభాషను చెప్పలేక నీగ్గెదవింకా
శాభాసు ! నేను కవినని
ఆభాసము భేషజమ్ము నగునోరి కవీ.

నీదీతెలుంగు గడ్డయె
కాదో, నీభాష తెల్గుగాదో, నీయూ
హేదో తెలుగున చెప్పగ
రాదనెదా ? సిగ్గు సిగ్గురా యోరికవీ.

ఏదీ నీ దేభావం
బేదారిని తెల్గులోన ఇముడగలేదో ?
నీదా కష్టంబేదో
ఊదంగారాదె చెవిని ఒకనైనకవీ.

అంతేకాదు; ఆనాటి పరిస్థితులు యీనాడుకూడా యింకా వున్నా యనే చెప్పాలి. యూనివర్సిటీవారు వ్యావహారికానికి యింకా గద్దె నీయలేదు. పత్రికల వారిలో కొందరింకా సంస్కృతంతో నిండిన వ్యావహారికం వ్రాస్తున్నారు. మంత్రులు, ఉత్తరాది పెద్దల సంతోషంకోసం గాబోలు, తెలుగు పిల్లలందరూ హిందీతోపాటు సంస్కృతం గూడా నేర్చుకోవాలని నిర్బంధించబోతున్నారు. సంస్కృతం యెంతగొప్ప భాషయినా, దానిలో యెంత గొప్ప విజ్ఞానమున్నా, దానినందరిమీదా రుద్దడానికి ప్రయత్నించడంలో అర్థం లేదు. నాలుగు క్లాసులలో సంస్కృతం నేర్చుకోగానే, ఆ విజ్ఞానం అంతా వంటబట్టిపోతుందా ? విశేష విజ్ఞానంకోసం ప్రయత్నించేవాళ్లు నేర్చుకోవచ్చు. తక్కినవాళ్ళు - ముఖ్యంగా జీవనోపాధికోసం ప్రయత్నించేవాళ్ళకీ సంస్కృతంగోల యెందుకు ? ఇప్పుడు కేవలం సంస్కృతం నేర్చుకొని వున్న సంస్కృత పండితులకు ఎంతమందికి ఏపాటి సంస్కృతభాషలోవున్న విజ్ఞానం అబ్బిందో చూడండి. ఇది వట్టి భేషజం కాని మరొకటి కాదు.

దీనివల్ల కలిగిన అనర్థం, నేను మనవిచేసినట్టు, తెలుగుతనమూ, తెలుగు నుడికారమూ, తెలుగు స్వాతంత్ర్యమూ, అన్నీ మాసిపోతాయి. తెలుగు మాటలశక్తీ పసదనమూ మరీ తెరమరుగయిపోతాయి. ఇంతకంటె, ఏభాష

---

పాడిన పాటనె మరిమరి
పాడెదు నీబుద్ధియెల్ల పాడైపోన్, మా
వాడవు మావాడల మా
జాడలలో పాడరాదె సరసముగ కవీ.

ధీరులులేరో గడ్డను,
వారల చరితములుగూడ వాసింగనవో,
నోరూర వ్రాయవేలా
ఔరా పొరుగింటకూర ! అనవలసె కవీ.

కయినా కలగగల ప్రమాదం యేముంటుంది? అనేక దేశభాషా సాహిత్యాలు ఆకళించిన మేధావులు, సంస్కృతాంధ్రాలను క్షుణ్ణంగా తెలుసుకున్నవారు, చక్కని అభిప్రాయాలు గల కవులు - సాహితీసమితివారిలాంటివారు - చాల మంది సంస్కృత పదాలతో వారి రచనలను నింపివేశారు. అంటే, ఆ మేరకు ప్రజలకు బోధపడకుండా చేశారు. ఆ భావాలనే జనసామాన్యానికి చక్కగా బోధపడేలాగా వ్రాసుంటే యెంత అందంగా వుండేది అని అనిపిస్తుంది.

రచనలలోని విషయాన్ని గురించి గూడా ఈ వ్యాసాలు నేటికీ పనికి రావచ్చును. సాహిత్యం జాతి జీవితానికి ప్రతిబింబమే అన్న ముఖ్య సూత్రం ఈ నాటికీ ఉపయోగపడేదే. ఈ సూత్రంతోనే చాలామంది రచయితలు తమ రచనలను సాగిస్తున్నారు. సంతోషమే. కాని ఇంకా మనవారికి భాషాం తరీకరణ బుద్ధి - అనుకరణంటే ఉబలాటం - పూర్తిగా పోలేదు. ఒక్కొక్క ప్పుడు వెలువడుతూ ఉన్న అనుకరణ గ్రంథాలను చూస్తుంటే, తెలుగు రచ యితలకు స్వతంత్ర రచనలంటే ఇష్టంలేదా, స్వతంత్రించి వ్రాయడానికి వీరికి శక్తి చాలదా అన్న సందేహాలు కలుగుతాయి. నిజమే; స్వతంత్రంగా కథ నల్లుకొని, పాత్రలకు జీవంపోసి, జాతిజీవితాన్ని ప్రతిబింబించేలాగ వ్రాయడం కష్టమే. అయినా, దానికి ప్రయత్నం చేయగలవారూ, ఆపని సాధించగల వారూ, కొందరుండక పుండాపోరు. అటువంటివారు గూడా ఈ 'సూక్ష్మ మార్గం - దగ్గర దారి'ని పోయి తమ పేరు నిలబెట్టుకోడానికి ప్రయత్నం చేస్తు న్నారు. చాల విచారకరమయిన విషయం! ఈ కారణం చేతగూడా ఈ కొత్తపాళీ వ్యాసాలను అలాగే ప్రచురించడాని కుద్దేశించాను.

నా రచనలు పత్రికలలో ఆయా దినాలలోపడినా, అవి పుస్తక రూపంగా ప్రచురణ జరగలేదు. ఖండకావ్యాలూ, కథలూ, నాటికలూ, విమర్శనలూ, పరిశోధనలూ అన్నీ అలా అలా ఆ పత్రికలలోనూ, ఈ సంచిక లోనూ ఉండడమే అయింది. నా శ్రద్ధలో లోపంకొంత, మిత్రుల ప్రోత్సా

హాంలో లోపం కొంత - అంటే, పుస్తకరూపంగా వెయ్యండి అని చెప్పిన వాళ్ళు చాలామంది ఉన్నా, గట్టిగాపట్టి ఆపని నాచేత చేయించగలవాళ్ళు లేకపోయారు. మన విశాలాంధ్ర ప్రచురణాలయంవారివల్ల ఆలోపం తీరిపోయి నట్టుంది. గట్టిగా పట్టుపట్టి నాచేత ఈపని చేయించినందుకు వారికి నా కృతజ్ఞత. దీనిని పాఠకలోకం ఆదరించినట్టయితే, తక్కిన రచనలనుగూడా ఈలాగే పుస్తకరూపంగా ప్రకటించగలుగుతాను.

మద్రాసు.
25-7-55.

— తాపీ ధర్మారావు



ఈ కొత్తపాళీ వ్యాసాలు ప్రజామిత్ర వారపత్రికలో 1936 సంక్రాంతి సంచికనుంచి కొన్ని నెలలపాటు ప్రకటితమయాయి.

# 1

# అవసరమేమిటి?

మూడు సంవత్సరాలు - వెయ్యిరోజులు - దాటి పోయాయి. ఒక్కముక్క అయినా వ్రాయలేదు; ప్రచురించడం అంతకన్నా లేదు. నిజమే. కాని, చదివినదిమాత్రం చాలా ఉంది. నా అదృష్టంచేత ఈ మూడు సంవత్సరాలలోను నేను దగ్గరదగ్గర 40, 50 వేలపేజీల సారస్వతం చదవగలిగాను. సారస్వతం అంటే ఎలాంటి సారస్వతం? దిక్కూ ముక్కూ లేని సారస్వతం కాదు. అనుకరణమే ప్రధాన మనుకునే సారస్వతం కాదు. జీవంలేని పాతవ్రాతలుకావు. జీవకళలు ఉట్టిపడుతూ ఉండే గ్రంథాలు. చాలా ప్రశస్తమైనవని దేశదేశాలలోనూ, ఖండఖండాలలోనూ ప్రఖ్యాతిపొందిన గ్రంథాలు. వందలకొద్ది ఇతరభాషలలోకి తర్జుమా అయిన గ్రంథాలు. అన్ని జాతుల వాళ్ల పొగడ్తల్నీ, లక్షలకొద్ది బహుమానాలనీ పొందిన గ్రంథాలు. ప్రపంచములోని జనులనీ, వాళ్ళ అభిప్రాయాలనీ ఒక్కసారి మార్చివేసిన గ్రంథాలు. రషియా, జర్మనీ, నార్వే, స్వీడను, ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా—ఈ దేశములలో మిక్కిలి ఉత్తమమైన గ్రంథాలు.




ఆ గ్రంథాలు కరువుదీర చదివాను. నా స్వభావాన్ని బట్టి చదివిన వాటిని గురించి విమర్శించుకున్నాను. ఆలోచించు కున్నాను. తరవాత ఆ యా దేశాలలో ఆ గ్రంథాలను గురించి వ్రాసిన విమర్శనలు చూచాను. నోబెల్ మొదలైన గొప్ప గొప్ప బహుమానాలు ఆ గ్రంథాల కెందుకిచ్చారో తెలుసు కున్నాను.

దీని అంతటివల్లా నా అభిప్రాయాలు చాలా ఎక్కువగా మారిపోయాయి. మారకతప్పదు ఆ గ్రంథాలని చూచిన తరవాత.

సారస్వతం అంటే ఏమిటి ? భాష ఎటువంటిది ? భావం ఎలాగుండాలి? కవి ఎటువంటివాడు ? కవిత్వానికి అర్హత ఎలాం టిది ? ఈ ప్రశ్నల్ని గురించి నా అభిప్రాయాలు మారి పోయాయి- పూర్తిగా మారిపోయాయి.

ఈ మధ్యను కొన్ని వ్యాసాలు వ్రాయాలని ఎన్నిసార్లో అనుకునేవాడిని. ఎలాగ వ్రాయడం అని సందేహం కలిగేది. పూర్వపు అభిమానాలు కొట్టుకునేవి. పోనీ, పూర్వపురీతినే వ్రాసివేదామంటే, నా హృదయంలో కలిగినమార్పు దానికి ఒప్పుకునేదికాదు. అందుచేత మౌనం కలిగింది నా కలానికి. దీనివల్ల స్నేహితులయిన పత్రికా సంపాదకులకి నాపైకోపం కూడా కలిగింది. ఏమిచేయను? నాపై నాకే కోపం కలిగి నప్పుడు ఇతరులకి కలగదా !

బూటకాలకీ, మారువేషాలకీ నామనస్సొప్పుకోలేదు. కాబట్టి నిజం చెప్పాలి అని నిశ్చయించు కున్నాను. ఎవ్వరే



మన్నప్పటికీ నిజం తెలియజేయడమే సరి అయినపని అని అనిపించింది. దాని ఫలితమే ఈ "కొత్తపాళీ".

కొత్తపాళీ చూచి కోపం తెచ్చుకోవద్దని వేడుకుంటాను మిమ్మల్ని అందరినీ. నేను చెప్పేది అంతా విన్న తరవాత ఇంకా మీకు కోపం నిలిచి ఉంటే, అప్పుడు నన్ను అడగండి. తప్పక మిమ్మల్ని నమ్మించగలననే నా నమ్మకం. అన్ని విధాలా ఆలోచించనిదే నేనీపనికి పూనుకోలేదు. పూర్వపు అభిమానాలు మీకన్నా తక్కువ కలిగి ఉండేవాడిని కాను. పూర్వపు సారస్వతంలో నేనుకూడా కొంత కృషిచేశాను. అనేకుల పొగడ్తలను పొందాను కూడాను. కాని శ్రీ కాళహస్తి మహాత్మ్యములో నక్కీరు కవి చెప్పినట్టు "నెట్రి కన్ను కాట్టినాలుమ్ కుట్రం కుట్రందా" (నెత్తికన్ను చూపించినా తప్పు తప్పే) అనే సామెతను పట్టి ఈ కొత్తపాళీ వ్రాయక తప్పిందికాదు. కాబట్టి కొంచెం శాంతించండి అని మిమ్మల్ని వేడుకుంటున్నాను.

కొత్తపాళీ అంటే—

పాళీ అన్నా, స్టీలుముక్క అన్నా, పేనాముల్కీ అన్నా అంతా ఒక్కటే, ఆత్మారాముడిలాగ. దీనినే అంటారు ఇంగ్లీషులో నిబ్ అని. ఇప్పుడు కొత్తపాళీ అన్నిజిల్లాల వాళ్ళకి ఒక్కలాగ తెలుస్తుందనుకుంటాను. వ్యావహారిక భాషకున్న చిక్కుల్లో ఒక చిక్కు తీరినట్లున్నాది దీనితో.

## నా పిట్టకలం

మొదట నాది సనాతనమైన పిట్టకలం. పెద్దలనాటిరకం. గంటం కోతలులేకుండా గరగరమని పరిగెత్తుతూ ఉండేది. ఆ

గరగరలు చూచి చాలా ఆనందించేవాడ్ని నేనొక్కడినేనా? నాతోపాటు ఎంతిమంది ఆనందించేవాళ్లు!—ఇంతలో కొత్త కలాలూ, కొత్తపాళీలూ వచ్చాయి. దేశదేశాల్లోని కలాలు మారిపోయాయి. పూర్వపుకలాల్ని వాడేవాళ్లే ఇతరదేశాల్లో లేకుండా పోయారు. కాదని ఎవడైనా పాతకలంవాడితే వాడి వైపు చూశేవాడే ఉండకుండా పోయింది. వేలకొద్దీ కొత్త కలాలు, వేలకొద్దీపాళీలు, వెయ్యివిధాల పరిగెడుతూ ఉండడం కలిగింది, కలాల అంగళ్లలోనూ, సాహిత్య రంగాలలోనూ.

అభిమానాలు ఎటు కొట్టుకుంటూ ఉన్నా మంచీ చెడ్డల్ని తెలుసుకోవాలనే బుద్ధి నాది. చూచాను. ఆలోచించాను.— ఈ పెద్దలనాటి పిట్టకలానికి చప్పుడు ఎక్కువ. ఒక్కొక్కదగ్గర ముద్దలు, ముద్దలు. ఒక్కొక్కదగ్గర పళ్లు ఇగిలించివేయడం. ఒక్కొక్కప్పుడు చెక్కుకుంటూ ఉండడం – ఆ చెక్కడమైనా తాతలనాటి తీరునే చెక్కాలి. తుంపరలకి అడ్డులేదు.

ఈ పాళీకో – అందులోనూ రిలీఫ్ పాళీకి – బరబరలు లేవు; తుంపర్లు లేవు. చల్లగా, మెత్తగా రాసుకొనిపోతుంది. గట్టిది. నాలుగు కాలాలు నిలిచేది.

పిట్టకలాల బరబరలు చాలామందికి తెలిసినవే. తెలియనివాళ్ళకి కొంచెం మచ్చు:

ప్రాంచ ద్వ్యాబద్ధ పక్షద్వయ విధుతి
మహాధ్వాంతకృద్గృధ్రసంస



చ్చంచూపు ట్యగ్ర కృత్త శ్లథ పిశితలవా
స్వాద సంవృద్ధ గర్ద్రాయమా నా
పంచాస్యోద్ధ్వాంత శావప్రతతి
పతన నిర్యాణశబ్ధాయమా నా
చంచ త్ప్రేతాన లాసృగ్ఘ్నరజము........

ఇది పిట్టకలం వ్రాత. మాటకీ, మాటకీ ఎడముండ డానికి గాని, చదువుతూ ఊపిరితీయడానికి గాని వీలులేదు. చదివేవాడు ఊపిరి తిరగక చచ్చినా, సమాసం చాల పెద్దదనే సంతోషించేవారము. పద్యం చదవగానే వ్యాఖ్యానానికి ప్రారంభించేవారం. అవును, మళ్ళీ మేము మా కడుపులోని అర్థం చెప్పకపోతే, వాళ్ళతరమా, వాళ్ళ తాతలతరమా మా అభిప్రాయాన్ని పోల్చుకోవడానికి? వ్యాఖ్యానం చెప్పవల సిందే. అందరికీ తెలియాలన్న ఉద్దేశంతో వ్రాసిన పురాణా లకే అర్థంచెప్పే ఆచార్యులవారు కావలసివచ్చింది మనకు.

వెధవపద్యాలు

ఒకనాడు నాలాంటివాడే ఒకడు ఏవో దిక్కుమాలిన పద్యాలు వ్రాస్తూ పిట్టకలం పిరపిరలాడిస్తూ ఉన్నాడు. వాళ్ళ తల్లి కొంచెం భక్తీ, పూజా అలవాటు కల మనిషి.

"ఒరే! నాయనా! ఆ దిక్కుమాలిన పద్యాలు వ్రాయడానికి బదులు నాకు దశావతారాలమీద పదిపద్యాలు వ్రాయకూడదురా! పూజ చేసుకునేటప్పుడు చదువుకుంటుం టాను" అన్నది కొడుకుతో.

పిట్టకలానికి ఉద్రేకం కలిగింది. తెలివి తేటలన్నీ తల్లికి చూపించివేదామనే ఊహ. మూడురోజులు తన్నుకున్నాడు. గ్రంథాలూ నిఘంటువులు తిరగవేశాడు. తల్లిని పిల్చి, "అమ్మా, విను మత్స్యావతారం పద్యం" అని

జాగ్రద్వ్యాళ్చరమూర్తిమత్ భవ దుదం
చద్వాలలోలత్ పృథా
కుగ్రైవేయ విషంగ నిర్గత పృష
శ్శోటుల్ త్రయీ మార్గణ
వ్యగ్ర క్షుభ్య దజాశ్రుబిందువులతో
హల్లీసకం బాడెన
త్యుగ్రామ్నాయ మలిమ్లు చాసప జయ
ప్రోద్దామ లక్ష్మీధవా.

చదివాడు. రెండో పద్యం చదవడానికి పూనుకునేసరికి తల్లి, "చాలు చాలురా, నాయనా, నీ పద్యాలు నీ దగ్గరే ఉంచుకో. నా కక్కర లేదు ఆ వెధవపద్యాలు" అన్నది. కాని పిట్టకలం మాత్రం రెక్క లెగరవేసుకుంటూనే ఉండేది. ఎవడి వెర్రి వాడి కానందం కదా!

కాని ఈ రిలీఫు పాళీమాత్రం అలాగ పిరపిరలాడదు. మెత్తగా వ్రాసుకునిపోతుంది.

ఇది ఎందుకు?

పాళీ కొత్తదంటే పలుకూ కొత్తదే; పలికే విధానమూ కొత్తదే, భావాలూ కొత్తవే, అంతా కొత్తదే అన్నమాట. ఎందుకింత కొత్త అంటారు కొందరు.



కాలం కొత్తది. కాలం అంటే మనసు, మన మంటే కాలం. కాలం మారనిదే మనం మారను. మనసు మారనిదే కాలం మారదు. ఈ రెంటికీ భేదంలేదు. కాలం మారిపోయి మనం మారకుండా ఉండడం ఎంత అబద్ధమో, మనం మారిపోయి కాలం మారకుండా ఉండడం అంత అసంభవం. మనలో కొందరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా, కాలం మారిపోయింది. కాలి నడకను కాశీ వెళ్ళడం పోయింది? గాలి మీద ప్రయాణాలు వచ్చాయి. పదిమైళ్ళలోని వార్తకి పదిహేనురోజులు కనిపెట్టుకొని ఉండడం పోయింది; తీగల మీదనూ, తీగలు లేకుండాను మాటలాడుకోవడం వచ్చింది. రాజు లేకపోతే రాజ్యాలు నాశనమయిపోతాయి అన్నమాట అంతరించింది; కొత్త కొత్త రాజ్యాలు పుట్టుతున్నాయి. తొట్టిల్లో వున్న బిడ్డకి పుస్తె కట్టడం ఎగిరింది; ఇష్టంమీద పెళ్ళిళ్లు జరుగుతున్నాయి. పిట్టకలాలు పోయి కొత్తకలాలు వచ్చాయి. పిట్టకూతలు పోయి కొత్తకూతలు కలిగాయి. కాపీ వ్రాతలు పోయి కొత్త వ్రాతలు పుట్టాయి.

ఈలాంటి రోజుల్లో "నేను మారను. నా పిట్టకలమే వాడతాను." అంటే పెద్ద తిట్టు తిట్టకపోయినా, కొంచెం చాదస్తపు మనిషి అంటారు. అన్నా, అనకపోయినా, అది కూడనిపని. అంతా మారిపోతూ ఉంటే నేను మారలేదు అని అనుకోవడం సత్యాన్ని విడిచి సాముచేయడం లాంటిది. కళ్ళు మూసుకొని కాలం గడపడంగాని మరేమీకాదు. గుడ్డి బ్రతుకు అన్నమాట. అది నా స్వభావంలో లేదు. అన్ని సంగతులూ చూస్తూ నేను మారలేదు అని అనుకోవలసినంత





తెలివితక్కువతనం నాకు లేదు. మారిపోయానని తెలుసుకొని కూడా మారలేదన్నట్లు కనబడదామన్న పిచ్చితనమూ నేను తెచ్చుకోలేదు. ఏమంత గ్రహచారం అని నేనూ ఒక కొత్త పాళీ తెచ్చి, నాపాత కలానికే రెండు దారాలతో కట్టాను.

## అతుకుల బతుకని ఆక్షేపణ

పాళీ కట్టేసరికి పరుగెత్తుకుంటూ వచ్చాడు మా ఆచారి. ఏమండోయ్, మీదంతా అతుకుల బతుకే అయింది అన్నాడు. అవునని చెప్పడానికి నా కేమీ అభ్యంతరంలేదు అని అన్నాను నేను. ప్రపంచమే అతుకులబతుకు. ఆడదానికి మగవాడతుకు. ఫ్యాక్టరీకి కూలివాడతుకు. రైతుకు వర్తకు డతుకు. తూర్పుకి పడమర అతుకు. మనభోజనాలతుకు. మన బట్టలతుకు. మన మతాలుఅతుకు. ఇందులో అతుకులబతుకు కానిదేది ? పైకి చూచామంటే, ఏదోఒక నక్షత్రానికి సూర్యు డతుకు, సూర్యుడికి భూమిఅతుకు, భూమికి చంద్రుడతుకు అని తెలుస్తూనే ఉంది. క్రిందచూస్తే లాంకషైరు యంత్రాలకీ, ఇండియా దూదికీ అతుకు. విశాఖపట్టణం వేసశనగలకీ, హాలండు నేతిడబ్బాలకీ అతుకు కనబడుతూనే ఉంది. నాకలం మాత్రం అతుకుల బతుకయితే మునిగిపోయేదేమీలేదు. అందుచేత ఈ కలానికి గొప్పతనం ఒకటి కలిగిందన్నమాట. ఇది పురాతనాన్ని నూతనంతో అతుకుతుంది. సంస్కృతాన్ని ఈజిప్టుతో అతుకుతుంది. రషియాను అమెరికాతో అతుకు తుంది. భారతవర్షాన్ని మెసపొటేమియాతో అతుకుతుంది. అదీ, ఇదీ అన్నమాట ఎందుకు ? ప్రపంచాన్ని అంతా ఒక్క



టిగా అతికేస్తుంది. వెయ్యివిధాలగా కనబడుతూ ఉన్న ఈ ఆచారాలనీ, భాషలనీ, ఉద్దేశాలనీ, అన్నిటినీ అతికి, ఉన్న దంతా ఒక్కవిధమే సుమండీ అని నిర్ధారణ చేస్తుంది. ఇలా చేయగలశక్తి దీనికిఉంది; అందుకు తగిన అవకాశాలుమాత్రం కలగాలి. కాబట్టే అతుకులబతుకంటే ఆక్షేపణ ఏమీ లేదు. ఆధిక్యానే అందాము.

తలబరువు అని ఆక్షేపణ

పాళీకడితే తలబరువుకాదా అన్నాడు మా నాయుడు (వీళ్లంతా విమర్శకులు)— ఆ మాట ఒప్పుకోక తప్పదు. నిజమే, తలబరువే. నాకూ తలబరువే. నాకు తలబరువైనప్పుడు నా కలానికి తలబరువు ఉండవలసిందే కదా ! తలబరువు లేక పోవడమే మన వ్రాతగాళ్లలో ఉన్న పెద్ద లోపము. తేలిక తలలు, జీలుగుబెండు తలలు మనలో ఎక్కువ అయిపోయి నాయి. వ్రాతలుచూచినా, చేతలు చూచినా తేలికతలకాయలే ఎక్కువగా కనబడతాయి. అంతేకాదు, తలలున్నాయా, లేదా అన్న సందేహంకూడా కలుగుతుంది. తలలో బరువు ఉండదు; కలాలు మాత్రం ఝాడిస్తామంటారు. ఏమిలాభము ?

తల బరువెక్కాలి. అప్పుడే కలానికి బలం కలుగుతుంది. వ్రాతకు నాలుగు కాలాలు నిల్చే చేవ కలుగుతుంది. పెద్ద వ్రాతగాడిని ఎవడినైనా చూడండి, హెచ్. జి. వెల్సులాంటి వాళ్లని, ఎన్ని విషయాలతో, ఎంత వివేకంతో, ఎంత విజ్ఞానంతో వాళ్లతలలు బరువెక్కి ఉన్నాయో తెలుస్తుంది. వాళ్ల తలల్లో ఉన్న సంగతులని త్రాసులో పెట్టి తూచామంటే,

ఈ భూలోకమూ, సూర్యలోకమూ, సృష్టి అంతా వేసినా ఇంకా ముల్లువాళ్ల తలలపైనే ఒరుగుతుంది.

తలబరువుకి, కలంపరుగుకి అంత దగ్గిర సంబంధం ఉంది. తల ఎంత బరువుగా ఉంటే కలం అంత సాఫుగా నడుస్తుంది. ఎంత కష్టమైన విషయాన్నయినా అంత తేలికగా చెప్పగలుగుతాడు. కాలేజీలలో ఉపాధ్యాయులు చెప్పడానికి కాళ్లూ, చేతులూ కొట్టుకొంటూ ఉన్న విషయాలని కాలవలు తుడిచే వాడికిగూడా బోధపడేటట్లు చెప్పుతానని గంట వాయించాడు బెర్నార్డుషా. తలబరువైతేనే పలుకుతేలిక. అది లేకపోతేనే కలం కుంటుతూ ఉంటుంది. కుంటడం కనిపించకుండా చేయాలని రచయితలు కుప్పిగంతులు వేస్తారు. తనకే తెలియనిదాన్ని తక్కినవాళ్ల కేమి చెప్పగలుగుతాడు ఎవడైనా? సంగతిలో ఉన్న లోపాన్ని సమాసాలతో కప్పిపెడతానంటాడు. వట్టి తలనొప్పి.

దలబరువు ఉంటేనే వ్రాయడానికి యోగ్యత కలుగుతుంది. వ్రాసినదానికి విలువ ఉంటుంది. అది లేకపోతే వ్రాయడమే మానుకోవాలి. తెలివితక్కువచేత వ్రాసినా, దానికి విలువ ఉండదు.

తలబరువు కావలసిందే. ప్రపంచంలో ఉన్న సంగతులన్నీ తలకెక్కాలి. మనుష్యుల హృదయాలలో కలిగే అనుభవాలన్నీ తెలియాలి. ఉద్యోగం దొరకకుండా ఊరూరూ తిరిగే చదువుకున్నవాడు, పస్తులో మలమలమాడిపోతూ ఉన్న మహా తెలివైనవాడు, ప్రేమకి ప్రాణాన్నికూడా బలి ఇచ్చే అనురాగి,



ధనికుల పన్నాగాలలో చిక్కి గానుగలోని చెరుకులాగ నలిగి పిప్పి అయిపోయే కూలివాడు: ఇలాంటివాళ్లు పడేకష్టాలు తెలియాలి. ప్రజల చిక్కులు తలకెక్కాలి. కళాజీవనానికి కలియుగానికీ ఉన్నవిరోధం తెలియాలి. ప్రపంచంలో కలుగుతూ ఉన్న మార్పులు, దేశదేశాలలో ఉన్నమంచి చెడ్డలు బోధపడాలి. లోకాన్ని అంతటినీ ఊపేస్తూ ఉన్న భావాలు తలకెక్కాలి. కౌముది, చంద్రాలోకం, అమరకోశము, నానార్థరత్నమాల, ఇవి ఎక్కినంత మాత్రాన లాభంలేదు. అదంతా గాలి ఎక్కించినట్టే. బరువుతక్కువ. ప్రపంచం ఎక్కాలి. మరి తల బరువుకాదూ? అది ఉన్నాదని విచారించడం ఎందుకు? సంతోషించవలసిందే. అది ఒక ఆధిక్యమే కాని ఆక్షేపణకాదు. సంతోషిద్దాం.

## పాతకలం ఎందుకు అని ఆక్షేపణ

పాతపిట్టకలం ఎందుకు ఏ కర్రపుడకకో కట్టరాదా, పూర్తిగా క్రొత్తకలమే కొనరాదా అన్నాడు మా చెట్టి - ఇతనూ ఒక విమర్శకుడే. అమ్మమ్మా! పాతదానిని విడిచి పెట్టకూడదు. విడిచిపెట్టలేముగూడాను. పాతవి ఉండవలసిందే. ప్రపంచంలో మనం చూస్తూ ఉన్న అభివృద్ధి అంతా పాతదాని మీద మెరుగేగదా! తెరచాపల ఓడ ఆధారం చేసుకునే స్టీమర్లు తయారుచేసినారు. తీగమీద వార్తలుపట్టే వైర్ లెస్ కనుక్కున్నారు. దేనికయినా పాతది అవసరమే. అదిపనికి వచ్చేటట్టుంటే దానికి మనయిష్టం వచ్చినట్టు మెరుగు పెడతాం. పనికిరానట్టుంటే కొట్టిపడవేస్తాం, క్రొత్తకట్టడం

ఆచోటనే కడతాం. పాతదని అంతా తిరగదోస్తామా మరి ? కొంతభాగం కొంతమార్పులతో నిలుస్తుంది. కొంత ఎగిరి పోతుంది. నిలవడానికి హక్కులేనిది ఎంత అభిమానమున్నా ఎగరవలసిందే— నిస్సందేహంగా. అందులో మరేమీ మొగ మోటం ఉండకూడదు. తాతగారు కట్టించిందయినా సరే, వాళ్ల అబ్బ కట్టించిందయినా సరే, ఎగరవలసింది అంతా ఎగరాలి. నిలిచేయోగ్యత ఉంటేనే నిలుస్తుంది. కాని తొందరపడి పారవేయడం మంచిదికాదు. పనికి వచ్చేదీ, రానిదీ అయినా బోధపడాలా మరి. పనికిరాదు అని నిర్ధా రణ అయితే పారవేయడం ఎంతసేపు ? కాబట్టే పాతకలానికే కట్టాను ఈ కొత్తపాళీ.

ఆదారపోగు లేమిటి ?

ఇంత గడబిడ అయ్యేసరికి మా అభాజనుడికి కొంచెం కదలిక కలిగింది. అభాజనుడంటే వట్టి పనికిమాలినవాడని అనుకుంటారు కాబోలు ! కాదు కాదు. మొదటి కుర్చీలమీద కూర్చునే సభాజనుల కన్నా చాలా గట్టివాడు మా అభాజ నుడు. మాలో పడిపోయాడు కాబట్టి అభాజనుడై పోయాడు గాని, మరే జట్టులోనైనా పడిఉంటే పెద్దతెలివైనవాడని పేరు పొంది ఉండేవాడు. అంతే కాదు ఏ మహానాయకుడో అయి పోయి ఉండేవాడు ఈ పాటికి. ఆ మా అభాజనుడికి కలిగింది కదిలిక.

"మేష్టరుగారూ, మీ వ్యాసం అంతా చాలా గూఢా ర్థంగా ఉంది. అన్నిటికీ అన్ని జవాబులు చెప్పారు గాని,



చూడండీ, ఒక్కమాట అడిగి మిమ్మల్ని బోల్తాకొట్టిస్తా"
నన్నాడు.

"ఇందులో గూఢార్థం ఏముంది?" అన్నాడు మాచెట్టి కన్నుగీటుతూ.

"లేకపోవడం ఏమిటి? పిట్టకలం అంటే పాత వ్రాతలు, ఆపోకడలు. బరబరమంటూ పెద్ద సమాసాలతో ఊపిరి తీయకుండా ఉండే దన్నమాట. తేలికతల లంటే ఏమిటో చెప్పారు. కొత్తపాళీలో కొత్తపోకడలు సూచించారు. దీనికది ఆధార మన్నారు. అంతా గూఢార్థప్రవాహంలో దించారు కాదూ?" అన్నాడు అభాజనుడు.

"నిన్ను అభాజను డనడం మా పొరపాటే" అన్నాను నేను.

"అది సరేకాని, ఆ పాళీని ఈ కలానికి రెండుదారా లతో కట్టానన్నారే; ఆదారాలు పట్టి దారపోగు లేనా! మరే మన్నా అర్థం ఉందా?" అని అభాజనుడు అన్నాడు.

అయ్యో! లేకేమి? దారాలంటే ఏమిటి? సూత్రాలు కావూ? నా కొత్తపాళికున్న సూత్రాలు ఆ రెండే. అవే నా నియమాలు. నియమం లేకపోతే దేనికయినా చెడుగుతప్పదు. అసలు నియమం లేనిదే ఏదీ ఈ ప్రపంచంలో ఉండదు; ఉండ లేదు. నియమాలు ఉండాలి. ఉండాలని ఏవో పనికిమాలిన నియమాలని పట్టుకుంటే లాభం లేదు. నవ్వులచేటు. మన జీవితానికీ, ఆ నియమాలకీ దగ్గరసంబంధం ఉండాలి. జీవనం ఒక కొస్తాకు, నియమాలు మరొక కొస్తాకు ఈడుస్తూ ఉంటే





నిరర్థకం. నియమాలంటే గట్లులాంటివి. ఎండిపోయి అంత రించిపోయిన ఏటికి గట్లు వట్టి దిబ్బలు. పారుతూఉన్న నీటికి కట్టిన గట్లే నిజమయిన గట్లు. మా పాతగట్టు ఇక్కడున్నాది, కాబట్టి ఏరంతా ఈ గట్ల మధ్యనే పారాలి అంటే నవ్వి పోతారు. అవి చచ్చినగట్లు; ఇవి జీవిస్తూ ఉన్నగట్లు. అలాగే నియమాలు కూడ రెండు రకాలు. కొన్ని నిర్జీవాలు, కొన్ని సజీవాలు. నియమాలు ఉండాలి అన్నాముకదా అని నిర్జీవ నియమాలని పట్టుకొని పీకులాడితే ప్రయోజనం ఉండదు. గట్ల లోనికి నదిని రమ్మన్నట్టే ఉంటుంది. ప్రపంచానికి సరిపడే సజీవనియమాల్ని పాటించాలి. నియమాలంటే అలాగ జీవంతో ఉండి పనికివచ్చేవే నియమాలు. అలాంటి నియ మాలు లేకపోతేనే చెడిపోతాము అని చెప్పాను.

## చచ్చిన నియమం

చచ్చిన నియమం అంటే చూడండి ! "ఎదుతల ద్రుతం బున కచ్చుపరంబగునపుడు ముగాగమంబగు" అని ఒక నియమం చెప్పారు. కోరికలను తెల్పేటప్పుడు ఆరోజులలో "నీకు సుఖంబయ్యెడు," "నీకు కొడుకులు గలుగుత" అని, అనే వారు. చివరను ఉన్న ఎదు, త, అనునవి ద్రుతప్రకృతికము లట. వాని చివరను న్ ఉన్నదట. ఆ న్‌కు అచ్చుతగిలినప్పుడు ముక్ అని ఒక 'ము' మధ్యను వచ్చునట. "సుఖంబయ్యెడున్- అని" అనడానికి కలిపి "సుఖంబయ్యెడుమని'' అని వ్రాయా లట. అలాగే "కొడుకులు గలుగుతమని" అని వ్రాయాలి. అది నియమం. ఇప్పుడు ఎన్నికోరికలు కోరినా ఎవ్వడూ ఎదు



వాడుక చేయడు, త వాడుక చేయడు. ఎడూ లేదు, తా లేదు ఇప్పుడు. ఇకను వాటి ప్రదుతా లెక్కడుంటాయి ? వాటికి ముగాగమాలు ఎక్కడనుంచి వస్తాయి ? ఇవన్నీ జీవం లేనివే. అయినప్పటికీ కొందరు చచ్చిన ఆ రూపాలని వాడుక చేసి తమ తెలివితేటలని చూపించడానికి ప్రయత్నం చేశారు. కాని "అయ్యెడుమని" అని ఒకడు, "కొడుకులు కలుగతమని" అని మరొకడు వ్రాసి నగుబాట్ల పాలయ్యారు. ఎందుచేత ? ఎడు త ల ప్రవాహం ఎండిపోయింది. నియమం నట్టిదిబ్బ అయి పోయింది. దాని జీవం నశించింది. భాషాప్రవాహం దానిలోనికి రాదు.

## రెండు సూత్రాలు

మనసూత్రాలు అలాంటివి కావు. ప్రవహిస్తూ వున్న జీవనదికి కట్టినగట్లు. వాటిలో ఒక సూత్రం భాషకి, మరొకటి భావానికి. ఒకటి పైని కనబడే ఆకారానికి, రెండోది లోపల వుండే విషయానికి అన్నమాట. ఇంగ్లీషులో ఒకటి మేనర్ అంటారు, మరొకటి మేటర్ అంటారు. దీనికొక నియమం, దానికొక నియమం. అంతే. ఎక్కువ బెడద పెట్టేకోలేదు. తెలిసిందా ?

ఏమిటి తెలిసింది ? నా మొఖం అన్నాడు మా అభాజనుడు. కాబట్టి వివరంగా చెప్పవలసివచ్చింది. చెప్పుతాను.



# 2

# భాషకు సూత్రము

భాష ఎందుకు వచ్చింది? ఒకడికి కలిగే ఉద్దేశాన్ని ఇంకొకడికి తెలపడానికని అందరికీ తెలిసిన విషయమే. ఉద్దేశాన్ని ప్రకటించడమే భాషవల్ల కలిగిన ఉపయోగం. అంతే దాని ప్రయోజనం. మనకున్న ఉద్దేశాన్ని ఎలాగ చెప్పితే సులభంగా అవతలవాళ్ళకి బోధపడుతుందో అలా చెప్పేదే భాష. ఆ బోధపడడం ఎంత చక్కగావుంటే అంత చక్కని భాష అని అనాలి. అలాగ కాకుండా ముక్కోది అంటే తలచుట్టుకొని వచ్చినట్లు చెప్పేదంతా డొంక తిరుగుడు, దిక్కుమాలినభాష. అది భాషే కాదు నిజానికి. అది మాటలతో గారడీ; అదొక సర్కసు.

## మొదటి కవులు

మొదట మొదట మన వ్రాతగాళ్ళ భాష అలాగే చక్కగా వుండేది. కవి చెప్పినదంతా చాలమట్టుకు ప్రజలకు బోధపడేది. కవి నోటినుండి విన్నవాళ్ల హృదయాల్లోకి ఒక్క ప్రవాహంలాగుండేది. ప్రజలు కవిత్వంలోని మంచి చెడ్డలను



గుర్తించి, మంచివాటిని జ్ఞాపకముంచుకొనేవాళ్లు. అదే సహజమైన పద్ధతి. అది ఒక్క మన దేశంలోనే గాదు; ఏ దేశంలోనయినా ఆరంభం అలాగునే వుంటుంది. కవి ప్రజల కందుబాటులో వుంటాడు. ప్రజలు కవికి చేరువ. ఒకకథ చెప్పవలసినా, ఒక పేరంటాలు చరిత్ర చెప్పవలసి వచ్చినా, ఒక యుద్ధము చెప్పవలసి వచ్చినా ప్రజలకు సులభంగా బోధపడే మాటలతో కవి చెప్పేవాడు; ప్రజలు ఆదరించేవారు. ఆ తేలికమాటలలోనే హాస్యాలు, చమత్కారాలు, కావలసినచోట భయము మొదలైనవి గూడా చూపించేవారు. అలాంటివే దరువులు, యక్షగానాలు, పదాలు, పాటలు, కథలు, ద్విపదలు, అనేకము మనభాషలో గూడా ఉండేవి. అప్పటి కవులు వాటితోనే, ఆ తేలికమాటలతోనే ప్రజలను నాగరికులుగా చేశారు. అభివృద్ధికి తోవలు చూపించారు. కొత్త కొత్త అభిప్రాయాలని వ్యాపింపజేశారు. భాషను ఉన్నతికి తెచ్చారు.

## పురోహితులు — శాసనాలు

కాని పురోహితులు, వైదిక బ్రాహ్మణులు మొదలైన వాళ్ళు సంస్కృతములో కృషి చేయవలసి ఉండేది. వాళ్ళు తమ ఆధిక్యం నిలుపుకోడానికి సంస్కృతం మర్యాద కాపాడుకోవాలిగదా ! రాజులుగాని, దండనాథులుగాని, మంత్రులుగాని ఏ దేవాలయానికో ఒకదానం చేయవలసిఉంటే, పురోహితుడుగారు వైదికబ్రాహ్మణుడు తయారుకాక తప్పదు. సంకల్పం, తంత్రం, మంత్రం అంతా సంస్కృతమే. ఏమి తెలి





యనివాడుగూడా సంస్కృతాన్నే "మమ"అని అనాలి గాని తెలుగున అనుకోకూడదు. అలాంటప్పుడు దాన శాసనాలలో తెలుగుకి అధికారమిస్తారా? ఒక్కనాటికి కివ్వరు. కాబట్టి "స్వస్తిశ్రీ శాలివాహన శతాబ్దే..."అంటూ సంస్కృతంలోనే దానిని వ్రాయించాలి. ఒకవేళ ఏదయినా పద్యం చిట్ట చివరను చేర్చాలన్నా పురోహితుడుగారు చేర్చవలసిందే. వారికి వచ్చిందంతా సంస్కృతమే. కాబట్టి ఆ పద్యంగూడా సంస్కృతం టస్సాతీసినట్లే ఉండేది. సందర్భాలను బట్టి ఇలా గుండడం సహజమే అనక తప్పదు.

గాసట బీసట

ఆలాగు శాసనాల్లో ఏమి ఆగడాలున్నా సాధారణ కవిత్వంలోమాత్రం జనులకందరికీ తెలిసేటట్టు తేలికమాటలే ఉండేవి. ప్రజలు వాటినే వల్లెవేయడం, ఆవేశంతో పాడుకోవడం, పురాణాలు, కథలుచెప్పడం, ఉత్సాహంతో ఆనందించడం జరుగుతూఉండేది. పురోహితుడుగారి సంస్కృతం వినే జనసామాన్యం ఉండేదికాదు. వీరు ఊరుకుంటారా? ఆ వ్రాతలన్నీ "గాసట బీసట"అన్నారు. ఆ చదువులువట్టి బజారు చదువులన్నారు. ఆ దరువులు, ద్విపదలు, వట్టిపేలపిండి అన్నారు. మత్తేభాలు, శార్దూలాలు, పులులు, ఏనుగులు అన్న పేర్లతో కొత్త వరసలు తెచ్చారు. ప్రజలు, ప్రజల కవులు — అందరు "చెట్టు నీడను కూర్చున్నాడు" అంటూవుంటే, అది పనికి రాదన్నారు. "వృక్షచ్ఛాయ నుపవిష్టుండయ్యెను" అని



అన్నారు. వారు వ్రాసినదంతా పేలవంగా ఉందన్నారు. మేము వ్రాసింది చూడండి ఎంత ప్రౌఢంగా ఉందో అన్నారు.

## శబ్దము - అర్థము

అర్థానికితగినట్టు శబ్దం ఉండడం మంచిదే. అది చక్కని కవిత్వానికి ఒక మెరుగు. అది అందరికి సమ్మతమే.

పొడూపొడూపొడ్వొడూ
అన్నడు పడాలరామన్న
పొడవడాని కురుకుతూన్న రామన్న కంటికి కనిపిస్తాడు.

భీష్మద్రోణకృపాది ధన్వి నికరా
భీలంబు, దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు......

భయంకరమైన సేన ముందు కనిపిస్తూంది, మాటలకర్థం తెలిసినా, తెలియకపోయినా.

అటజని కాంచె భూమిసురు
డంబరచుంబి శిరస్సరిత్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠద
భంగ తరంగ మృదంగ...

మృదంగ వాద్యముతో అందమయిన ప్రదేశం అగపడుతుంది.

కాని "వృక్షచ్ఛాయ నుపవిష్టుండయ్యె" అని డొంక తిరగడం ఎందుకు?

ఉద్దేశము చక్కగా బోధపడ్డదా? లేక ఎక్కువభావం కనబడ్డదా? ఇలా అన్నందువల్ల చెట్టు పెద్దదయిందా? నీడ

దట్టమైపోయిందా ? కూర్చున్నవాడు పెద్దవాడయాడా ? ఇదేదీకాక వ్రాసినవాడు గొప్పవాడయాడా ?

అవును వ్రాసినవాడు మాత్రము పెద్దవా డయాడు కొన్నాళ్లు. అలా వ్రాసినవాడే మహా వ్రాతగాడన్నాము మొన్న మొన్నటిదాకాను. ఎంత దడబడలుంటే అంతగొప్ప. ఎంత తెలియకుండా వ్రాస్తే అంత పండితుడు. ఎవడూ ఒక ముక్కఅయిన కొరకలేకపోతే అంత ఉద్దండుడు. ఎవడికీ బోధ పడకపోతే అంత మహాకవి. ఎన్నిమాటలకి నిఘంటువులు వెదుకుతే అంత గట్టివాడు. మాటలతో బూటకాలన్నీ మహా కావ్యా లయినాయి.

భాషకున్న మొదటి అభిప్రాయాన్ని మరిచిపోయాను. పదాలని పట్టుకొని పట్టీలుకొట్టడం ప్రారంభించారు వాళ్ళ నందరిని కవులని పొగడడం ఆరంభించారు. తక్కినవాళ్లు. సూటిగా చెప్పడం సున్న అయిపోయింది. సులభంగా బోధపడడం శూన్యం అయింది.

శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారక హారపంక్తులన్
చారుతరంబు లయ్యె వికస న్నవకైరవ గంధబంధురో
దార సమీరసౌరభము దాల్చి సుధాంశువికీర్యమాణ క
ర్పూరపరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై

అన్నట్టు డొంకతిరుగుడులు బలిసిపోయినాయి. తల చుట్టి ముక్కు చూపించడం అలవాటయి పోయింది. తిన్నగా చెప్పడం చిన్నతనం అనిపించు కున్నది. "ఈ ప్రకారంగా ఆ శరత్కాలపు రాత్రులు..." అని అర్థంచెప్పే పురాణం

 

పంతులు ఆవశ్యక మయ్యాడు. (దీనివల్ల నిరుద్యోగసమస్య కొంతవరకు తీరినా) భాష కుండవలసిన లక్షణంమాత్రం పాడయి పోయింది.

## వేలం వెర్రి

ఒకణ్ని మించడానికి మరొకడు ప్రయత్నించేశాడు. పొదరిల్లు అనడానికి ఒకడు లతానికుంజ మంటే, మరొకడు వీరుధాభ్యంతరసీమ అన్నాడు. గజగమన అన్న వాడికన్న గంధగజేంద్ర సమానగామిని అన్నవాడు పెద్దవాడు. వాడి కన్న భద్రమదేభరాట్ సమసమంచితయాన అన్నవాడు గట్టివాడు. ఇలాదడబడలే ప్రధానమైపోయినాయి. వ్రాసిన దానిలో ఏమయినా ఉందా, లేదా, వ్రాస్తా ననుకున్నది సులభంగా తెలుస్తుందా, లేదా, పట్టీలు కొట్టినందుకు ప్రయోజనం ఏమయినా కలదా అన్న మాటే అంతరించి పోయింది. ఏదో సంస్కృతంలో ఉన్నదానిని తెలుగులోవ్రాయడం కాబట్టి, వ్రాసినదానిలో .ఏమయినా ఉన్నదా అన్న ప్రశ్న ఆరోజుల వాళ్ళకి లేనేలేదు. ఇక మిగిలినదంతా ఈ **మాటల** గారడీ. కాబట్టి ఈ గారడీయే అన్నిటికి ప్రధానమై పోయింది.

## దడబడలే కవిత్వం అయింది

ఇదే కవిత్వంఅనిపించు కున్నది కూడాను. శ్రీనాథుడు లాంటి మహాకవికూడా ఈ భాషకి ఎంత ప్రాముఖ్యం ఇచ్చాడో చూడండి :

వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండ లీలనొక్కొక్కమాటు

అనగా :

ఆనీ తాభ్యుపదాన శృంఖల
పదాభ్యాలం బిత స్తంభమా

అన్న పద్ధతిలో నన్న మాట.

పైచెప్పిన వచియింతు...అన్న పద్యమున్నూ, ఈక్రింది పద్యమున్నూ :

ప్రౌఢిపరికింప సంస్కృత భాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాష యండ్రు
ఎవ్వ రేమైన నండ్రు నా కేమి కొదవ
నాకవిత్వంబు నిజము కర్ణాట భాష

విషయాన్ని బట్టి కవిత్వానికి మంచిచెడ్డలు కలగడం పోయింది. భాషనుబట్టి హెచ్చుతగ్గులు కలిగాయి. ఈసంగతి తెలియగానే మన కవీశ్వరులు మేకుబిగింపు లారంభించారు. బడబడ మనడానికి మార్గాలు వెదికారు. సంస్కృతంమీద పడ్డారు. విషయానికంతా ఆధారం సంస్కృతమయి ఆరోజులలో ఉండనే ఉంది. ఇకను భాషకుగూడా అదే ఆధారం చేశారు. తీసుకొనివచ్చి దింపారు వేగన్లతో సంస్కృతాన్ని.

ఆంధ్రుల వాడుకలోనికివచ్చిన సంస్కృతం మాత్రమయితే ప్రమాదమే లేకపోయేది. అలాకాకుండా వారి ఇష్టంవచ్చినట్లల్లా దింపివేశారు సంస్కృతాన్ని. సంస్కృతంతో సమాసాలు, సమాసాలతో సాహిత్యసూత్రాలు సర్వం దిగిపోయాయి. ఆంధ్రం అంతరించింది. సంస్కృతం సమస్తం అయిపోయింది.



సంస్కృతంలో పట్టీలు చాలాయికావు. నానార్థాల మీద పడ్డారు. జనసామాన్యానికి బోధపడకుండా వ్రాయడమే వాళ్ళ ముఖ్యమైన ఉద్దేశం కాబట్టి మాటలకెన్ని అర్థాలు వుంటాయో ఆ అర్థాలమీద శ్లేషలల్లారు. యమకాలకోసం తమకించారు. రెండర్థాలంటే మూడర్థాలన్నారు. ఒక్కొక్క పద్యానికి ముప్పయిఆరేసి అర్థాలు చెప్పడానికీగూడా సాహసించారు. ఎవరేమిచేసినా సైయ్‌అంటుంది సంస్కృతం. సంధిమార్చి కొన్ని అర్థాలు చెప్పవచ్చు, సమాసంమార్చి కొన్ని అర్థాలు చెప్పవచ్చు, పదాలు విడదీయడం మార్చి మరికొన్ని అర్థాలు, ఉపసర్గల నాధారం చేసుకొని కొన్ని అర్థాలు. అంతా అర్థాలమయం అయిపోయింది. దానితో నయినా సంతుష్టిపొందారా మన వాతగాళ్లు? లేదు. ఏకాక్షర నిఘంటువులు వల్లెవేశారు. అ వొక నాలుగు వేగన్లు దింపారు తెలుగుభాషలోనికి. ఎలాగయితేనేమి తెలుగంటే పచ్చిసంస్కృతం చేశారు. ఏ ఇరవై నాలుగు సంస్కృతం మాటలయిన తెరవాతనో ఒక "ము" (విభక్తి), ఒక "ంబు," ఒక "డు" ఉంచి, తెలుగుకవిత్వమని పేరుపెట్టి, కనెన్, ఉండెన్ అని ఒక క్రియను చేర్చేవారు.

ఉరుదరీకుహరసుప్తోత్థ శార్దూలముల్
　　ఘురవారి శోణితశంక ద్రావ
దివ సావసాన సందీ ప్తాస్తగిరిశిఖా
　　జ్యోతి ర్లతా వితా నాతపంబొ




దుర్వారమదీయ బాహుపరివర్తితచండ
గదాభిఘాతభగ్నోరుతరోరు (న్)

తెలుగు కవిత్వం ఇలాగ తయారయింది. అక్కడక్కడ కొందరు సంస్కృతాన్ని తగ్గించి కవిత్వం చెప్పేవాళ్లు లేరని నేను అనను. కాని నన్నయ్యభట్టుగారు పెట్టిన భిక్షగా తెలుగులో సంస్కృతం సందడి ఎక్కువయింది. సంస్కృతం బాగా వస్తేనే తెలుగులో పండితుడనేవారు. అతడినే కవి అని పిలిచే వాళ్ళు (వీళంతా నిజంగా కవి అన్న పేరుకు అర్హులా కారా అన్న సంగతిన్నీ, వాళ్లు వ్రాసినది కవిత్వ మనిపించుకుంటుందా అన్న సంగతిన్నీ ముందుముందు వ్రాస్తాను). సంస్కృతం వస్తేచాలు తెలుగులో కవిత్వం చెప్పడానికి తగినవాడే ఆ రోజుల్లో. (కవిత్వం చెప్పడమంటే ఇక్కడ అర్థం పద్యాలు వ్రాయడం అన్నమాట.) తెలుగులో వాళ్ళకున్న లోపాన్ని సంస్కృతంతో తీర్చుకునేవాళ్ళు.

## తెలుగు కవులమీద దాడి

నిజమైన తెలుగువ్రాతగాళ్లుకూడా ఏదో వెర్రో, మొర్రో వ్రాస్తూనే ఉండేవారుగదా. మరి వాళ్లను అథః పాతాళంలోనికి అణగద్రొక్కకపోతే ఎలాగ? వాళ్లుగూడా కవులే అంటే ఈ సంస్కృతంవాళ్ళకి చిన్నతనంకాదా?

జోరూన వానాలు బోరూన గురియాగ
జారుబండలనెక్క నేరూతువా, కృష్ణ!
అడవిబండలనెక్క నేరూతువా?

అన్నవాడూకవే అయి



మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్యగాణిక్యసంపద లోలిన్...

—అన్నవాడూ కవేనా? ఇంతకన్నా సిగ్గు మరేమి ఉంటుంది?

చూచారు మన సంస్కృతంగాళ్లు. ఆ "చెంచితపాట" గాళ్ళను నోరుమూయించే ఉపాయం ఆలోచించారు. ఆ గానట బీసట కనబడకుండా చేయడానికి కంకణంకట్టారు. కొట్టకుండా, తిట్టకుండా ఆయువుపట్టు లెగరకొట్టడానికి గట్టి ఎత్తు ఎత్తారు.

సంస్కృతంలో ఉన్నాయిగదా సవాలక్షవరకు సూత్రాలు! ఆ సూత్రాలను దింపారు. కవి అంటే నాలుగు సూత్రాలు: బ్రాహ్మణుడయి వుండాలి, షట్శాస్త్రాలు తెలిసుండాలి, వ్యాకరణాలు వల్లెవేసుండాలి...అని చెప్పి అలాంటి వాడే కవి అనేవారు. కావ్యం అంటే కట్టెడు సూత్రాలుచెప్పి అలాంటిదే కావ్యం అనేవారు. ఏడుపు అంటే సూత్రాలు చూపించి అదేగాని మరొకటి ఏడుపుకాదనేవారు. ప్రేమించాడుఅంటే సూత్రాలకట్ట విప్పి ఇది ప్రేమ కానేకాదనేవారు. ఒక ఉపమానం చెప్పితే ఎక్కడా పూర్వకవుల ప్రయోగంలేదు కాబట్టి ఇది కూడదనేవారు. వ్రాతగాడి మనసుకువచ్చినట్టు ఏదయినావ్రాస్తే బాణుడలా చెప్పలేదుకాబట్టి అది తప్పు అనేవారు.

పోనీ వీళ్లు నలుగురు తప్పంటేనేమి అంటారా? నలుగురయినా వీళ్ల చేతుల్లో కీలుబొమ్మల లాగుండేవారు

రాజులు. ఆ ప్రభువులకి వీళ్లు పురోహితులు. వారి నతిక్ర మించడం పాపం అని ధర్మశాస్త్రాలు (ఎవరు ఏ సదుద్దేశంతో వ్రాస్తేనేమి ?) ఘోషిస్తున్నాయి. ఆస్థానంలో పెద్ద మర్యాద కలవాళ్లు. ఆ స్థానంలోని ఉద్యోగులంతా వీళ్ల చెప్పు చేతల్లోనే ఉండాలి. ఆహా! అందుకు అభ్యంతరమా ? మహా రాజులే వీరిమాట జవదాటకుండా ఉండాలి. ఇది చెయ్యి అంటే చెయ్యాలి రాజు. ఇది వద్దు అంటే మాని వేయాలి. అలాంటి అధికారం వీళ్లది. దానిని వీళ్ళు తెగ వాడుకచేశారు. రాజుల ఆదరణగాని, రాజుగారి ఉద్యోగుల ఆదరణగాని ఆ తెలుగు వ్రాతగాళ్లకు, ఆ ప్రజల కవులకు లేకుండాచేశారు.

## నన్నయ్యగారి "సభలు"

ఎవరి ఆదరణలేకపోయినా, జనసామాన్యం ఆదరణ ఈ 'గాసట బీసట' కవులకుండేది. వాళ్ళకథలు వింటూండే వారు. వాళ్ళపదాలు పాడుకుంటుండేవాళ్ళు. మరి వాళ్ళ గౌరవం పోవడం ఎలాగఅని ఆలోచించారు. అక్కడక్కడ నలుగురు ఈ సంస్కృతం పండితులుకూడి సభలని పేరుపెట్టు కున్నారు. మరి నాలుగురోజులయిన తరువాత ఈ సభలు తలలు ఊపుతేనేగాని కావ్యం మంచిదికాదు; కవి గొప్పవాడు కాడు అన్నారు. సభవారు సరి అంటేనే సాహిత్యంలో జాగా ఉండేది. ప్రజలుఏమన్నా ప్రయోజనంలేదు. రాజులుకూడా అలాగే అన్నారు. నన్నయగారు భారతం ఆరంభించినప్పుడు ప్రజలకు బోధపడేటట్లు వ్రాయాలన్న ఉద్దేశం ఆయనకు ఆవ



గింజంత అయినా లేదు. అతనికున్న పాండిత్యం అంతా చూపించాలనే ఊహే ఎక్కువ. అందుచేతనే తాను ఆరంభం లోనే సభలకొక్క నమస్కారం పారవేశాడు :

పరమ వివేక సౌరభ విభాసిత.........

......పావన పయః పరిపూర్ణములైన సత్సభాం
తర సరసీవనంబుల...గొనియాడి వేడుకన్

ఆ "సభల" వాళ్లు మెచ్చుకొనేట్టు ఆయాపర్వాలు వ్రాస్తానని సూచించాడు - గాని, పంచమవేదమయిన భారతామ్నాయంలోని జ్ఞానాన్ని ప్రజలకందరికీ పంచిపెడతానని అనలేదు.

............సకల సూరి సభారమ్యంబగు తృతీయ పర్వము వెలయున్.

...సభారంజనమై......విరాటపర్వము వెలయున్.
ఉద్యోగపర్వ మిమ్మగుసభలన్.
ద్రోణపర్వమమరున్ సభలన్.
సభలవిస్తరిల్లి శల్యాదికములైన
.........శల్యపర్వ మతిశయిల్లు.
స్త్రీ పర్వము
.........వెలయు సుకవిపండితసభలన్.

ఆశ్వమేధికపర్వ మత్యంతవివిధ
వస్తువిస్తరమగు బుధవరులసభల.

తాను వ్రాసిందంతా సభవారి మెప్పుకొరకే, అంటే సంస్కృతం వాళ్ళ మెప్పుకోసం అన్నమాట. ప్రజలు పరో





క్షంలో పడిపోయారు. వాళ్ళకోసం కవులు శ్రద్ధ తీసుకో నక్కరలేక పోయింది. సంస్కృత సంబంధం చెలరేగిపోయింది. మారుమూల మాటలుగూడా దిగిపోయాయి. వ్యాకరణాలు పెరిగాయి. పుస్తకాలన్నీ సంస్కృతంతో నిండిపోయినాయి. సంస్కృతం వస్తేనేగాని తెలుగుపద్యం తెలియదు అన్నంత పని జరిగింది. ఆస్థానాలలో ఆమాట నిలచిపోయింది. వ్యాకరణాలు శిలాక్షరా లయాయి. నన్నయ్యగారు తెలుగుకి సృష్టి కర్త అయిపోయారు - అంటే సంస్కృతం తెలుగుకన్న మాట. అంతకుముందున్న తెలుగంతా లేనిదానికిందనే జమ అయింది.

ఈ సంస్కృతంవల్ల, ఈ వ్యాకరణాలవల్ల తెలుగు లోకానికి ఒక గొప్ప ఆపదకలిగింది. కవి వ్రాసింది ప్రజలకు బోధపడదు. కవికి, జనానికి మధ్యను మహాసముద్రాలు పెరిగి పోయాయి. వాళ్లు రోజుకురోజు దూరమైపోతూ వచ్చారు. రాను రాను ప్రజలగోల కవికి అక్కరలేక పోయింది. కవి వ్రాతలు ప్రజల కక్కరలేక పోయాయి. సంస్కృతం చదువు కున్న ఏ పదిమందికోతప్ప, జనసామాన్యానికి కవి ఎలాంటి వాడో తెలియదు. వాళ్ళకావ్యాలంతకన్నా తెలియవు. కవి అంటే ఎవడో తమలాంటి సాధారణమనిషి కాడనే అభిప్రాయం ప్రజలకు కలిగి పోయింది. దూరమైపోవడంచేత కవివ్రాసిన కావ్యంలోని మంచిగాని, చెడ్డగాని ప్రజలకు ఉపయోగం లేకపోయింది. కావ్యాలన్నీ శరత్కాలమేఘాల్లాగ జనులకు తలమీరిపోయినాయి. ప్రజలను బాగుపరచడానికిగాని, వారి అభిప్రాయాలను మార్చడానికిగాని కవికి దారిలేక పోయింది. జనులకు గురువులాగ ఉండవలసిన కవి తెలుగు ప్రజలకు



బరువులాగ కనబడవలసివచ్చింది. జనుల మంచిచెడ్డలకు కారణాలుగా ఉండవలసిన వ్రాతలు తెలుగువారికి మూతలయి నాయి.

## అచ్చ తెలుగువారిదీ అదేతప్పు ?

సంస్కృతం బలిసిపోతూఉందని కొందరు సంస్కృతాన్ని బహిష్కరించడానికి చూచారు. వీళ్లు అచ్చ తెలుగున గ్రంథాలు వ్రాస్తామని పట్టుపట్టారు. మాతృభాషకు భక్తి చూపించడం మంచిదే. కాని, అప్పటికి అప్పుడే తెలుగులోనికి కొన్ని సంస్కృతం మాటలు ప్రవేశించి ఉన్నాయి. వాటిని విడిచి పెట్టాలంటే భోజనానికి "కూడు కుడుచుట" అన్నట్టే వికారంగా ఉంటుంది. అంతేకాకుండా, ఆ తెలుగుభక్తులు చదువుకున్న దంతా సంస్కృతమే. వారి భావాలన్నీ సంస్కృతం లోనివే. వారి కథకూడా సంస్కృతం పెట్టినభిక్షే. సంస్కృతానికి ఇంత పాబల్యం ఉన్నప్పుడు భాషమాత్రం కేవలం తెలుగు చేయా లంటే వీలవుతుందా ? ఒక మొగుడు తన పెళ్లాన్ని తప్పులేనిదే తిట్టాడనీ, ఆ తిట్టూ, తోడికోడలి దెప్పూ పడలేక ఆపెళ్ళాము పెరటిలోనున్న నూతిలో పడిపోయిందని ఏదో ఒక తెలుగు కథ వ్రాయడమే అయితే, సంస్కృతంనుండి తప్పించుకో వచ్చును. కాని త్రిపురాసురులను సంహరించుటకు త్రినేత్రుడు ఉద్యమించాడు. మంధరపర్వతం అతనికి ధనుస్సయింది. ఆది శేషుడు అల్లెతాడయాడు. మహావిష్ణువు బాణమయ్యాడు అన్నట్టు సంస్కృతం కథను సంస్కృతం భావంలో వ్రాయా లంటే తెలుగుకు వీలవుతుందా? అయినా, ఈ అచ్చ తెలుగు

గాళ్లు "త్రిగకోటికల రాకాసుల తెగటార్చగ..." అంటూ అగమ్యగోచరంగా వ్రాయడం మొదలు పెట్టారు. కొయ్య మొద్దు బాగులేదంటే కొంగను పంపించినట్లు, సంస్కృతం తెలియకుండా ఉందంటే, దాని తాతను దింపారు ఈ అచ్చ తెలుగుభక్తులు. తుట్టతుదకు ఆ సంస్కృతమైనా కొంత తెలుస్తున్నదికాని ఈ అచ్చ తెలుగు ఏమీ తెలియకుండా ఉంది అని అనిపించారు. తరువాత వాళ్ళు ధర్మమంటూ ఊరుకున్నారు.

## ప్రజలకు కావలసింది

ప్రజలకు కావలసింది ఒక్కటే: బాగా తెలియడం. అంతేగాని సంస్కృతమనీ కాదు, తెలుగనీ కాదు. ఎలాగ వ్రాస్తే బాగా తెలుస్తుందో అదే కావాలి. అందులో సంస్కృతమే ఉండనియ్యండి, తెలుగే ఉండనియ్యండి. ఇంగ్లీషు, హిందూస్థానీ, మరేదయినా ఉండనియ్యండి, ఏమయినాసరే తెలియడం ప్రధానం. మనకవులకు అది అక్కరలేదు. ఆ సంస్కృతం వాళ్ళకీ, ఈ అచ్చ తెలుగు వాళ్ళకీ ఒక్కలాగే అక్కరలేకపోయింది. వాళ్ళ తెలివి తేటలూ, వాళ్ళ మాటల సంసారమూ, వాళ్ళ వ్యాకరణ పాండిత్యమూ చూపించడమే వాళ్ళకు ముఖ్యం.

## వ్యావహారిక భాషలోని లోపము

పెద్దవారూ, పండితులూ మాటలాడుతున్నప్పుడు వాడుకచేసే భాషకు విరుద్ధంగా ఉండే వ్యాకరణం చచ్చిన దానితో సమానమే అని కొందరులేచారు మొన్నను.



పూర్వ వ్యాకరణాలని లక్ష్యం చేయకుండా, మనం మాట లాడుకొనేలాగనే వ్యాసాలు, గ్రంథాలు వ్రాయడం మొదలు పెట్టారు. వీళ్లనే వ్యావహారికభాష వాళ్ళంటారు. వీళ్లువస్తాడు, తెస్తాడు, పోతుంది, వాడూ, వీడూ, ఇలాంటివి వాడుతూ సంధి విడదీసి వ్రాస్తారు. అందుచేత ప్రజలకు చక్కగా తెలియ వలసిందే. కాని ఇప్పుడు ఈ భాషలో వ్రాసేవ్యాసాలు చాలా మందికి బోధపడకుండా ఉన్నాయి.

"ఇవన్నీ సవిమరంగా పరిశీలించిచూస్తే వీరు అనన్య సామాన్య శేముషీ ధురంధరులని గోచరిస్తూ ఉంది."

అన్నట్లు వ్రాయడం వీళ్ళలో చాలమందికి అలవాటయి పోయింది. క్రొత్తభావాలతో నిండిపోయి క్రొత్త మార్గాలు తొక్కడానికి ఉరుకుతూ ఉన్నవాళ్ళుగూడా ఈలాంటి వ్రాత లకే పూనుకుంటున్నారు. చెప్పారు, అన్నారు, అనడానికి బదులు వక్కాణించారు, ఉద్ఘాటించారు, అని అనవసరంగా వ్రాస్తారు; అక్కరలేనిదే సమాసాలు దొర్లిస్తారు. ఆ సంస్కృత సమాసాలు ఎంత విశేషంగా ఉంటే జనసామాన్యానికి అంత తక్కువగా బోధపడుతుందన్నమాట వీళ్లుగూడా మరచి పోతున్నారు.

పనికిమాలిన వ్యాకరణాన్నంటే ధిక్కరిస్తున్నాము గాని, మాకూ మీంపాటి సంస్కృతంవచ్చును సుమండీ అని ఆ పండితులకు చెప్పడానికి ఇలాగు వ్రాస్తూ ఉన్నారేమో తెలియదు. కాని అది వీళ్ళలోనూ ఒక లోపంగానే మనం తలంచాలి.





## పై దేశాలలో భాష

అన్ని దేశాల్లోనూ, అన్ని కాలాలలోనూ ఉంటారు దడబడదాసులు, మాటలపోగులు. తమ పాండిత్యమంతా చూపించడమే ప్రధానమనుకునే గారడీవాళ్లు. అవసరమున్నా లేకపోయినా అసిరమ్మ తలేసి మాటలు వాడుకచేసేవాళ్ళు. వాళ్ళవాళ్ళ గ్రహచారాలనుపట్టి ఒక్కొక్కప్పుడు వాళ్లు చాలా గౌరవాన్ని పొందడంగూడా ఉంది. ఎటువంటప్పుడు వాళ్ళు గౌరవం పొందుతూ ఉండేవాళ్ళు అని ఇతరదేశాల సారస్వతాల్ని పట్టిచూస్తే ఒక్క సంగతి బయటపడుతుంది. మనదేశంలోనూ అదే కారణం అని అనుకోడానికి చాలా అవకాశం ఉంది. చెప్పవలసిన విషయం చప్పన అయిపోతున్నకొద్దీ చప్పుడు ఎక్కువ అవుతూఉంటుంది. కల్పనలో చమత్కారము తగ్గిపోయి, కొత్తవిషయాలు పుట్టించలేక, స్వతంత్రమైనయోచన సన్నగిల్లిపోయి, ఒకడు చెప్పినదానినే మరొకడు చెప్పాలనుకున్నప్పుడు మాటల మూటలే మహాకావ్యాలనిపించుకుండేవి.

కాని, ఇలాంటి అవస్థలు ఇతరదేశాలలో చాలఅరుదుగా ఉండేవి. ఒకవేళ ఇలాంటి నీచదశ వచ్చినప్పటికి, చాల త్వరలోనే అదిమారిపోయేది. మారినా మారకపోయినా ఇలాంటి గ్రంథాలకి అంత గౌరవం ఇచ్చేవారుకారు. ఏఅయిదో స్థానమో, ఆరోస్థానమో ఇచ్చేవారుగాని మొదటి స్థానాలు ఇవ్వరు. మాటలసర్కసుతో కూడా కొన్ని గ్రంథాలలో విషయం చాలా మంచిదిగా ఉంటుంది; స్వతంత్రంగా ఉండే



ఆలోచన ఉంటుంది. అలాంటప్పుడు ఆవిషయంవల్ల ఈమాటలు గూడా మన్ననను పొందుతాయి. ఆ విషయాన్ని చూచి, ఆలోచనలుమాచి విధిలేక ఆమాటల మూటలను మన్నిస్తారు. అయితే, ఆ కవులు ఎందుకలాగ వ్రాశారు అంటారు ? పైని చెప్పినట్లు, తయా కాలాలలో, భాషల దురదృష్టాలనుపట్టి ఆలాగు దడబడలు వ్రాయకపోతే అధికారుల ఆదరణ కలగదు. కాబట్టి కవి, స్వతంత్రుడైనప్పటికీ, దేశాచారాన్నీ కాలాచారాన్నీ కొంత పాటిస్తాడు. అది విధిలేక చేసినపనిగాని మరేమీకాదు.

## మన్నించే గ్రంథాలు ఏలాంటివి

ప్రపంచంలో ఎన్ని వ్రాతగల భాషలున్నాయో అన్ని భాషలలోను గ్రంథాలు పుడుతున్నాయి. అందులో కొన్ని ఆదేశస్థుల గౌరవాన్ని పొందడమే కాకుండా, ఇతర దేశాల వాళ్ళ ఆదరణనుగూడా పొందుతున్నాయి. ఇతర భాషలలోకి తర్జుమాలు తయారవుతున్నాయి. ఒక్కొక్క గ్రంథం వందల కొద్ది భాషలలోకి మార్చుకున్నారు. ఆ గ్రంథాలలో కొన్ని నోబెల్ మొదలైన బహుమానాలని పొందుతున్నాయి. ఒక్కొక్క చోట ఒక్కొక్కడు వ్రాసిన ఒక్క పుస్తకమూ— అంతే, మరెక్కడవాడు వ్రాసిఉండడు—ఆ ఒక్క పుస్తకము అతనికి కోట్లకొద్దీ ధనమును సమకూరుస్తుంటుంది. కొన్ని గ్రంథాలు 50, 60 లక్షలవరకు ప్రతులు ముద్రణా జరుగుతూ ఉంటుంది. ఒక్కొక్క మహానుభావుడు వ్రాసిన పుస్తకము ప్రజలను ఒక్కసారిగా మార్చి వేస్తుంది. ఒక్కొక్క గ్రంథము





విప్లవాలను కలిగించేటంత ఆవేశాన్ని పుట్టిస్తుంది. పూర్తిగా ఒక జాతివాళ్ళ జీవితాలనే మార్చి వేస్తుంటుంది ఒక్కొక్క పుస్తకం. ఒక్కొక్కపుస్తకం వ్రాస్తే రాజకీయ సూత్రాలనీ, న్యాయసూత్రాలనీ ఆయాదేశాలవాళ్ళు మార్చుకోవలసి వస్తుంది. ఒక్కొక్కడు తన వ్రాతలవల్ల పూర్వాచారాలకి పరమ శత్రువుగా కనబడుతూ ఉండడంవల్ల వాడిని దేశంనుంచి తరిమి వేసేటంతవరకు ప్రభువులకు నిద్రపట్టేదికాదు.

ఇది అంతా నేను కల్పించి ఏదో చెప్పుతున్నానని అనుకో కూడదు. పైని వ్రాసిన ఒక్కొక్క వాక్యానికి ఒక్కొక్క కవి పేరో, ఒక్కొక్క గ్రంథంపేరో నిదర్శనం ఇవ్వగలను. ఈ వ్యాసం చదివే వాళ్ళలో కొందరికి కొన్ని పేర్లు స్మరణకువచ్చే ఉంటాయి. కాని ఆ పేర్లు చాలామందికి తెలియనివి; ఎప్పుడూ విననివిగూడా కావచ్చు. కాబట్టి నేనా పేర్లన్నీ వ్రాయలేదు. కాని నేను వ్రాసిన ప్రతిమాటగూడ సంపూర్ణ సత్యం. ప్రపంచ సారస్వతంలో అనేకదేశాలలో అనేకగ్రంథాలు ఇలాంటివి ఉన్నాయి. ప్రపంచాన్ని అంతటిని ఊపివేసే గ్రంథాలు ఉన్నాయి. అటువంటి గ్రంథాలనే మంచి గ్రంథాలంటారు. వాటిని చూచుకొనే ఆయా దేశాలవాళ్ళు పొంగిపోతూ ఉంటారు. అది న్యాయంగూడాను. *



* ఈ సందర్భంలో మన తెలుగు సారస్వతం అంతా పట్టిచూడండి అని మనవి చేస్తున్నాను. ఏ ఒక్క గ్రంథాన్ని అయినా ఎత్తిచూపి, ఇదిగో మాకు అలాంటి గ్రంథం ఒక్కటి ఉంది. మాకుగూడా ప్రపంచ సారస్వతంలో జాగా ఇవ్వండి అని అడగగలమా ? లేదనే నా భావం. భావాన్ని గురించి వ్రాసిన భాగంలో ఈ సంగతిని గురించి చెప్పుతాను.

# 3

# అందరికీ తెలిసేటట్టుండాలి

పాశ్చాత్య దేశభాషలలోనున్న మంచి గ్రంథాలలోని భావం ఎంత లోతయిందయినా, ఎంత తేలికయిందయినా వాటిలోని విషయం ఎలాంటిదయినా — ఒక చిత్రకారుని జీవితమే కావచ్చు, ఒక కూలివాని బ్రతుకు కావచ్చు, ఒక మహా తెలివైన వాడివిషయం కావచ్చు, అది వేదాంతం కావచ్చు, దాంపత్యం కావచ్చు, ఏదయినా సరే — ఆ గ్రంథాలలోని భాష ఎలాంటిది అన్న ప్రశ్నయే మనకు ఇప్పుడు ప్రధానం. (భావాన్ని గురించి, విషయాన్ని గురించి ముందు చెప్పవలసి ఉంది. కాబట్టి ఇప్పుడు భాషే చూస్తాము.)

గ్రంథం నార్వేభాషది కానీయండి, రషియా భాషది కానీయండి, అమెరికాది కానీయండి, జర్మనీది కానీయండి. అన్నిటిలోనూ ఒక్క ముఖ్య సూత్రం ఉంది. నార్వే దేశంలోని ఒక మహాగ్రంథం తీయించండి — సాధారణ గ్రంథం కాదు — ప్రపంచంలోని సారస్వత సూత్రాలని మార్చివేసిన గ్రంథం తీయించండి. నార్వే దేశంలో ఉండేవాళ్ళని ఒక నూరుగురిని తీయండి — చదువుకొన్న పట్టపరీక్షవాళ్ళనికాదు —

వీధులలో తిరుగుతూఉన్న వాళ్ళని, కూలీనాలీ చేసుకొని బ్రతుకుతున్న వాళ్ళని తీయండి. ఈ నూరుగురికి నార్వేభాష మాతృభాషగా మాత్రం ఉండాలి. ఈ నూరుగురిని కూర్చో పెట్టి ఆ మహాగ్రంథం చదివించండి. ఏ అయిదుగురికో తప్ప తక్కినవాళ్ళకందరికీ ఆ గ్రంథంలోని భాష చక్కగా బోధపడి ఉంటుంది. అందులోనివి వాళ్ళకు తెలిసిన మాటలుగానే ఉంటాయి. పుస్తకం అంతటిలోను ఒక పదిమాటలు మాత్రం కొత్తవి ఉండవచ్చు. భావం అంత సులభంగా బోధపడక పోవచ్చు. కాని మాటలకష్టం వాళ్ళకు చాలావరకు ఉండదు. వాక్యాలు బోధపడే ఉంటాయి. నిఘంటువులు చూడవలసిన అవసరం, పుస్తకం అంతటిలోను, ఒక పదిసార్లు ఉండవచ్చును. భాష అంత సులభంగా బోధపడుతూ ఉంటుంది. ఈ సంగతే ఆయాభాషలలోని విమర్శనలవల్ల చక్కగా తెలుస్తుంది.

అంటే ఏమిటి ? గ్రంథం ఏ భాషలో ఉంటుందో ఆ భాషే మాతృభాషగా కలవాళ్ళకు, నూటికి 90, 95 మందికి మాటలకష్టం ఉండకూడదు. ఇదే సూత్రం అని బోధపడుతుంది. ఇలాగే రష్యా, జర్మనీ, ఫ్రాన్సు, అమెరికా మొదలయిన దేశాలలో గూడా ఉన్నదని రుజువుచేయవచ్చును. భావంలో కష్టంఉన్నా, లేకపోయినా భాషలోమాత్రం కష్టం ఉండదు, ఉండకూడదు మాతృభాషగా ఉన్న వాళ్ళకి.

ఇంగ్లీషులోను

ఇంగ్లీషులోనుకూడా మహాకవుల గ్రంథాలలో ఈ గుణం కనిపించుతూ ఉంది. షేక్స్పియరు మహాకవి "దయ"ను గురించి వ్రాసిన మాటలు చూడండి :

 

The quality of mercy is not strained;
It drops as gentle rain from heaven
Upon the place beneath. 'Tis twice blessed:
It blesses him that gives and him that takes.

. . . . . . . . . . . . . . .

మాటలకష్ట మేమయినా ఉందా ? ఇంగ్లీషు మాతృభాషగా గలవాడికెవడికి ఈ మాటలు బోధపడవు ? నిఘంటువులు చూచుటకు అవసర ముంటుందా వాడికి ? భావమా, ఎంత గొప్పది ! ఆ భావాన్నే విప్పి వ్రాయాలంటే మహాగ్రంథం మరొకటి తయారయిపోవలసినంత పెద్ద భావం. మాటలో, తేటలు !

Life is real, life is earnest;
The grave is not its goal.

అన్న మాటలు చూడండి ! ఏమైనా కష్టముందా ? భావంలో కష్టముండవచ్చును. అది అందరికీ అందుబాటులో లేకపో వచ్చు. కాని మాటలకష్టం లేదు. అన్వయకష్టం లేదు. వాక్యాల కర్థం తెలుస్తూనే ఉంటుంది.

To be or not be — that is the question ఇది చూడండి.

అస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్

ఇది చూడండి.

నోబెల్ బహుమానాన్ని పొందిన రవీంద్రనాధటాగూర్ గారి గీతాంజలి కూడా—తత్త్వాలయినప్పటికీ—మాటలకష్టం ఏమీ లేకుండా బంగాళి మాతృభాషగా గలిగిన వాళ్లకందరికి తెలిసినట్లే ఉన్నదిగాని, మాటల గారడీలతోనూ, పదాల

సర్కసులతోనూ లేదు. భావాలంటే చాలా కష్టంగా ఉండ వచ్చు. మాటలబాధ, వాక్యాలబాధా ఉండదు.

## రైల్వే పుస్తకాలు

ఇంగ్లీషులోగూడా ఇప్పుడు వస్తూవున్న ఉత్తమ గ్రంథా లలో భాష కఠినంగా ఉండడంలేదు. నిజం చెప్పవలసివస్తే రైల్వే పుస్తకాలలో ఉన్నపాటి మాటల కష్టంగూడా వాటిలో లేదనే చెప్పాలి. ఈ రైల్వేగ్రంథాలు మూడురోజుల ముచ్చట్లు మూడుగంటలలో చదివి పారవేయవలసినవి. మళ్ళీ చూడ డానికిగూడా వీటికి అర్హత ఉండదు. అటువంటి వాట్లలో ఇంకా కొంచెం మాటల దడబడలు కనబడతాయి. కాని లోకంలో, సాహిత్యంలో కొన్నాళ్ళు నిలవదగిన పెద్దవ్రాత గాళ్ళ పుస్తకాలలో అది కనబడనే కనబడదు.

ఇంగ్లీషువాళ్ళు అందరూ మాటలాడుకొనే భాషలోనే, అలాంటి అన్వయంతోనే వ్రాస్తారు. పాతవ్యాకరణాలకి కొంచెం తప్పిపోతూ ఉంటారు గూడాను. ఏమని ఒకవేళ వాళ్ళని అడిగితే ప్రజల నడగండి అంటారు. ప్రజలు ఆ వ్యాక రణ సూత్రాన్ని పాటించనప్పుడు మీరు సూత్రం మార్చుకో వలసి వస్తుందంటారు గూడాను. గట్టిగా అడిగితే పెద్దవాళ్ళ వ్రాతలు అలాగ తేలికమాటలతోనే ఉంటున్నాయి. తులసీ దాసు రామాయణమూ ఇలాంటిదే. చిన్నవాళ్లు బడబడల మీద పడతారు.

కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా అన్న మాట చాల నిజమని అనిపిస్తుంది. ఎంత కఠినమయిన సంగతుల



నయినా, ఎంత చిక్కన్న సమస్యనయినా ఈ గొప్ప వ్రాత గాళ్లు అంత తేలికగా చెప్పగలరు. చిన్నచిన్న మాటలతోనే మహా కష్టమయిన విషయాలని తేటపరుస్తారు. అదే వాళ్ళలోని గొప్పతనం. ఆ కష్టవిషయాలన్నీ వాళ్ళచేతులలో చిక్కి ఉంటాయి. అవి వాళ్ళకు చక్కగా బోధపడి ఉంటాయి. తెలిసినదానిని చెప్పడం ఎప్పుడయినా సులభంకదా!

ఒక ఉదాహరణ

నామిత్రులు, పెద్ద విద్యాపీఠములో ఆంధ్రభాషకు గురువు, పట్టభద్రుడు, ఒక గ్రంథాన్ని ఇంగ్లీషునుండి తెలుగులోనికి తర్జుమాచేస్తూ ఉన్నారు. నేను వారిని చూడడానికి వెళ్ళినప్పుడు వారు ఉత్సాహంతో నాకు కొంతభాగం వినిపించారు. వినిపించడమే వారికి ప్రధానం కాబట్టి విన్నాను. కొంతభాగం వినిపించిన తరవాత, "ఎలాగుంది?" అని నన్ను వారు అడిగారు. నేను ఆంధ్రజనుల పక్షాన్ని మాటలాడుతూ, "అంతా అగమ్యంగా ఉంది. మాకు బోధపడాలని వ్రాస్తేకదా మీరు, మాకు బోధపడడానికి!" అన్నాను. పాపము, వారు నిర్ఘాంతపోయారు. నేను ఇలాగంటానని అనుకోలేదు. వారి వ్రాతలో మాటలు కష్టంగా ఉన్నవనీన్నీ, అన్వయం కష్టంగా ఉందనిన్నీ చెప్పాను. ఇదిగూడా ఒక ప్రబంధంలాగో, టెక్స్టుబుక్కులాగో మాటమాటకీ అర్థంచెప్పి, అన్వయంవిప్పి బోధపరిస్తేనేగాని బోధపడదు అని చెప్పాను.

తరువాత వారు ఇంగ్లీషు మూలగ్రంథములోనుంచి ఆ భాగాన్ని చదివారు. "దీనిని మీరుమాత్రం ఎలాగ తెలుగు

చేస్తారు?” అని నన్ను అడిగారు. “నేనెందుకు, మీరుమాత్రం తెలుగు చెయ్యలేరా?” అని నేనన్నాను. “ఎలాగ” అన్నారు వారు. అందుకు నేను, “అయ్యా, మీరు తెలుగు పండితులు కదా, ఎంతకష్టమైన తెలుగు గ్రంథాలనయినా విద్యార్థులకు బోధపర్చడము మీపనికదా! ఇప్పుడు మీరు చదివి వినిపించిన భాగమే మీరు బోధపర్చవలసి వస్తే ఏంచేస్తారు? మాటల లోను, అన్వయంలోను ఉన్న కష్టాన్ని తీసివేసి తేలికమాట లతో దీని భావాన్ని అంతటిని తెలిసేటట్టు చెప్పుతారా, లేదా? భావంలో ఒక రవంతయినా జారకుండా చూస్తారా, లేదా? అలాగే ఇది ఒక టెక్స్టుబుక్కు అనుకొని ఆ భాగంలోఉన్న భావాన్ని తేటమాటలతో వ్రాయండి. అప్పుడు మీరు తెలుగుచేసిన వాళ్ళవుతారు. ఇప్పుడున్నట్టుగా వ్రాస్తే ఏ పంచ తంత్రమో అంటారుగాని తెలుగనరు” అన్నాను. అలాగ వ్రాస్తే గ్రంథం బలిసిపోతుందని భయపడ్డారు. బోధపడకుండా ఉండే చిన్న గ్రంథంకన్నా బోధపడే పెద్ద గ్రంథం మేలుకదా అన్నాను. తుదకు వారేమిచేశారో నాకు తెలియదు.

## మరొక ఉదాహరణ

సామ్యవాదమును గురించిగాని, ఆర్థిక విషయాల గురించిగాని సూత్రరూపంగా చెప్పడమూ, వ్రాయడమూ రెండూ చాలా కష్టమైన పనులే. ఇప్పటికీ, ఆయావిషయాలలో మహాకృషి చేసిన ఉపాధ్యాయులు కాలేజీలలో ఒక్కొక్క సంగతి బోధపర్చడానికి గిజగిజ గింజుకోవడం చూస్తూనే



ఉన్నాము. అటువంటి సంగతులను మిక్కిలి తేటమాటలతో అందరికీ బోధపడేటట్టు చెప్పాడు బెర్నార్డుషా.

మహాక్లిష్టమైన వేదాంత సూత్రాలనీ, పాషాణాలని కూడా శోవంటపోతూ ఉన్న సాధారణుడికి బోధపడేటట్టు చెప్పవచ్చునని సవాల్ చేయవచ్చును. దీనికి ముఖ్యమైన దేమిటంటే, చెప్పేవాడికి అసలుసంగతి చాలా బాగా తెలియాలి. అది ఎరువుసొమ్ము కాకుండా తన హక్కు అయిపోయి ఉండాలి. ఎరువుగా ఉన్నంతకాలము బరబరలు తప్పవు. మాటల ఆడంబరం పోదు.

మాటల ఆడంబరం మహాకవుల గుణంకాదని ఇప్పటికి రుజువు అయిందనే భావించ వచ్చునుగదా! ప్రజలకు తెలిసిన మాటలతో చెప్పడమే గొప్పసంగతి. ఎక్కడో భావాన్ని పట్టి గాని, అందుకు తగినమాట సామాన్యమైనది లేకపోవుటచేతను గాని జనులకు తెలియనిమాట వాడుకచేయవచ్చును. అప్పుడు సంతోషంతో నిఘంటువు చూస్తారు. అంతేగాని, ఎండు పుడక పట్టుకున్నాడు అనడానికి శుష్కకాండంబు హస్తంబున ధరించి అనడమెందుకు కలంశోష, కంఠశోషగాని! ప్రజలకు చాలా మందికి తెలిసేదే భాషగాని ఏ పదిమంది పండితులకో మాత్రం తెలిసేదికాదని దీనివల్ల రూఢి అవుతూఉంది. కాబట్టి భాష అందరికీ తెలిసేటట్టు ఉండాలి అన్నదే ఒక సూత్రం (మొదటి దారప్పోగు).

ఈ సూత్రంవల్ల ఫలితం !

ఈ ఒక్క సూత్రం మనమందరం ఒప్పుకోవాలి. ఎవరైనా, ఏభాషవారైనా ఒప్పుకోకతప్పదు. ఈ ఒక్కసూత్రం ఒప్పుకోగానే దీనివల్ల కలిగే ఫలితం ఏమిటో చూడండి !

మా ట లు

వాడుకలోఉన్నటువంటి మాటలుతప్ప తక్కిన మూరు మూల మాటలు, తెలుగైనా, సంస్కృతమైనా, మరేభాష అయినా, ఉపయోగించడానికి వీలుండదు. అందరికీ బోధపడడమే ప్రధానంగా పెట్టుకొని వ్రాసేవాడు సాధారణంగా జనసామాన్యానికి తెలిసేమాటలే వాడుకచేయాలి. ఆమాటలు సంస్కృతం కావచ్చు, ఇంగ్లీషుకావచ్చు, హిందూస్థానీ కావచ్చు. ఆయా భాషలలోనుండి కొన్ని మాటలు తెలుగులోనికి దిగిపోయాయి. వాటిని వెనక్కి మరలించడం సాధ్యంకాదు. ఆ మాటలు వాడితేనే అందరికీ సులభంగా బోధపడుతుంది. ఆ మాటలు మాని తెలుగునో, సంస్కృతాన్నో, కొత్తమాటలు అల్లుదామంటే ఏమీ బోధపడదు.

ఇతరభాషలనుంచి మాటలు, అవసరాలనిపట్టి చేర్చుకోవడం ప్రతిభాషకి ఆవశ్యకం. దానిలో చిన్నతనం ఏమీలేదు. ప్రపంచం రోజుకిరోజు అభివృద్ధిపొందుతున్నాది. కొత్తవస్తువులు, కొత్త అభిప్రాయాలు పుట్టుతున్నాయి. వాటికి కొత్తమాటలు ఉంటాయి. ఆమాటలని అన్నిభాషలవాళ్లూ ఆదరిస్తారు. దీనిలో సిగ్గుపడవలసిన దేమీలేదు. కాని వ్రాతగాడుమాత్రం



జనసామాన్యానికి బోధపడడం అనే ముఖ్యసూత్రాన్ని తన యెదుట పెట్టుకోవాలి.

తెలుగులోనే ఆయా జిల్లాలలో మాటలకి కొంత వ్యత్యాస ముంటుంది. వాటినే మాండలిక పదాలంటాము. అలాంటివి వాడుకచేసినప్పుడు వ్రాతగాడు కొంచెం జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే ఏదో ఒక జిల్లావాళ్ళకి మాత్రం బోధపడి తక్కిన జిల్లాలవాళ్లకి బోధపడకుండా పోవచ్చును. కొంచెం శ్రద్ధతీసుకుంటే ఈ చిక్కు తప్పుతుంది, ముఖ్యసూత్రాన్ని మరిచిపోకుండా ఉంటే. ఆ జాగ్రత్త లేకపోతే వ్రాతగాడి శ్రమ అంతా నిష్ఫలమయిపోతుంది. కాబోలు, కావాల, కామోలు, కామోసు, కాంబోసు అని అనేక రూపాలు వాడుకలో ఉన్నప్పుడు ఏదివాడితే ఎక్కువమందికి తెలుస్తుందో చూచుకోవాలి.

ఒక్క అర్థాన్ని తెలియజేయడానికి రెండుమూడు మాటలు వాడుకలో ఉండవచ్చును. అలాంటప్పుడుగూడ వ్రాతగాడు కొంచెం శ్రద్ధతీసుకొని, వాటిలో ఎక్కువ సులభంగా బోధపడేమాటనే వాడుకచేయాలి. చెట్టు అంటే తెలిసే చోట వృక్షం అనడం అర్థంలేని శ్రమకాదా? కొన్ని మాటల రూపాలుగూడా మారిపోయినాయి. మొదటిరూపాలువాడుకా లేదు, చాలామంది వ్రాతగాళ్ళలో ప్రయోగమూ లేదు. అలాంటప్పుడు వాడుకలోని రూపం వాడడం మంచిది.





## స మా సా లు

సాధారణంగా బోధపడే సంస్కృతం మాత్రం నిలుస్తుంది. తక్కిన సంస్కృతానికి కొంత అగచాట్లు తప్పవు. అవసరాన్నిబట్టి ఎక్కడయినా కొత్త సంస్కృతంమాట రావచ్చును. కాని సంస్కృత సమాసాలకి అవకాశంలేదు. వాడుకలోనికి వచ్చిఉన్న సంస్కృత సమాసాలు నిలువవచ్చును. ఇవి చాలతక్కువ. ఎంత సాగదీసి నప్పటికి రెండు మాటలకన్న ఎక్కువఉన్న సంస్కృత సమాసాలకి సాధారణంగా జాగాలేదు. అలా వ్రాసిన సమాసాలు చాలవరకు బోధపడని వాటికింద లెక్కవేయవలసిందే.

పెద్ద సమాసములోని మాటలు తెలిసినవే అయినప్పటికి సమాసంలాగ వ్రాయడంచేత బోధపడడం కష్టమై పోతుంది. విరుపులెక్కడో తెలియదు. వాడుకకు దూరమై పోతుంది. జనసామాన్యం ఊహ అంతవరకు ఆనదు. అర్థం చేసుకోవడం కష్టం అయిపోతుంది. ఒక్కొక్కవేళ అర్థమే కాకపోవచ్చును, అప్పుడు కవి శ్రమ నిష్ఫల మవుతుంది. కాబట్టి పెద్ద సంస్కృత సమాసానికి అవకాశం ఉండదు.

ఆలాగుననే తెలుగుసమాసంగూడా క్లిష్టంకాకుండ ఉన్నంతవరకే ఉపయోగించవలసి వస్తుంది. దీనితో సమాసాల సూత్రాలు చాలావరకు ఎగిరిపోతాయి.

## స ం ధి

చక్కగ బోధపడాలని వ్రాసేవాళ్లు సాధారణంగా కష్టమైన సంధులు లేకుండానే వ్రాయడానికి చూస్తారు. మిక్కిలి



ఆవశ్యకమైన ఉకారసంధివంటి సంధులు, (కూడదన్నా) కొన్ని క్త్వార్థకేకార సంధులుమాత్రం నిలుస్తాయి. తక్కిన టుగాగమాలు, నుగాగమాలు, ముగాగమాలు మొదలైన వన్నీ చాలవరకు అంతరించి పోతాయన్నమాట. ఇంక ఇలాగ ఆలోచించిచూస్తే సంధిప్రకరణంలో ఏ పదిసూత్రాలో నిలుస్తాయి. తక్కినవన్నీ ఉపయోగానికి రాకుండా ఉండిపోతాయి. ద్రుతాలతో చేసిన సర్కసుఅంతా అణిగిపోతుంది. సరళాదేశాలు ఏ జంటపదాలలోనో తప్ప తక్కినచోటులలో కనబడకుండా పోతుంది.

## పడు, యొక్క

వినబడు, కనబడు మొదలైన కొన్నింటతప్ప తక్కిన చోట్ల పడుప్రయోగం పడిపోతుంది. సంహరింపబడెను అనడానికి అవకాశంఉండదు. "యొక్క" అడావుడి కొంత ఉడుతుంది. రామునియొక్క పుస్తకం అనడానికిబదులు రాముడి(ని) పుస్తకం అంటాము. ఈపడు, ఈయొక్క సంస్కృతం వాళ్ళు తెచ్చిపెట్టిన బెడద మన తెలుగులోనికి. ఋషిప్రోక్తం అనగా ఋషులచేత చెప్పబడినది అని అర్థంచెప్పారుగాని ఋషులు చెప్పినది అని అర్థం ఒక్కనాటికి వాళ్ళు చెప్పేవారుకారు. రామస్యగృహం అంటే రామునియొక్క ఇల్లు అనాలిగాని రాముడి(ని) ఇల్లు అని అంటే చాలేదికాదు. షష్ఠీ విభక్తి యొక్క కనబడాలి అర్థంలో. ఆఅలవాటు అర్థంచెప్పేటప్పటితో ఆగక అంతటికీ ఎక్కింది. అసలు వ్రాతలకీకూడా ఎగబాకింది. బాగా ఒంటపట్టిపోయింది. కొత్త కొత్త అభిప్రాయాలతో

వ్రాస్తూ ఉన్నవాళ్లు గూడా ఈ పదులు, ఈ యొక్కలు తప్పించుకో లేకుండా పోతున్నారు, ఎక్కువగా వచనంలో. మంగలి దుకాణం దగ్గర "ఇచ్చట క్షౌరములు కత్తిరించబడును" అనే ఉంటున్నది కదా!

## క్రియల రూపాలు

వాడుకలో క్రియల రూపాలు చూస్తే వీటిలో చాలా మట్టుకు వ్యాకరణాలకు భిన్నంగానే ఉంటాయి. వాడుకలో విశేషముగా ఉన్న ఉంది, చేశాడు, వస్తాను, పోతున్నారు, ఇటువంటివి నిలుస్తాయి. వచ్చెంరి, ఉండెడివి మొదలయినవి పోతాయి. లిట్ లాట్‌లను గురించి కొట్టుకున్న బాలవ్యాకరణము సూత్రాలన్నీ చాలవరకు పనికిరాకుండా పోతాయి.

## బండిరాలు, అరసున్నలు

బండిరాలకి, అరసున్నలకి అవసరం ఉండదు. అన్ని రాలు ఒక్కలాగనే వ్రాస్తారు, పలుకుతారు. అర్థంలో ఏమైనా భేదం ఉంటే ఆ మాటకి రెండర్థాలున్నాయి అని అనుకుంటారు. అలాగే అరసున్నలు పోయి అవసరం ఉన్నచోట్ల రెండర్థాలు ఉన్నాయనుకుంటారు. అందరికీ చక్కగా బోధపడాలన్న ఉద్దేశాలతో వ్రాస్తూఉంటారు కాబట్టి ఈఅర్థమా, ఆ అర్థమా అన్న చిక్కులో ఎప్పుడూ మనం పడం. సందర్భాన్నిబట్టి అర్థం తెలుస్తూనే ఉంటుంది. కరము అంటే చెయ్యి అనడమా, కిరణమనడమా అని ఎప్పుడయినా గింజుకున్నామా? కనడం అంటే బిడ్డను కనడమా, చూడడమా



అని ఏ వ్రాతలోనైనా సందేహం కలుగుతుందా! అలాగే ఈ మాటలకి గూడా బాధ లేదు.

ఇప్పటి వ్యాకరణం పాట్లు

ఇలాగు మనం చక్కగా, పక్షపాతం లేకుండా అన్నీ ఆలోచించిచూస్తే, ఇప్పుడు మనం వ్యాకరణం అని వాడుక చేస్తూఉన్న సూత్రాల కట్టకి చాలా దెబ్బతగులుతుంది. పక్షపాతం లేకుండా ఉన్న ఎవరైనాసరే వ్యాకరణాన్ని (చిన్నయ్య సూరిగారిది) పట్టుకొని, పైని చెప్పిన మాటల ప్రకారం చూడండి. పనికిరాదన్న సూత్రాన్ని పుస్తకంలో ఎర్రసిరాతో కొట్టివేయండి. వాడుకలో లేని రూపాన్ని ఇచ్చే సూత్రం కొట్టవలసిందే. వాడుకలో ఉన్న రూపాన్ని కాదన్న సూత్రం కొట్టవలసిందే. అలా కొట్టివేసుకొని వచ్చేసరికి పుస్తకమంతా ఎర్రసిరా గీతలతో నిండిపోతుంది. ఇది నిజం. ఏవో కొన్ని సూత్రాలు మాత్రం నిలుస్తాయి. కాని ఇవి చాల తక్కువ. మహా తక్కువ. పోయిన సూత్రాలు వందలకొద్దీ ఉంటాయి. నిలిచిన ఆ నాలుగు సూత్రాలకోసం ఆ వ్యాకరణం మన తెలుగుభాషదనడం న్యాయంకాదు. ఆ వ్యాకరణం ఇంతకు ముందు వ్రాతగాళ్లు వ్రాసిన తెలుగుభాషది కావచ్చును. కాని ఇప్పటి భాషదికాదు. గతించిన తెలుగుది ఆ వ్యాకరణం. ఇప్పటి తెలుగుకి ఆ వ్యాకరణం పనికిరాదు. నూటికి తొంభై సూత్రాలు వాడుకకి పనికిరాకుండా ఉన్న వ్యాకరణం జీవంతో ఉన్న వ్యాకరణం కాలేదు. జీవంతో ఉన్న వ్యాకరణం కావాలంటే మరొక తొంభై కొత్తసూత్రాలు తయారుచెయ్య




వలసివస్తుంది. అలాగతయారైతే అప్పుడు సజీవమైనవ్యాకరణం తెలుగుకే కలుగుతుంది. అంతేగాని ఇప్పటి వ్యాకరణాన్ని సజీవమైనదని చెప్పడానికి వీలులేదు. దానితో ఈ తెలుగుకు పనిలేదు. అది చచ్చినదనే చెప్పవచ్చును.

కాని పూర్వగ్రంథాలని చదివినప్పుడు ఆ గ్రంథాలలో ఉన్న రూపాలనిగురించి తెలుసుకోవాలంటే ఈ వ్యాకరణాలు పనికివస్తాయి. ఇవి ఉంటేనేగాని ఆ గ్రంథాలు బోధపడవు. ఇంగ్లీషులో షేక్స్పియరు (1600 సం.) వ్రాసిన భాషకోసం ఒక వ్యాకరణం ఉంది. ఇప్పటి ఇంగ్లీషు వ్యాకరణంతో ఆమహా కవి వ్రాసినదానిని చదవాలంటే కొంత చిక్కు ఉంటుంది. కాని ఆ ప్రత్యేక వ్యాకరణం పట్టుకొని అతని కావ్యాలు చదివితే చక్కగా బోధపడతాయి. అలాగే, సజీవమయి అందరికీ బోధ పడుతూ వాడుకలోఉన్న తెలుగుకి ఇప్పటి వ్యాకరణాలు చచ్చినవాటితో సమానమే. అయినప్పటికి, పాత గ్రంథాలను చదివేవాళ్ళకి అది చాలా సహాయం చేస్తుంది.

ఆ వ్యాకరణం ఎందుకు చావాలి?

ఆ వ్యాకరణాలు నిర్జీవమై చచ్చినవాటితో సమానమే అని వ్రాయడం నాకు, ఆ మాటలు చదవడం మీకు, రెండూ చాలా విచారకరమైన సంగతులే. కాని ఆ మాటలు నిజం. ఇంతఘోరం ఎందుకు కలిగింది అని ప్రశ్నించిచూస్తే, మన వాళ్ళలో ఒక పెద్ద లోపం కనబడుతుంది. ప్రవాహంలాగ వాడుక—అందులోను పెద్దవాళ్ళలోఉన్న వాడుక—ఒకపక్క నుండి కొట్టుకొనివస్తూ కవినీ, పండితుడినీ, ప్రజలనీ అందరినీ



ఒక్కలాగ ముంచివేస్తున్నప్పటికీ, దానిని మనవాళ్ళు గుర్తిం చారుకారు. ఒకపక్కనుంచి కోస్తాలు కోస్తాలు కొట్టుకుపోతూ ఉన్నా, "అబ్బే, ఇదేపాటి ? చాల చిన్నది. అదే తగ్గిపోతుంది" అనే అన్నారుగాని జాగ్రత్తపడలేదు. కాబట్టే అంతా కొట్టుక పోవలసివచ్చింది. వాడుకలో వేరుతన్ని పండితుల నోటికెక్కి, కావ్యాలలోనికి ప్రాకిన రూపాలనుగూడా ఆ వైయాకరణులు అలక్ష్యం చేశారు. వందలకొద్ది కవులు ప్రయోగిస్తూఉన్నా, కవిత్రయంవాళ్ళు వాడుకచేయలేదు కాబట్టి ఆ ప్రయోగం తప్పు అనే అన్నారు. అంతేకాని, పాతసూత్రం సవరించడం మంచిదని అనుకోలేదు.

భట్టీయాలలో సూత్రాలని ఇనపక్రొముల్లాగ పట్టుకున్నారు. వంచడానికీ, పెంచడానికి వీలుమాత్రం ఇచ్చారుకాదు. ఆఖరికి ఇనపక్రొములు తుప్పుపట్టి చూర్ణం అయిపోయాయి. అలాగ కాకుండా, సందర్భాలనుపట్టి, చాల అవసరం అని అనిపించి నప్పుడల్లా ఆ సూత్రాలను కొంచెం సడలించిఉంటే, ఈనాటికి ఇంత ఆపద రానేరాదు. అప్పటికప్పుడు సవరిస్తూ వచ్చిన వ్యాకరణంలో ఈ నాటి వాడుకనుబట్టి ఏ నాలుగుసూత్రాలో సవరించుకొని ఉందును. అప్పుడా వ్యాకరణాన్ని నిర్జీవమైందని గాని, చచ్చినదానితో సమానమైందనిగాని అనవలసిన కష్టం మనకు తప్పిఉండేది.

కాని ఏమిచేయగలం ? వాళ్లకాబుద్ధి అప్పుడు పుట్ట లేదు. ఇప్పుడిది తప్పిందికాదు. తుదకు మన దారప్పోగు సూరి వ్యాకరణానికి ఉరితాడవుతుంది.

అలాంటిభాష చాలునా?

నలుగురికీ బోధపడాలన్న ఒక్క-సూత్రం నానాముఖాల వ్యాపించి, పలవలు చిలవలు పారి, పాత వ్యాకరణం ప్రాణాల మీాదికే వచ్చింది. ఇది చాలామంది అభిమానులకి చాలా కష్టంగా ఉండక తప్పదు. కాని, ఇదికాదని సాధించడానికి వీలు లేకుండా పోయింది. అలా వీలున్నదంటే అందరికన్నా నేనే ఎక్కు-వగా సంతోషిస్తాను. ఆ సంతోషానికి నోచుకున్నట్టు కనబడదు.

ఇప్పుడు ఒక సందేహాన్ని చాలామంది తీసుకొని వస్తారు. మాటలనీ, సమాసాలనీ ఈ సూత్రంతో చాలమట్టుకు అరికట్టారుగదా! వాడుకలోఉన్న మాటలు చాలా తక్కు-వ సంఖ్య. ఆ కొంచెం మాటలతో అన్నిరకాల భావాల్నీ ప్రకటించడానికి వీలుఅవుతుందా అని సందేహిస్తారు. గొప్ప గొప్ప భావాలని గురించి చెప్పవలసివస్తే ఈ కట్టుబాట్లు అడ్డవా అని అడుగుతారు.

ఇది చాలవరకు వట్టిభ్రమ. చాల గొప్పభావాలనీ, మిక్కి-లి అపూర్వమైన అభిప్రాయాలనీ కూడా చెప్పడానికి వాడుకలో ఉన్న మాటలు చాలును. ముమ్మాటికి చాలును. అపూర్వమైన భావాలతో నిండిఉన్న పుస్తకాన్ని పాఠశాలలో బోధపడుస్తూఉన్న తెలుగుపండితుడు మూడునాలుగువందల మాటల కన్నా ఎక్కు-వ వాడడు. ఆ మాటలన్నీకూడా వాడుకలో ఉండేవేకాని కొత్తమాటలు సాధారణంగా ఉండవు. ఇంగ్లీషులో గూడా ఉన్నతమైన అభిప్రాయాలతో నిండిఉన్న

 

గ్రంథాలలోని మాటలను లెక్కపెట్టితే మూడునాలుగువందల మాటలకు మించవు. అవిగూడా సాధారణంగాఉన్న మాటలే. కాబట్టి వాడుకలో ఉన్న మాటలు చాలవనిగాని, వాటికి చాలినంత శక్తిలేదనిగాని అనుకోవడం పొరబాటు.

మనమాటలకున్న శక్తివల్ల మహాభావాలనన్నిటినీ ప్రకటించవచ్చును. మాటలకున్న శక్తి చాల అద్భుతమైనది. చిన్న చిన్న మాటలు ప్రయోగంలో ఉన్న నేర్పునుపట్టి, గుండెలను నీరు చేసేస్తాయి. మహాభావాలని అరటిపండు ఒలిచిపెట్టినట్టు తెలుపుతాయి. వాటికి శక్తి లేదనుకోవడం తప్పు. ఇప్పుడు సాధారణంగా ప్రకటిస్తూఉన్న భావాలకి ఈ వాడుకలో ఉన్న మాటలు అన్నివిధాలా చాలును. ఇంతకన్నా ఎక్కువ భావం కలవాళ్లుంటే, ఆ భావానికి తగిన మాటలు నిజంగా లేకపోతే, వాడుకచేయనియ్యండి కొత్తమాటలూ, వాడుకలో లేని మాటలూ, పెద్ద సమాసాలూను. ఆ నాలుగింటికోసం పండితుల దగ్గరకో, నిఘంటువుల దగ్గరకో వెళ్తాము. ఆ భావం కోసం ఎంత శ్రమఅయినా సంతోషంతో తీసుకుంటాం. దానికి నేమందరము తయారుగా ఉన్నాము. కాని మొదట ఆ భావం వాడుకమాటలతో ప్రకటించలేమన్న మాట రూఢిచేసుకోవాలి వ్రాతగాడు.

## వేమన భావాలు

వాడుకమాటలతో ప్రకటించగలిగిన భావాలు ఎంత గొప్పవిగా ఉండవచ్చునో, ఎంతసూక్ష్మంగా ఉండవచ్చునో ఎన్నిరకాలు ఉండవచ్చునో, ఎన్ని లక్షలు ఉండవచ్చునో

నిదర్శనరూపంగా చూపించాడు మహాకవి వేమన్న. అతణ్ని చూస్తూ చూస్తూ మా భావాలకీ, మా అభిప్రాయాలకీ ఈ వాడుక మాటలు చాలవు అని చెప్పడం చాలా సాహస మనిపించుకుంటుంది. వేమన్న మనకి సజీవమైన నిదర్శనం. అన్నిరకాల అభిప్రాయాలకి తాళిన వాడుకమాటలు, అంతలేసి మహాభావాలకి తూగగలిగినవాడుక మాటలు, పాషాణాలని బోధపర్చడానికి పండితులకి చాలు ననిపించిన వాడుకమాటలు, ప్రపంచంలోఉన్న వ్యవహారాలకీ, ఉపన్యాసాలకీ, నిత్యజీవనానికీ లోపంలేకుండా పనికివచ్చిన వాడుక మాటలు, మాకు చాలవు అని చెప్పడం అన్యాయం. ఆలోచించకుండా, ప్రయత్నించకుండా చెప్పినమాట అవుతుందిగాని మరేమీకాదు. అంత ఫ్రుట్టి మునిగినంతభావం పుట్టినప్పుడు నెయ్యండి కొత్తమాటలు మేము వద్దనం. కాని వాడుక మాటలు మన అభిప్రాయాలకి తూగలేవు అనే దురభిప్రాయానికిమాత్రం జాగాఇవ్వకండి. అది చాలవరకు అసత్యం.

## ఇప్పటి బంగాళీ భాష

సంస్కృత సంబంధం మనకన్నా బంగాళీవాళ్ళకి ఎక్కువ గదా! బంగాళీ పండితులు మన పండితులకన్నా తక్కువ తిన్నవాళ్ళుకారు. మొన్న మొన్నటిదాకా ఆ పండితులుగూడా అంతరించిపోయిన వ్యాకరణ సూత్రాలతోనూ, సంస్కృత సమాసాలతోనూ బంగాలీభాషను వ్యవహారభాషనుండి చాలా దూరంచేశారు. బంగాలీ భాష సంస్కృతంలోని ఒక శాఖ అయినప్పటికీ ఆ భాషలోని బుద్ధిమంతులు, మహానుభావులు



కొందరు ఆ అన్యాయానికి ఒప్పుకోక తిరగబడ్డారు. భాష సజీవంగా చెయ్యాలంటే ఆ వ్యాకరణాలని చాలామట్టుకు మార్చాలనీన్నీ, ఈ సంస్కృతం ముష్టి ఎక్కువగ తగ్గిపోవాలనీ పూనుకొని చాలా ఉత్తమమైన గ్రంథాలు వ్రాయడం మొదలు పెట్టారు. రవీంద్రనాథ టాగూరు, శరచ్చందర్ బాబు, ఇలాంటి మహామహులంతా ఆ కొత్తభాషలోనే వ్రాయడం మొదలు పెట్టారు. దేశంలోని ప్రజలు ఆ గ్రంథాలని ఆమోదించారు. ఇప్పుడు సాధారణంగా పుస్తక పఠన అని అనరు. బొయ్ పొడా అంటారు. వేరుదిక్కు లేనప్పుడే సంస్కృతం తెచ్చుకుంటారు గాని వాడుకను మాత్రం వదలివేయరు. అనవసరంగా పెద్ద సంస్కృత సమాసాలు వాడడమే ఉండదు. సాధారణంగా బంగాలీ జనుల వాడుకలోకి వచ్చిన సమాసాలే వాడుతారు. సంస్కృతం తగ్గిపోయిందని వాళ్ల గ్రంథాలకేమయినా లోపం కలిగిందా? లేదు. ముమ్మాటికి లేదు. ఏ భాషలోనికయినా తర్జుమా చేయడానికి తగిన గ్రంథాలు శరత్ బాబులాంటి వారు వ్రాశారు. ప్రజలు చాల ఆదరణతో వాటిని ఆదరిస్తూ ఉన్నారు.

కాబట్టి సమాసాల వ్యామోహమూ, సంస్కృత వ్యామోహమూ పోతే సారస్వతం అంతా చప్పనై పోతుందనే దురభిప్రాయం ఉండకూడదు. ఈ వ్యాకరణాల భాషకన్నా వాడుకలో ఉన్న భాషతో వ్రాసే గ్రంథాలు జనుల ఆదరణని పొందకపోవని ఈ బంగాలీ భాషాచరిత్ర వేయినోళ్లతో చాటుతున్నది. అనవసరంగా ఆందోళన పడనక్కర లేదు.





## కొత్త గ్రాంథికభాష

ఈలాగ వ్రాస్తూఉంటే త్వరలోనే అందరికీ తెలిసే మాండలిక ప్రయోగాలు, క్రియారూపాలు తమంతటతానే బయటపడతాయి. అప్పుడు మనకు కొత్త గ్రాంథికభాష వస్తుంది. అందుకు తగిన వ్యాకరణాలు పుడతాయి. ఆ భాష, ఆ వ్యాకరణాలు (వాటితో వ్రాసేగ్రంథాలు) అన్నీ సజీవంగా ఉంటాయి. తెలుగు పుస్తకాలభాష తెలుగువాళ్లకి బోధపడకుండాఉండదు.

# 4

పాత వ్యాకరణం పరమపదించి పోయిందన్న
విషయం సూచిస్తూఉన్న నాటిక :

# సూరి మరణం

లేక

# బండిరా పల్లకీ




## రంగం - 1

[సూరిగారి ఇంటిలో ఒక గది. ఒక చిన్న బీరువాలో వ్యాకరణం పుస్తకాలు, తాటాకు కట్టలు, కొన్ని నోటుబుక్కుల కట్టలు, గోడను కొయ్యకు అతని తలపాగా, కోటు, కండువా ఉంటాయి. మంచంమీద సూరి పడుకొని ఉంటాడు. అతని విధవ కూతురు కాళ్ళదగ్గర కూర్చుంటుంది. ఒక ప్రక్కను పండితులు శాస్త్రి, దీక్షితులు ఇద్దరూ ఒక చాపమీద కూర్చుంటారు. ఇద్దరు సూరిగారి విద్యార్థులు శర్మ, అవధాని ఆగదిలోనే పని పాట్లు చేస్తూఉంటారు. వైద్యుడు చేతినాడి చూస్తూ ఉంటాడు.]





వైద్యుడు: (చేతినాడిచూచి) నే నిచ్చిన పొట్లా మిచ్చారా?

దీక్షితులు: తొమ్మిదిగంటలకే ఇచ్చామండి. కాని అప్పటినుంచీ అలాగే ఉన్నారు.

వైద్యుడు: బెండకాయ కషాయంపెట్టి ఉంచారా?

విధవకూతురు: అప్పాపావుకు మరగబెట్టి చల్లార్చి ఉంచా నండీ.

వైద్యుడు: లేచి దాహాని కడిగితే ఆ కషాయమే కొంచెం ఇవ్వండి.

శాస్త్రి: ఆలాగే. కొంచెం చక్కెర కలపవచ్చునా అండీ? వెగటుగా ఉంటుందేమో?

వైద్యుడు: ఏడ్చినట్టేఉంది. కొంపతీసి అలా ఇవ్వకండేం. మీ సంగతిచూస్తే రేపటివాణ్ని ఈవేళే చంపేటట్టుంది. అమ్మా, మీరు కొంచెం జాగ్రత్తగా చూస్తూ ఉండండి. వీళ్లు వట్టి ప్రపంచజ్ఞానం లేనివాళ్ళలాగ కనబడుతున్నారు. చక్కెర కలుపుతారట! చక్కెర! (మరొకసారి నాడిచూచి గాభరాగా కందికీ, మీదికీ వేళ్లుజరిపి, కొంతసేపటికి దొరికినట్లు కొంత ఆగి, తల ఆడించుకుంటూ వెళ్ళిపోతాడు.)

దీక్షి: వైద్యుడుగారు తటపటాయించడం చూస్తే కొంచెం నాడి తప్పుతూఉన్నట్టు కనబడలేదూ, శాస్త్రీ?

శాస్త్రి: అలాగే కనబడ్డదిగాని, అది వట్టి అనుమాన ప్రమాణం. చక్కగ ఊపిరాడుతూ ఉందిగదా! ఇదే మనకు ప్రత్యక్ష ప్రమాణం. దీనిబలం దానికుండదు.



అవధాని : వైద్యుడు నోటితో ఏమైనా చెప్పి ఉంటే మనకది శబ్దప్రమాణంకూడా అయిఉండేది కదండి ? అలా ఏమీ చెప్పకుండా తలమాత్రం ఆడించుకుంటూ పోయాడు.

శర్మ : నేను పరుగునపోయి, ఆ తల ఆడించడంలోని భావం ఏమిటి అని అడిగివస్తునా ?

దీక్షి : అలాంటి తెలివితక్కువ పనులేమీ చేయకు. చెప్పదగినదుంటే ఆయనే చెప్తాడు.

సూరి : (పక్కమీద కొంచెం కదిలి) హమ్మా (అని ఆయాసంగా ఊపిరి తీస్తూ ఉంటాడు).

కూతురు : నాన్నా, నాన్నా !

సూరి : (మాటలేదు).

శాస్త్రి : ఆయాసం కొంచెం ఎక్కువైనట్టు కనబడుతున్నది.

కూతురు : నాన్నా, నాన్నా, ఎలాగుంది నాన్నా ?

సూరి : (మరింత ఆయాసంగా ఊపిరి తీస్తుంటాడు).

కూతురు : ఏమండీ ఇలా అయిపోతున్నాడు ? నాన్నా, నాన్నా—నే నేంచేసేది దేవుడా ! (అనుకుంటూ పెరటితలుపు వేయడానికి పోతుంది.)

దీక్షి : (పెదవి విరిచి) అవసానంలాగే కనబడుతూ ఉంది.

శాస్త్రి : ఇంతలోనే అవసానం అయితే వైద్యుడు ఆమాట చెప్పకుండా పోతాడా ?

శర్మ: వాచా కాకపోయినా, వ్యంగ్యంగా నైనా సూచనఇచ్చి ఉండడా!

సూరి: (ఆయాసం మరింత ఎక్కువ.)

అవధాని: మరింత ఎక్కువ ఔతూఉందండీ. అవసాన—

కూతురు: (తిరిగివచ్చి) అవసానమేనా? నాన్నా—నాన్నా—అవసానమేనా?

సూరి: (పెదవులు కదుపుతాడు.)

శర్మ: ఉండండి, ఉండండి, గురువుగారు మాటలాడుతున్నారు.

సూరి: (ఆయాసంతో) అవసానంబున—ద్రుతంబునకు—లోపము—నిత్యమన్నాడా?

దీక్షి: నిత్యం ఎలా అవుతుంది? బహుళమే అన్నారు.

శాస్త్రి: బహుళం అనడంకన్నా విభావన అంటేనే బాగుంటుంది. ఎంచేతనంటే—

సూరి: (ఆయాసంతోనే) అవసానంలో - లోపం - నిత్యమేఅనాలి. దృష్టాంతాలు - అనేకం - నిత్యం - లోపం - నిత్యం (మరింత ఆయాసం.) అమ్మా!

అందరు: (ఒకరిమొగం ఒకరు చూచుకుంటారు.)

కూతురు: నాన్నా, నాన్నా నాకేంగతి చెప్పావు నాన్నా? వెళ్లండోయ్ బాబూ, ఎవర్లైనావెళ్లి వైద్యుణ్ణి తీసుకురండోయ్ నాయనా. నాకేంగతి చెప్పావు నాన్నా?



శాస్త్రి : అవసానంలో ద్రుతానికి లోపం నిత్యం అంటే, పద్యాలన్నీ పాడయిపోవూ ?

పీ డె వ

చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామా కృష్ణన్.

ఇక్కడ ద్రుతం ఎలాగలోపిస్తుంది ?

దీక్షి : అవునండీ. అందుకే బహుళంఅని చెప్పారని అన్నాను.

సూరి : (మరింత ఎక్కువ ఆయాసం.) హాః !

శాస్త్రి : బహుళం అన్నారుగాని అదీ పొరపాటే. విభావననడం న్యాయం.

అవధాని : విభావనకీ, బహుళానికీ భేదం ఏమిటండీ శాస్త్రిగారూ ? సూరిగారు ఏదో చెప్పారుగాని తలకెక్కలేదు.

శర్మ : తలకెక్కడం ఎందుకు ? విషమా చావడానికి? వెంగళప్పా, గుండెకేపడితే చాలదురా ?

కూతురు : మీ వాదన పాడుగానూ. చూడండోయ్ బాబూ, ఎలాగైపోతూఉన్నాడో! నాన్నా, నాన్నా! వైద్యుణ్ణి పిలవండి.

(శర్మ బయటికి వెళ్తాడు.)

సూరి : ఇదిగో – లోపం – నిత్యం – నిత్యం.

దీక్షి : (తనతలను వేలితో చూపుతూ, శాస్త్రితో) ఇదీ – లోపిస్తున్నాది.

సూరి : హుం... (చచ్చిపోతాడు.)





కూతురు: నాన్నా, నాన్నా...మరెక్కడ నాన్న? నాన్నా, సరా?...(అని మీదపడిపోతుంది.)

దీక్షి: సూరిగారూ! సూరిగారూ! శాస్త్రీ, ఆ ఆకాశగంగ కొంచెంతే - అవధానీ, పట్టు, పట్టు, కిందికి దించేదాం. మంచంమీద పోకూడదు...మెల్లగా...మెల్లగా (దించుతూ), అమ్మా, కొంచెం ఈ గంగ నోటిలో పొయ్యండి.

కూతు: (కదలదు.)

శర్మ: (తిరిగివచ్చి) దీక్షితులుగారూ, పురోహితుడు వచ్చి నక్షత్రం మంచిదికాదు, అరుగుమీదికి తీసుకు రమ్మంటున్నాడు.

దీక్షి: అన్నా, పెద్దచిక్కే! పట్టండిమరి. అమ్మా నువ్వుకొంచెం లే.—ఊ! పట్టండి. (అందరు మెల్లగా అరుగు మీదికి తీసివేస్తారు. కూతురు ఏడుస్తూఉంటుంది.)

[ తెర ]



## రంగం - 2

[సూరి ఇంటిచావడి. బయట అక్కడక్కడే వాళ్ళంతా పనులుచేస్తూ ఉంటారు. స్కూలు మేష్టరు, విద్యార్థులు, ఇరుగుపొరుగువారు ఒక్కొక్కరు దిగుతూ ఉంటారు. భోషాణపు పెట్టెమీద కొందరు, తిరగవేసి ఉన్న రోలుమీద ఒకరు, చాపలమీద కొందరు, నిలబడి కొందరు ఉంటారు. చాపలమధ్యనుంచి కొంచెం దారి ఉంటుంది. ఆ దారినిబడి పనివాళ్ళు ఇటూ, అటూ తిరుగుతుంటారు. విధవకూతురుగూడా ఆ దారినే వస్తూ, పోతూ ఉంటుంది. ఒకరిద్దరు చాటుగా సిగరెట్లు కాలుస్తూ ఉంటారు. బయట జోళ్ళు పోగుబడి ఉంటాయి. దీక్షితులు, శాస్త్రి, అవధాని, శర్మగూడా ఉంటారు.]

శాస్త్రి : అవధానీ, పోతయ్య భజనజట్టు ఇంకా రాలేదేమి ?

అవ : ఇదిగో వస్తున్నానని బయలుదేరాడండీ.

దీక్షి : అందర్నీ జమచేసుకొని రావాలా మరి ?

కూతు : (దారినిపోతూ) నేనేం చేసేది నాయనా ! నాకేం గతిరా నాయనా......

శర్మ : పోనీ, నేనువెళ్ళి మరొక జట్టును పిలవనా ? అప్పలస్వామి భజనజట్టు దగ్గర్లోనే ఉంది.

శాస్త్రి : ఒద్దొద్దు, పునరుక్తిదోషం పడుతుంది. పోతయ్య జట్టే రావాలి.

దీక్షి : ఏమిటి శాస్త్రీ, ఆ జట్టు విశేషం ?

శాస్త్రి : (మెల్లగా) ఏమీలేదు. ఆ జట్టుకి కొన్ని పాటలు వ్రాసి ఇచ్చాను, ఈ సమయంలో పాడాలని.

దీక్షి : గట్టివాడవే. ఎంత దూరదృష్టి !

స్కూలుమేష్టరు : కాన్ఫరెన్సులకి 15 రోజులు ముందుగానే పద్యాలువ్రాసే కవులున్నారుగాని, చావుకి పాటలు ముందుగా వ్రాసినవాడు ఇతనొక్కడే.

ఒకడు : సమయం దొరుకుతుందంటే ఊరక పోనిస్తారా, మన పండితులు ?

స్కూలుమేష్టరు : పండితులా, చాదస్తాలా ? వీళ్ళకి చావూ, పెళ్ళీ ఒక్కలాగే కనిపిస్తుంది.

కూతురు : (దారినిపోతూ) అదిగో, అదిగో, ఆ బిందెలు మాత్రం తీయకండి. నాకేం దారిరా నాయనా...

ఒకడు : మహా గొప్పపండితుడు పోయాడు.

దీక్షి : గొప్ప పండితుడంటారేమిటి ? ఒక నక్షత్రం అస్తమించిందనండి. ఏడీ మళ్ళీ ఒకడు ఆ లోపం పూర్తి చేయడానికి ?

శాస్త్రి : పాండిత్యం ఎంతఉందో పట్టుదల అంత. వాదించేశక్తి ఎంతో సాధించే నేర్పు అంత. మళ్ళీ నూరేళ్లు తపస్సుచేసినా ఇలాంటి మహా వైయాకరణి దొరకడం దుర్లభం.

మేష్టరు : ఎక్కడెక్కడనుంచో పండితులు వాళ్ళ సందేహాలని వీరికి వ్రాసుకునేవాళ్ళు.

అవధాని : ఎలాంటి సందేహానికయినా ఒక్క మినిటులో సమాధానం వ్రాసేసేవారు. మేము చూస్తూనే ఉండేవాళ్ళం. వ్యాకరణమూ, ప్రయోగాలూ అలా జిహ్వాగ్రాన్ని ఉండేవి.

శర్మ : (మెల్లగా) కాగితముమీద వ్రాయడానికి జిహ్వాగ్రం ఏమిట్రా వెంగళప్పా ? వేళ్ళచివరనుండేవి అనరాదూ ?



అవ: (శర్మను చాటుగా ముడుకుతో పొడుస్తాడు.)

[భజనజట్టు పాట బయటనుండి]

అయ్యో! వైయాకరణీ—నీ
వస్తమించితివె తరణీ - అయ్యో.

[ఆంధ్రభాషలో వ్యాకరణమునకు]

ఆదుకు నెయ్యది ధరణీ—అయ్యో.
శకట రేఫముల సందేహంబులు
అర్ధబిందువుల అనుమానంబులు
కళాద్రుతంబుల గలవాదంబులు
సాధురూపములు సందిగ్ధంబులు
ఇదమిత్థంబని పదుగురు మెచ్చగ
నిర్ణయించుటకు నేర్పరులే రిక ? ...
అయ్యో...

దీక్షి: ఆంధ్ర వ్యాకరణానికీ, పండితులకీ గట్టిదిక్కు—పోయింది.

అద్యాధారా నిరాధారా
నిరాలంబా సరస్వతీ

అన్నట్టయింది.

శాస్త్రి: ఓహో! వారిదేమి పాండిత్యం! ఏదయినా వాదన వచ్చినప్పుడు చూడాలి వారి ధోరణి. సూత్రాలూ, ప్రయోగాలూ, ఆక్షేపణలూ, సమాధానాలూ, అలా కుంభ వృష్టిగా కురుస్తూ ఉండవలసిందే. ప్రతివాదులు గుటకలు మింగవలసిందే.





నేస్తరు : ఆవేళ టవున్ హాలులో జరిగిందే ఆ మీటింగు—

దీక్షి : అదా ? భారతప్రయోగం "అందిమ్మ" క్త్వార్థ కేకార సంధికాదని సూరిగారివాదన. ఓ ! రాత్రి పదిగంట లయింది మీటింగు అంతంఅయ్యే టప్పటికి.

[మాటలాడుతూ ఉండగా ప్రవేశము కాలేజీ స్టూడెంట్లు మూర్తి, రావు, శ్రీనివాసం. వీళ్లు దూరంగాఉండి వారిలోవారే మాటలాడు కుంటుంటారు.]

రావు : (మూర్తి చెవిలో) అందిమ్మకి అంత వాద నెందకురా ? కంఠశోషగాని.

శాస్త్రి : దిగ్దంతులు, దిగ్దంతులువచ్చినా (చిటికెలు వేస్తూ) అలా, అలా జయించేసేవారు.

కూతురు : (దారినిపోతూ) అందర్నీ జయించావు నాన్నా ఈ రోగాన్ని జయించలేకపోయావా నాన్నా...

అవధాని : అష్టుతిరుగుతే అమాంతంగా అణిచేసేవారు.

శర్మ : చూడూ, ఆ పుల్లయ్య నేంచేశారో !

ఒకడు : ఆయ నెవరండీ ఆ పుల్లయ్యగారు ?

దీక్షి : ఆయనగూడా ఒక గొప్ప వైయాకరణే; రాజ మందిరం. "వేగ" ద్రుతప్రకృతికమా, కళా అని రాద్ధాంతం జరిగింది. పుల్లయ్యగారు కొంచెం విజృభించబోయారు.

శాస్త్రి : విజృంభించడమన్నా ఒకలాగా ? పుల్లయ్య గారే గెలుస్తా రనిపించింది అప్పటికి.

దీక్షి : అనిపించడానికేం ? సూరిగా రేమిచేశారు ? అటూ, ఇటూ రెండు పట్టీలు కొట్టించి, "అయ్యా, పుల్లయ్య



శాస్త్రిగారూ, ఆంధ్రభాషకు అక్షరాలెన్నో మీకు నిర్ధారణగా తెలుసునా” అని అడిగారు ముక్కు గుద్దినట్టు.

శ్రీనివాసం : అంటే చేతగానితనం అన్నమాట కాదట్రా రావూ ?

అవధాని : మరేముంది ? పాపం పుల్లయ్యగారు తడుము కోవడం ప్రారంభించారు. అక్షరాలెన్నో చెప్పలేనివారు అప శబ్దాలను నిరూపించేవారా అని పుల్లయ్యగారిని పెట్టిన తిప్పలు నిజంగా మరచిపోలేము.

మేష్టరు : ఏమండీ దీక్షితులుగారూ, ఆంధ్రభాష కక్ష రంబు లేబదియారు అని నేర్చుకున్నాము కాదండీ ?

దీక్షి : 56 అంటే 55 అంటారు. 55 అంటే 56 అంటారు. దిక్కుమాలిన క్ష అన్న అక్షరం ఒకటుందికదా ?

మేష్టరు : మంచి సమయస్ఫూర్తి ఉందన్నమాట.

శాస్త్రి : ఎంత తెలివిలేకపోతే ఎన్నెన్ని వ్యాకరణాలు చచ్చి శవాలయి ఉంటే, వాటిని బయటికి తీసి జీవంపోసి మళ్ళీ బతికించారు !

రావు : (తమలో) పొరపాటు, పొరపాటు. ఆ వ్యాకర ణాలన్నీ మళ్ళీ శవాల్లాగే ఉన్నాయి. డాక్టరుని పిలవండి చెప్తా తాడు.

కూతు : (దారినిపోతూ) ఎన్నిటిని బతికించినా, నాన్నా, నిన్నొక్కటికూడా బతికించలేదా నాన్నా. ఇదిగోనండీ, కొత్తదోవతి (అని పనివాళ్ల కందిస్తుంది.)

[ బయాట భజన పాట ]

అర్థబిందువు పోయెరా - ఇక
　　అర్థమే నశియించురా
వ్యర్థపదముల వ్రాతలిటపై
　　వందలునువే లగునురా... ॥అర్థ॥

బండిరా కనబడదురా - ఇక
　　భాషయే చెడిపోవురా
పండితుల మనువారి కిటపై
　　పరువు నిల్చుటె సున్నరా... ॥అర్థ॥

అవధాని : ఆయన వ్రాసిన పుస్తకాలు ఎన్ని, ఎన్ని అచ్చు కాకుండా ఉన్నాయి!

శాస్త్రి : అవును. అర్థానుస్వారవివేక చింతామణి, శకటరేఫ నిర్ణయ ప్రతివాది కుఠారము, భాస్కర భట్టీయ కర్తృత్వ సందేహ నివారణ సిద్ధాంజనము, ఇంకా ఎన్నో అచ్చుకాలేదు.

మూర్తి : (మెల్లగా) వాసూ, పేర్లే ఇంత భయంకరంగా ఉన్నాయి, పుస్తకా లెలాగుంటాయో? అచ్చు కాక పోవడం ఆంధ్రుల అదృష్టం అనవలసిందే.

దీక్షి : నిజంగా, వాటిలో చూపించిన ప్రతిభా, పాండిత్యమూ చూస్తే ముక్కుమీద వేలు పెట్టుకోవలసిందే. ఆ గ్రంథాలు బోధపర్చుకోగల వైయాకరణి ఏడీ మళ్ళీ ఈ దేశంలో?



రావు: (తనలో) మీరు నలుగురూ చాలరా, ఈ బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమునకు ?

శాస్త్రి : ఈ మహామహు డుండబట్టే కుక్కకూతలూ, నక్కకూతలూ పుస్తకాల వ్రాతలకింద చెల్లుబడి కాకుండా భాషా గౌరవం నిలిచింది.

మూర్తి: గౌరవం నిలిచిందో, జీవం పోయిందో భాషకి, ఎవడు చూచాడు ?

దీక్షి : ఇతనివల్ల పండితులమంతా బతికాము. లేకపోతే మా కింగిలీషు రాదని నెత్తిమీద కొంగువేసి ఆనాడే ఇంటికి పంపించివేసి ఉందురు.

మేష్టరు : పంపించాలనుకుంటే, మీకు తెలుగురాదని పంపుతారుగాని, ఇంగ్లీషు రాదని పంపివేస్తారా ఎక్కడైనా ? పాపం.

శ్రీని : అది నిజంరా మూర్తీ, ఆఖరికి వీళ్ళకి తెలుగు రాదనే పంపిస్తారు. సంస్కృతం బుకాయింపులతో కాలక్షేపం చేస్తున్నారని సాగనంపుతారు. అది తప్పదు.

కూతు : (దారినిపోతూ) ఎవర్ని పంపినా, మానినా, నాన్నా, నిన్నుమాత్రం పంపించేశామా నాన్నా...

పనివాళ్లు : (బయట) ఊ, ఊ, లెండి, లెండి.

(సంకులం. కూతురు ఏడుపు. చెప్పులు వెదుక్కోవడం. అందరూ ముందు నడుస్తుంటారు. రావు, మూర్తి, శ్రీనివాసం వెనుక తగ్గుతారు. పాట)





[ పా ట ]

నుక్కలు టుక్కలు దిక్కమాలును,
యడాగమంబులు సడలిపోవును,
పడు ప్రయోగము పాడైపోవును,
కుసంధులికపై కుప్ప తెప్పలగు,
అదియును ఇదియును అనగా నేటికి
ఆంధ్రభాషయే అంతరించునిక
అయ్యో వైయాకరణీ
వస్తమించితివె తరణీ.

## రంగము-3

[రావు ఇంటిలో ఒక గది. కుర్చీలమీద రావు, మూర్తి, శ్రీనివాసం కూర్చుని మాట్లాడుతుంటారు. టేబిల్ మీద ఒక పత్రిక, రెండు పుస్తకాలు ఉంటాయి.]

మూర్తి: సూరి గట్టివాడేగాని, క్లాసులో బండిరాల తోనూ, అరసున్నాలతోనూ మా ప్రాణాలు తీసేవాడు (పకపక నవ్వుతాడు).

శ్రీని: ఏదో జ్ఞాపకం వచ్చింది. ఏమిటి మూర్తీ సంగతి ?

మూర్తి: ఒకనాడు సూరి బండిరాలను గురించి ప్రశ్న లడుగుతూ, నామీందివాణ్ని "బరువు"లో ఏ రేఫ ఉంది అని అడిగాడు. తరవాత నన్ను చూచి, "చెరువు"లో ఏముం టుంది అని గట్టిగా అడిగాడు. నేనేమన్నాను తెలుసునా ?

 

"చెరువులో నీళ్లుంటాయండీ, వర్షాలు బాగా కురిశాయి" అన్నాను. సూరికి కోపంవచ్చింది. "నెకుస్టు" చెరువులో ఏరా యుంటుంది అని నా తరవాతవాడ్ని అడిగాడు. వాడూ నాలాంటివాడే. "బండరా యుంటుందండి" అని టక్కున చెప్పాడు. సూరి రైట్ అని నన్ను సిల్చోమన్నాడు. అంద రమూ గొల్లున "కాదండీ, వాడు బండరా యన్నాడండీ" అని అరిచాము. "కాదు, వాడు బండిరా అన్నాడు" అని సూరి వాదించాడు. వాడినడగండి అంటాము మేము. అడగడం ఎందుకు అంటాడు సూరి. వాదనతో ఆ గంట అంతా అయి పోయింది. ఆఖరికి ఆ కుర్రవాడ్ని అడిగాము. వాడు, "అవు నండీ, చెరువులో పెద్దబండరాయి లేదంటారేమిటి?"అన్నాడు. క్లాసులోని అల్లరి మరి చెప్పడాని కుందా? హెడ్‌మాస్టరు గబగబవచ్చి "ఏమిటండీ సూరిగారూ, మీ పాఠాలు జరగవు సరేకదా, మా పాఠాలుగూడా కానీకుండా చేస్తున్నారేమిటి? ఏమిటి, ఈ గలభాఅంతా" అన్నాడు. సూరి తెల తెల్లపోయి, "లేదండీ, శకటరేఫ నిర్ణయంమీద పాఠం చెప్తున్నాను" అన్నాడు.

శ్రీని: అదీ, వాళ్లు పాఠాలు చెప్పేమార్గం. అంతా పాడు.

రావు: నిజమేసుమా, ఈ పండితుల మూలాన్ని ఆంధ్ర భాష వట్టి రోకలిపాట అయిపోయింది. అసలు సారస్యాన్ని వదిలేసేవారు. ఈ దిక్కుమాలిన వ్యాకరణాన్నీ బండీరాలనీ పట్టుకొని పీకులాడేవాళ్లు.





శ్రీని : నేను చూచినంతమట్టుకు ఇలాంటి పండితుల నందరినీ అండమాన్ దీవులకి పంపించేస్తే ఆంధ్రభాష బాగు పడేటట్టు కనిపిస్తూ ఉంది. భాషనీ, పుస్తకాలనీ నిర్జీవంగా చేసి పారవేశారు. అమాంతంగా ఆయువుపట్లు నొక్కేశారు.

మూర్తి : వీళ్ల సూత్రాలతోనూ, అరసున్నాలతోనూ, ఎలాగయితేనేమి ఆంధ్రభాష ఆంధ్రులకి బోధపడకుండా చేశారు. స్వభావం ప్రకారం వ్రాయడం సున్నా చేశారు.

రావు : బండిరా తప్పిందంటే బండబూతులు కూసేవారు. అరసున్నాలకీ, ఆయువుపట్లకీ లంకెవేసుకునేవారు. సమాసాల కోసమే దేవులాడారుగాని, సారస్యంకోసం, సహజత్వంకోసం కాదు.

మూర్తి : కాని సూరి పోయాడు కాబట్టి వ్యాకరణ విజృంభణ కొంత తగ్గుతుందనుకుంటాను.

రావు : అదిమాత్రం నిజము. ఇకను సూరిలాగ పట్టు దలకోసం ప్రాకులాడేవాడూ లేడు, వ్యాకరణం అంతగట్టిగా చదివినవాడూ లేడు.

మూర్తి : అవును, ఈ మిగిలినవాళ్ళంతా అర్థచదువు గాళ్ళే...అరసున్నాలు. దమాయించి అడిగితే తెల్లబోతారు.

శ్రీని : అంతేకాదు, వీళ్ళకి ప్రపంచజ్ఞానం కొంచెం ఉంది. చూస్తూ చూస్తూ సబబయిన దానిని కాదని వాదించ లేరు. ఒప్పుకుంటారు. సూరి కది పూర్ణానుస్వారం.

రావు : అందుచేత సూరి మరణం ఆంధ్రభాషకొక మేలే అన్నమాట. ఈరోజు ఒక సుదినంలాగ కనబడుతూ ఉందే.



మూర్తి : ఆహా ! అందు కభ్యంతరం యేమీ లేదు. ఇదొక మహాసుదినం. భాషాభివృద్ధి కాకుండా పట్టి ఉంచిన సంకెళ్ళు ఈనాడు బద్దలయిపోయినా యన్నమాట. ప్రజలకూ, పండితులకూ, మధ్యను వచ్చిన మహాసముద్రాలు, పర్వతాలు, మహారణ్యాలు ఈవేళ ఎగిరిపోయా యన్నమాట. సుదినం కాదా ?

శ్రీని : ప్రజలకి బోధపడేదే భాష. పట్టీలు కొట్టే దంతా ఘోష అవుతుం దికను.

రావు : నిజమైన తెలుగు వ్రాతలకి ఈవేళ జన్మ దివసం. తలకాయలో కొట్టే సర్కసు మొగ్గలు తగ్గిపోతాయి.

మూర్తి : సంస్కృతం దడబడలకీ, శకట రేఫలకీ, సంధి సూత్రాల సన్నిపాతాలకీ ఈ వేళనుంచీ దేవిడీమన్నా.

రుద్ధప్రధ్వో న్ప్రసతావస్సకదినమతి
కృద్రోదసీ శ్యామతాసం
బద్ధధ్వోయాన ధట్టా

మహిమకృన్ హరిన్మధ్యమానాంబరంబై

అన్నది తెలుగుపద్యం కా దికను.

శ్రీని : కతిపయదివసంబులు గతించిన యనంతరంబు అనడానికి బదులు, కొన్నాళ్ళు పోయిన తరువాత అని అంటా రన్నమాట.

మూర్తి : తెలుగువాళ్ళం బతుకుతాం. ఈ దినం చరిత్రల్లోకి ఎక్కిపోతుంది. మహా సుదినం.

రావు : వాళ్ళన్నట్టు, చిరస్మరణీయం. ఎన్నడూ మరవ రానిరోజు.

శ్రీని : ఇంత సుదినంకదా ! మనమెందుకు ఈ రోజు ఒక ఉత్సవం చేయరాదు ?

మూర్తి : ఉత్సవం ఏమిటి ?

శ్రీని : చేదాంఅని చెప్పండి. నాకొక మంచి ఆలోచన తట్టింది చెప్తాను.

రావు : ఆ ఆలోచన ఏమిటో చెప్పుదూ. ఉత్సవం సంగతి తరవాత నిశ్చయిద్దాం.

శ్రీని : (పకపక నవ్వుతూ) బలే, బలే, చాలా అపూర్వంగా ఉంటుంది. ఊరంతా గుబ్బుమంటుంది. (నవ్వుతాడు).

రావు<br>మూర్తి } ......(నవ్వుకుంటారు).

శ్రీని : వినండి చెప్తాను.

( తెర )



## రంగం - 4

[రావుఇంటిదగ్గిర. బయట బాజాలు మోగుతూ ఉంటాయి. "ఇందిరా పల్లకీ" అంతా పటంలో చూపించినట్టే తయారై ఉంటుంది. మూర్తీ, శ్రీనివాసం పల్లకీకి అన్నీ అమరుస్తూ ఉంటారు. చాలామంది గుంపుగా చూస్తూ నవ్వుకుంటూ ఉంటారు. నరసింహం ప్రవేశిస్తాడు.]

నర : (ప్రవేశిస్తూ) ఏమిటిది. రామారావు ఈ సందడంతా ?

రావు : ఇదా, సూరిగారికి ఊరేగింపు. మా పల్లకీ చూశావా ?

నర : ఇదేమిటి ? పెద్దబండిరాలాగా తయారుచేశారు ?

మూర్తి : (పల్లకీ సవరిస్తూనే) ఒక్క బండిరా ఏనా ? ఇంకాచూడు.

నర : ఈ మీద సివేమిటోయ్, చంద్ర రేకలలాగున్నాయి ?

రావు : చంద్ర రేకలు కావు, అర్థానుస్వారాలు.

శ్రీని : ఎంతపేరు చెప్పావు ! అరసున్నా లనకూడదా రావూ ?

నర : మూర్తీ, ఈ శిఖరంమీద ఏమిటిది ?

మూర్తి : అది నిండుసున్న, పూర్ణానుస్వారం, "ంబు"ల కోసం.

నర : (నవ్వుతూ) ఇదేమి టీకట్లు కర్రమీద ?

రావు : ఆకట్లా ? అవి నుగాగమాలు, టుగాగమాలున్నా. ముందుకు ఆగమాలు, వెనక్కి ఆదేశాలు, అన్నీ వ్యాకరణం తళుకులే.





నర : (నవ్వుకుంటూ) ఆహా ! అన్నిటికీ అన్ని అర్థాలున్నా యన్నమాటే. ఈ గొలుసులాగున్నా దేమిటి ?

మూర్తి : అది గొలుసుకట్టు కారికలు. చిక్కు అల్లిక.

రావు : ఆదారాల కుచ్చుఉందే, అదే సూత్రాలకట్ట.

మూర్తి : సూరిగారు వ్యాకరణాలు తలక్రిందపెట్టుకొని వీటిని చూస్తూ ఉంటారు. తెలిసిందా ?

నర : తెలియడం ఏమిటి, ఈపల్లకీ అంతా ఒకప్రబంధ కవిత్వంలాగుంది. దీనిపేరేమిటి ? శకటరేఫపల్యంకిక అంటారా?

మూర్తి : అర్థానుస్వారాల అనంతశయనం.

శ్రీని : అదిగో, మళ్ళీ ఆ పెద్దపెద్దపేర్లే అంటారు. బండిరా పల్లకీ అనకూడదూ ?

రావు : వేళయిపోతూఉంది, రెండి, రెండి, సూరి గారిని తీసుకురండి.

నర : సూరిగారెక్కడున్నారు మూర్తీ? చచ్చిస్వర్గాన్నుంటే !

రావు : మరేమీ ఫర్వాలేదు. మళ్లీ సూరిగారు మన కెక్కడవస్తారు అనే మేముక రూపాంతరాన్ని సాధించాము. రూపాంతరాలు సాధించడం వైయాకరణులు చెప్పినపాఠమే. మూర్తీ, తీసుకురా సూరిగారిని.

మూర్తి : (ఒక బొమ్మను తెస్తూ) ఇదిగో, వైయాకరణి సూరిగారు.

అందరు : (నవ్వుతారు.)

శ్రీని : మీరారిదంతా చూస్తూఉండండి. నేను భజన జట్టు ఒకటి తయారు చేస్తాను. (అని కొందరిని జమచేస్తాడు.)



రావు : అదిగో, ఆ వ్యాకరణాలు తలగడలాగ పెట్టండి. వాటిమీద చక్కగా ఉంచండి సూరిగారిని.—ఆ...ఆలాగ. వేయండి నాలుగు పువ్వులు. ఓయ్, బాజావాళ్ళు నడవండి ముందుగా.

మూర్తి : శ్రీనివాసం, నీ భజనజట్టు, బాజాల వెనక పెట్టు. అంతా సిద్ధం అయిందా ?

శ్రీని : ఓ, సర్వంసిద్ధం. నీకింకా ఈసంస్కృతంమాటలు పోయాయికావు.

రావు : (అందరినీచూచి) అయ్యా, మరి ఆలస్యం ఎందుకు, బయలుదేరుదామా ?

మూర్తి : ఊ, ఊ, ఎత్తండి...ఎత్తండి పల్లకీ.

(భ జ న పా ట )

సూరిమరణము చూడగారండి - జనులారమీరు
దారిపొడుగున వేడ్కచూపండి - సూరి।
సూరిమరణముతోనె బండాల్ పారిపోయెను, వ్రాతకోతలు
తేరుకొని దేశానికున్నతి తెచ్చునిశ్చయ మింకమీదట — సూరి॥

బోయీలు : రుయ్, వృయ్, రుయ్, వృయ్ ♦ (అంటూ సవారీ మోస్తుంటారు).

[తెర]

♦ వృయ్ రుయ్ అన్న ఇవిగూడా వ్యాకరణ సూత్రాలలోని పరిభాషకు చెందినవే !

## రంగం-5

[ఏటిఒడ్డు. ఊరేగింపు చేసుకొని బండిరా పల్లకీతో అంతా వస్తారు. కర్రలు పేర్చి ఉంటాయి.]

[భజనపాట (నడుచుకుంటూవస్తూ)]

ఒక్కడవె వెళ్ళిపోకూ—మా సూరి—

ఒక్కడవె వెళ్లిపోకూ...

ఎక్కడేముండునో, ఎటుదారితప్పునో,

దిక్కు తెన్నూ లేని దేశానికెళతావు...ఒక్క॥

దిక్కునీవేఅన్న నుక్కులూ టుక్కులూ
ఆశ్రయించుకఉన్న అరసున్న గుంపులూ
నిండుభక్తిని గొల్చు బండిరాదండులూ
ప్రక్కతోడుగనుండ పంపుదుము నీతోడ...ఒక్క॥

రావు: (పాట అయిపోయిన తరవాత) ఆ, ఆ, దించండి పల్లకీని.

మూర్తి: శ్రీనివాసం, ఇందాక ఇచ్చిన కర్పూరం, గంధపుచెక్కలుగూడా అందులో వెయ్యి.

శ్రీని: (వేస్తాడు.) ఆ వేశాను.

రావు: మరెందు కాలస్యం? రండి, పట్టండి, సూరి గారిని.

(మూర్తి తలవైపు, రావు కాళ్ళవైపు, శ్రీనివాసం నడుముపట్టుకొని బొమ్మను పేర్చిన కర్రలమీదికి తెస్తుంటారు. మూర్తిచేతిలో వ్యాకరణం తలగడకూడా వచ్చివేస్తుంది.)

నర: (తొందరగా) మూర్తీ, మూర్తీ, అదిగో, వ్యాకరణం తలగడకూడా ఈడ్చేస్తున్నావు, చూడు.



శ్రీని : అదీ బాగానేఉంది. రానీ, రానీ. వైయాకర ణికి, వ్యాకరణానికి అభేదం. ఆ వ్యాకరణంకూడా రావలసిందే కర్రలమీదికి. రానీ, మూర్తీ, రానీ...ఆ! ఆవ్యాకరణాల నిలా తలకిందపెట్టు!...ఆ! ఇక నిప్పంటించండి.

(కర్రలమీద సూరిబొమ్మనీ, వ్యాకరణాన్నీ పెట్టి నిప్పు అంటిస్తారు.)

అందరు : గోవిందా, గోవిందా!

(కర్రలు మండుతూ ఉంటాయి)

శ్రీని, మూర్తి : (రావుతో ఏదో చెప్తారు. ముగ్గురూ మెల్లగా నవ్వుకుంటారు.)

రావు : అయ్యలారా, ఈ మహాసమయంలో నన్ను ఏవైనా రెండు ముక్కలు చెప్పమన్నారు. సంగతేమిటో మీకందరికీ తెలిసేఉంది. అన్యాయమైన కట్టుబొట్లు, అర్థంలేని సంకెళ్లు పోయినటువంటిదినం ఎవరికైనా ఒక మహాసుదినం అవుతుంది. స్వభావానికి, వాడుకకి విరుద్ధంగా ఉండే సూత్రా లతో ఆ వ్యాకరణం మన భాషనినిర్జీవంగా చేసింది. అదీ నిర్జీవమయింది. ఆ నిర్జీవమైన వ్యాకరణాన్ని పట్టుకొని మన వైయాకరణి సూరిగారు భాషనీ, ప్రజలనీ అలా కట్టిపడ వేశారు. ఉంబులనీ టుగాగమాలనీ, సంస్కృత సమాసాలనీ చూచారుగాని, జనసామాన్యానికి బోధ పడుతుందా, లేదా అని చూడలేదు. వ్రాతలంటే ఒక గారడీ,ఒక సర్కసుగా చేసే శారు. వ్రాసేవాళ్ళకి, ప్రజలకి మహాపర్వతాలు అడ్డమయి పోయినాయి. ఈ మహాఘోరం ఒకనాడా, రెండునాళ్ళా?





ఒకవెయ్యి సంవత్సరాలు ! మహానుభావులు నన్నయ్య మొదలైనవాళ్ళు పెట్టినభిక్ష. ఆ చిక్కులనుంచి నేటికి మనకు విముక్తి కలిగింది. ఇకమీదట నలుగురికీ తెలియాలని వ్రాసిందే వ్రాత అవుతుంది. ఎవరికి తెలియకుండా ఉండాలని వ్రాసిందంతా రోత అవుతుంది. నిజమైన తెలుగు వ్రాతలకి ఈదినమే ఆరంభం. కాబట్టే ఈ ఉత్సవం. దీనినింత జయప్రదంగా నడిపించినందుకు మీ కందరికీ వందనాలు.

అందరు : బంధ విముక్తికీ జేయ్ !

శ్రీని : రావూ, మరీ బండిరా పల్లకీ మనకెందుకు ? (కన్నుగీటును.)

మూర్తి : బండిరా పల్లకీ ఒద్దు. అరసున్నా చాందినీ ఒద్దు.

రావు : అయితే వేసేయండి నిప్పులో.

(భ జ న పా ట)

వెయ్యండయ్యా, వెయ్యండయ్యా, వేగం వెయ్యండి
అరసున్నాలను ! బండిరాలనూ – అగ్గిని వెయ్యండి.

అందరు : (బండిరాపల్లకీని ముక్కలుచేసి ఎవడిచేతికి దొరికినదానిని వాడు అగ్గిలోవేస్తాడు.) గోవిందా ! గోవిందా ! (వెళ్లిపోబోతారు.)

మూర్తి : అయ్యలారా, నేను రెండే రెండు మాటలు చెప్తాను. కొంచెం ఆగండి. దైవప్రార్థన చేసుకొని వెళ్లిపోదాము.



ఓ భగవంతుడా, వెయ్యి సంవత్సరాలు మా భాషనీ, మా కావ్యాలనీ వీరందరూ పెంచుకున్నారు. తమ కట్టు బొట్టుకు లొంగదీసి భాషనీ, దేశాన్నీ జవదాట నీయకుండా పాలించారు. గొప్ప గొప్ప కార్యాలు చేసినవారికి పునర్జన్మ లేకుండా చేస్తావట. ఇంతకన్నా గొప్పకార్యం చేసినవాళ్ళు ఉండడం కష్టం. కాబట్టి ఓ దయామయా, మాయందు కరుణించి ఈ సూరిగారికి, ఈ వ్యాకరణానికి, ఈ బండిరాలకి, ఈ అరసున్నాలకీ తిరిగీ మా లోకంలో ఎప్పుడూ జన్మ లేకుండా ఉండేట్టు తప్పకుండా చేయాలి. ఇదొక్కటే మా ప్రార్థన.

అందరూ : తథాస్తు.

బలే ప్రార్థనరా !

రండి, ఆ యేటిలో మునిగేసిపోదాం.

(తెర)



# 5

# విషయానికి సూత్రం

భాషని గురించి పైన చెప్పిన నాలుగు ముక్కలూ చెప్పేటప్పటికి మా ఆచారి, చెట్టి వగైరా విమర్శకులు తలా ఒక ప్రశ్న అడగడానికి తయారయ్యారు. ఒరతీసిన కత్తుల్లాగ ఢీ అనడానికి సిద్ధం అయిపోతున్నారు. అప్పుడు నేను

“ఆగండి, కొంచెం ఆగండి. మీరందరు నన్ను ఇప్పుడు ప్రశ్నలతో ముంచివేయడానికి సిద్ధమై పోతూఉన్నారు. మీరు ఆ ప్రశ్నల నడగడం ఆరంభించారంటే, ఇక వాటికి నేను సమాధానాలు చెప్పడానికి పూనుకోవల ఉంటుంది, న్యాయం గాను. మీరడిగే ప్రశ్నలు ఒకటి రెండయితే మరేమీ అడ్డు లేకుండా వాటికి సమాధానాలు ఇప్పుడే చెప్పి, ఆ తరవాత నా రెండో దారం సంగతి ఎత్తుకోడానికి వీలుకావచ్చు. కాని మీరు ఇప్పుడు నామీద ఒకటి రెండు కాక, ప్రశ్నలవర్షం కురిపించడానికి తయారుగా ఉన్నారు. ఆ ప్రశ్నలన్నిటికీ బదులు చెప్పుకొని వచ్చేసరికి ఈ రెండో దారం సంగతే మన మనసులలో నుండి జారిపోతుంది. జపం విడిచి లొట్టలలో పడతాం. అలా గయినా కాకపోయినా, నాకు ఇప్పుడు తట్టుతూ ఉన్న



అభిప్రాయాలు, ఆ వరస, అంతా పోక తప్పదు. అది అంత మంచిపనిగా కనబడకుండా ఉంది. కాబట్టి, మీరు ఒక పని చేస్తే బాగుంటుంది. మీకు ఇప్పుడు తోచిన సందేహాలు ప్రశ్నలు కొంచెం జ్ఞాపకముంచుకోండి; లేదా ఒక చిన్న కాగితం ముక్కమీద వ్రాసుకొని ఉండండి. ప్రశ్న చిన్నది గానే ఉంటుంది కాబట్టి అది జ్ఞాపకం ఉంచుకోవడం అంత కష్టమైన పనికాదు. నేను చెప్పవలసిందంతా అయిన తరవాత మీ ప్రశ్నలకి జవాబు చెప్తాను. నాగోల ఏదో చెప్పనీయండి" అని అన్నాను. పాఠకులకికూడా అదే నా ప్రార్థన.

మా అభాజనుడు ఊరుకుంటాడా ? "ఆపని మీరేచేసి ముందు మా గోలే మీరు వింటేనో!" అని అడిగాడు. కాని, తక్కిన మా విమర్శకులు "అది అన్యాయమైన మాటకాదు. మనది ఒక ప్రశ్న. వారిది ఒక పెద్ద విషయం, దానికొక వరస ఉంటుంది. అనేక భాగాలు ఉంటాయి. మన ప్రశ్న అంటే ఏదో గిలికివేయగలంగాని వారా సంగతంతా వ్రాసుకో గలరా ఇప్పుడు?" అని అభాజనుడ్ని అడ్డి, "కానీయండి, మీ రెండో సూత్రం ఏదో చెప్పండి" అని తలా ఒక ముక్క, అందరు కలిసి అన్నారు.

నేను ఇంతకుముందు చెప్పినట్టు ఈ రెండోసూత్రం లోపల ఉండే విషయానికి. అంటే, కత, కల్పన, వర్ణన, ఊహ అంతటికీన్నీ. ఇన్నిటినీకలిపి, చిన్న పేరుగా ఉండాలని, ఈ సూత్రం భావానికి అని అన్నాను. మొదటిది భాషకి, రెండోది భావానికి అంటే యతికూడా కుదుర్తుందని ఒక ఆశ - ప్రాస

కోసమేడ్చానే కూసుముండా అన్నట్టు. ఈపాటి తెంపరితనాన్ని ఆంధ్ర మహాజనులు సైరించలేరా అని ఒక ధైర్యంకూడా ఉంది.

ఇంతవరకూ ఉన్న వాదనలు

మన సారస్వతాన్ని గురించి భాషనిగురించి వాదనలు, ప్రతివాదనలు ఇప్పటివరకు జరగకపోలేదు. బుద్ధిమంతులు, భాషయందభిమానం ఉన్నవాళ్ళు, అనేక సారస్వతాలను చూచినవాళ్లు చాలారోజులనుంచి వాదనలు జరుపుతునే ఉన్నారు. అముద్రితగ్రంథ చింతామణీమయూఖాల రోజులలో పూర్వ గ్రంథాలలో ఉన్న పద్యాలకు అర్థాలు చెప్పడానికి వాదనల్లో దిగేవారు. పద్యాలకి వాళ్లు చెప్పిన అర్థాలకన్నా ఆరోజుల్లో వాళ్ళు ఒకరినొకరు తిట్టుకుంటూ ఉండేరకంమాత్రం చాలా తమాషాగాఉండేది. ఆతిట్లు మొన్న మొన్నటిదాకా కవులన్న పేరుగల వాళ్ళంతా పెద్ద ముచ్చట్లులాగ చెప్పుకొనే వారు. పద్యాలలో తిట్టుకునేవాళ్లు కొందరు, పదాలలో తిట్టు కునేవాళ్లు కొందరు, నాటకాలలో పాత్రలకు పేర్లుపెట్టి తిట్టు కునేవాళ్లు కొందరు, ఇలా ఉండేది వాదన సాగసంతాను. వీళ్లందరూ బుద్ధిమంతులే. కవులే, పండితులే. ఈ రకాల వాద నలు ఇప్పటికీ ఇంకా ఉన్నాయి. ప్రస్తుతం మనకున్న మంచి మంచి పత్రికలలోకూడా ఇలాంటి విమర్శన ప్రతి విమర్శనలు జరుగుతూ ఉండడం చూస్తూనేఉన్నాం. విమర్శన అంటే ఏమిటో, అది ఏలాగు ఉండాలో చెప్పమంటే చెప్పేవాళ్ళు చాలామంది ఉన్నారు. కాని రంగానికి దిగిపోయే టప్పటికి,



ఆ సూత్రాలన్నీ మరచిపోతారు. అందుచేతనే ఈ రోజులలో కూడా పెద్ద పెద్ద పేరులు ఉన్న పెద్దవాళ్లు అలా వ్రాయడం కలుగుతున్నది. పత్రికలవాళ్ళు ప్రచురిస్తున్నారు కారా అంటారు ? ప్రచురించడానికేమి లెండి; దానికి అనేక కారణా లుంటాయి. చదివేవాళ్లకికూడా కొంత వేడుకగా ఉండి కాల యాపనకి కొంత పనికివస్తుంది. కాని ఆ విమర్శకుల సంగతి ఏమిటనాలి ?

వాళ్ళు ఇతర దేశాలలోని విమర్శనలు, వాటిలో మంచి చెడ్డలూ గ్రహించినవాళ్ళు మాత్రం కారని అయినా చెప్పాలి; గ్రహించినా అలాగ వాళ్లు నడవలేదు అని అయినా చెప్పాలి.

మరికొన్నాళ్ళకి ఇంగ్లీషు బాగా చదువుకున్నవాళ్ళు, అందులో విమర్శనలు, వాటి సంప్రదాయాలు బాగా తెలిసిన వాళ్లు లేచారు; గ్రంథాలలో ఉన్న భాష ఎవరికీ బోధపడ కుండా ఉందనీన్నీ, భాషను మరామత్తు చెయ్యాలనీన్నీ వాదిం చారు. దానినే గ్రాంథికభాష—గ్రామ్యభాష వాదన అనే వారు. అదే వ్యావహారికభాష అన్న పేరుతో ఇప్పుడు వాడుతూ ఉన్నారు. ఈ వాదన దగ్గర దగ్గర 15, 20 సంవత్స రాలనుంచీ * జరుగుతూ ఉంది. ఎక్కువ బుద్ధిగలవాళ్ళు, పెద్ద చదువు గలవాళ్లు అయిగూడా, చాలామంది ఈ వాదనలో పడిపోయారు. ఇరవై సంవత్సరాలు వాళ్లు సాధారణంగా, ఈ వాదన తప్ప మరేమీ చేయలేదు. వాళ్ళ తెలివి, వాళ్ళ ప్రజ్ఞ, వాళ్ళ ప్రతిభ, వాళ్ళ చదువు, వాళ్ళ విమర్శన అంతా

---

* అంటే ఈ వ్యాసాలు వ్రాసిన నాటికి - 1936.





ఈ వాదనలతోనే తెల్లవారింది. ఈ వాదన ఆరంభంలో (అనగా గ్రామ్యభాష అన్న రోజులలో) నేనుగూడా ఈవాదన ప్రవాహంలో పడ్డవాడినే. గ్రామ్యభాష వస్తూఉంది అనే సరికల్లా పిట్టకలానికి పుట్టింది ఉద్రేకం. గ్రాంథికభాషయందు అభిమానం కలిగించాలని ఆంధ్రభాషా స్వీయచరిత్రను ఆది నుండి అప్పటివరకూ ఒక నవలలాగ 'ఉషఃకాలము' అన్న పేరుతో వ్రాసి ప్రకటించాను. గ్రాంథికభాషవాళ్లు కందుకూరి వీరేశలింగం పంతులుగారు, జయంతి రామయ్య పంతులుగారు మొదలైనవారు ఆ గ్రంథాన్ని, దానిలోని గ్రాంథికభాషనీ చాలా మెచ్చుకున్నారు. అప్పుడే గ్రామ్యభాషను నిరసిస్తూ చంపకమాలిక ఒకటి వ్రాశాను. పిట్టకలం వ్రాతే అయినా ఆ చంపకమాలికలో పిరపిరలు కొంచెం తక్కువ - ఉపన్యాస రూపంగాఉంది, అందరికీ తెలియాలన్న ఉద్దేశంతో వ్రాసినది కాబట్టి.

ఎలాగయితే నేమి ఇరవై సంవత్సరాలకాలం ఈ భాషను పట్టుకునే మంచి మంచి మేధావులంతా తమ శక్తులని వినియోగించారు. భాషనుగురించి వాదించడమే ప్రధానం అనుకున్నారు.

## దర్జీ వాదన

భాషకి ఉండవలసిన ఆధిక్యం ఉంది. అదిలేదని ఎవ్వరము చెప్పలేము. కాని, ఎంత ఆధిక్యం ఉన్నప్పటికీ, అది సారస్వతంలో ఒకభాగం. బయటి ఆకారం మాత్రమే. సారస్వతానికి భాష దుస్తులు లాంటిది. కోటు, చొక్కా, చీర, ఉత్తరీయం



ఇలాంటివాటితో సమానం అవుతుంది. అంతేకాని ఎక్కువ కాదు. విషయం అన్నదే అసలు మనిషి. ఈ సంగతి అందరూ ఒప్పుకుంటారు. ఈ ఇరవై సంవత్సరాలు మన మేధావులంతా ఆ దుస్తులను పట్టుకుని విమర్శించడమూ, వాదించడమూ చేశారు. కోటు, చొక్కా వీటిని గురించే వాళ్ల కాలంఅంతా వెళ్ళబుచ్చారు. వెళ్లబుచ్చుతూ ఉన్నారు. అంటే ఇంతవరకూ మనం చేసిందంతా దర్జీవాదన అన్నమాట. అంటే కుట్టుపని వాడి వాదన. ఈ దర్జీవాదనలో పడిపోయి అసలు మనిషిని – విషయాన్ని – గాలికి వదిలివేశాము. ఆ విషయం ఒక దారీ తెన్నూ లేకుండా, గాలికిపుట్టి, గండాన పెరుగుతూ ఉంది. వాళ్ళు వాదించుకోవడమే చూచుకొన్నారుగాని, గ్రాంథిక భాషనో, కాకపోతే వ్యవహారిక భాషనో ఏమిటి వ్రాయాలో వాళ్లు మరి చెప్పలేదు. వాళ్లువాళ్లు నిర్ణయించుకున్న భాషలో ఎలాంటి విషయాన్ని వ్రాయడమో చెప్పారు కాదు. గ్రాంథిక భాషలోనే వ్రాయండి అని వాళ్ళంటే, వ్యావహారిక భాషలోనే వ్రాయండి అని వీళ్ళన్నారు. అంతేకాని, ఆ భాషను ఎలాగ వినియోగిస్తే సారస్వతానికి మేలుకలుగుతుందో చెప్పలేదు. వాదనలో పడిపోయిన ఈ బుద్ధిమంతులంతా, తలా ఒక చక్కని పుస్తకం వ్రాసి ఉన్నట్టయితే వాళ్ల వాదనలకి చాలాబలం కలిగిఉండేది. సారస్వతానికి కొంత మేలు కలిగి ఉండేది. వ్రాతగాళ్లకు కొన్ని మార్గాలు దొరికి ఉండేవి. దేశానికి కొంత ఉపకారం గలిగి ఉండేది. ఎందుకిలా అటూ ఉన్నానంటే, ఆ వాదనలో పడినవాళ్లలో చాలామంది గట్టివాళ్లు. అలాంటి మంచివిషయాలతో పుస్తకాలు వ్రాయ

డానికి శక్తి ఉన్నవాళ్లు. అలాంటివాళ్ళ కాలం అంతా ఈ దర్జీ వాదనతోనే నిండిపోయింది. ఈ వాదనలకోసం వ్రాసిన పుస్తకాలవల్ల దేశానికిగాని, ప్రజలకిగాని ఏమిలాభం ? వ్యాకరణాలు ఎప్పుడు ఎగిరిపోతాయో అప్పుడే, వాటిమీద వ్రాసిన వాదనలూ ఎగిరిపోతాయి. తరవాత ఇవీ చదవరు, అవీ చదవరు; చదవడం ఎందుకు ? ఇలాగ వాళ్లు వ్రాసిన పదివేల పేజీలు, వీళ్ళు వ్రాసిన తొంభై వ్యాకరణాలు నట్టి బూడిదెలోపోసిన పన్నీరులాగ పోతుంది. దానికి బదులుగా వాళ్ళ వాదనని ఒకసారో, రెండుసార్లో ప్రకటించి, తరవాత, ఆ వాదనని అనుసరించుకొని మంచి గ్రంథాలు ఏవైనా వ్రాసిఉంటే, చాలా మేలు కలిగిఉండేది. ప్రజలకి ఆదరణ ఎటుప్రక్క ఉండేదీ తెలిసిపోయి ఉండేది. వాళ్ళవాళ్ళ వాదనలలోని బలాబలాలు తేలిపోయి ఉండేవి. భాషకి కొంత ఆర్జన కలిగిఉండేది. అలాగ జరగలేదు. పూర్వపు గ్రంథాలనన్నిటిని పట్టుకొని, ముక్కకు ముక్కా, అక్షరాని కక్షరమూ విడదీశారు. మాటలనన్నిటిని గుత్తులు గుత్తులుగాకట్టి ఇళ్లల్లో గోడలనన్నిటినీ అలంకరించారు. రూపాంతరాలని సాధించారు. శతాబ్దాలు, యుగాలు, అంటూ కవుల ప్రయోగాలు నిర్ణయించారు. సుందరమైన తెలుగుతల్లి ఒంట్లో ఉన్న ఎముకలనన్నిటినీ విడదీశారు. ఆ ఎముకల వంకర టింకరల నన్నిటినీ నిరూపించారు. సముద్రాల లోతుల లోకి దిగారు. కొండలు పిండిజేశారు. మహాద్భుతమైన కార్యము చేశారు. కాని సారస్వతానికి అభివృద్ధి ఎంత కలిగిందో ఆలోచించండి !



## సంస్కర్తలు

భాషని బాగుచెయ్యాలని ఉద్దేశించినవాళ్ళు అనేకులు అనేక దేశాలలో పుట్టుతుంటారు. ఇంగ్లండులో అడిసను, స్టీలు అనేవాళ్ళు భాషని బాగుచేయాలని తలంచారు. అవసరాన్ని గురించి నాలుగు ముక్కలు చెప్పారు. చెప్పినతరవాత గ్రంథాలు వ్రాయడం మొదలుపెట్టారు. ఆ గ్రంథాలవల్ల వాళ్ళ అభిప్రాయాలు వ్యాపించిపోయాయి. సాహిత్యానికి కొంత మంచి ఆస్తి దొరికింది. గ్రంథాలు మంచివి కాబట్టి అందరూ ఆ వ్రాతలనే ఆదరించారు. అలాగ వ్రాయడానికే పూనుకున్నారు. తిట్టకుండా, తిట్లుపడకుండా, వాళ్ళ కార్యాన్ని సాధించుకున్నారు.

బంగాలీ భాషలోనుగూడా ఈశ్వరచంద్ర విద్యాసాగర్ మహాపురుషుడు భాషను బాగుచెయ్యాలనుకున్నాడు. నా లుగు మాటలు చెప్పాడు. తరవాత గ్రంథాలు వ్రాయడం మొదలు పెట్టాడు. అతని అభిప్రాయాలన్నీ ప్రచారంలోనికి వచ్చాయి. రవీంద్రనాథ టాగూర్ భాష ఎలాగుంటే మంచిదో తాను నిశ్చయించుకున్నాడు. అందుకుతగినట్లు చక్కని గ్రంథాలు వ్రాశాడు. తరవాతవచ్చిన వ్రాతగాళ్ళంతా ఆదారినే పట్టారు. సంస్కరణ చల్లగా జరిగిపోయింది. భాషా బాగుపడ్డది. సాహిత్యమూ బాగుపడ్డది. లక్షణమైన గ్రంథాలు కలిగాయి. నిక్షేపంలాంటి గ్రంథాలు దొరికాయి. దేశమూ, ప్రజలూ బాగుపడ్డారు. వారివారికి గలజ్ఞానమూ, ఓపూ, భాషాభక్తీ అన్నీ సార్థకమయినాయి: శ్రమకిఫలం కలిగింది. అంతా

సవ్యంగా జరిగింది. కాని మన ఆంధ్రభాష విషయంలో మాత్రం మనకి ఆ అదృష్టం కలగలేదు. ఎందుచేతనంటే దర్జీవాదన ఎక్కువ అయిపోయింది. విషయంమీద దృష్టి తప్పిపోయింది.

విషయం

అంత తేలికగా విడిచిపెట్టవలసింది కాదు విషయం అనేది. ముఖ్యం అయింది అదే. గ్రంథానికి విలువ తెచ్చేదీ, ప్రజలకి లాభం ఇచ్చేదీ విషయమే. మరొక్కటికాదు. అంటే మన ఆలోచనకి చాలాముఖ్యమైంది అన్నమాట. గ్రంథం పెద్దదయినా, చిన్నదయినా, ప్రతిగ్రంథానికీ కొంత విషయం ఉండాలి. అంటే వ్రాతగాడు చెప్పాలి అనుకున్నసంగతి. అది కతకావచ్చు, ఊహ కావచ్చు, మరేదయినా కావచ్చు. ఏదో విషయం ఉండాలి. విషయం లేనిదే గ్రంథం ఉండదు. వట్టిగాలి మూటకట్టితే గ్రంథంకాదు. అసలు అలా చెయ్యాలన్నా వీలు లేదు. వ్రాతగాడు ఎంతపనికిమాలిన వాడయినా, ఎంత మహా తెలివైనవాడయినా, సంస్కృత సమాసాలగారడీ వాడయినా, వాడుకభాషవాదన గాడయినా, ఎవడైనా సరే, ఏదో ఒక విషయంలేనిదే అల్లలేడు. ఆఖరికి, ఖండకావ్యాల కవి కాని య్యండి, ఏకాంకనాటకాలన్నట్టు ఏకపద్య కావ్యాల కవి కాని య్యండి, లాభంలేని ప్రేమఅనో, తీగతెగినవీణ అనో, చూస్తూ ఉండడనే పరమానందం అనో, పేదరికానికి పేగ పెద్దదనో, విముక్తికోసం తలుపులు తెరచి ఉంచాననో, ఏదో విషయాన్ని ఎత్తుకోక తప్పదు.



ఆవిషయంలోనూ, దాన్ని గురించి వ్రాయడంలో వ్రాతగాడి ఊహలలోనూ, ఉండే మంచి చెడ్డలనుబట్టీ ప్రజలకి మేలు గాని కీడుగాని కలుగుతుంది. గ్రంథం ఉపయోగం అయిందీ కానిదీ తెలుస్తుంది. గ్రంథంలో ఉన్న సత్తా తేలుతుంది. సారస్వతానికి పుష్టో నష్టో కలుగుతుంది. అలాంటి విషయాన్నిబట్టే మనజాతికి గౌరవమో అగౌరవమో కలుగుతుంది. ఇంతముఖ్యమైనదాన్ని విడిచిపెట్టారంటే, ఎంత విచారించాలో వేరే వ్రాయడ మెందుకు?

మొదటి అగచాట్లు

ఈవిషయాన్ని గురించికూడా పూర్వపు వాళ్లు చాలా శ్రమపడ్డారు. భాషలో ఎన్ని అగచాట్లుపడ్డారో విషయంలోను గూడా అన్ని అగచాట్లుపడ్డారు. మొట్టమొదట ఉండే, 'గాసట బీసట' వ్రాతగాళ్లకి దేశంలో జరుగుతూఉండే సంగతులు విషయాన్ని ఇస్తూఉండేవి అని అనుకోవడం న్యాయంగా కనబడుతూ ఉంది.

పదాలు, పాటలు

గొప్పగొప్ప శూరులుచేసిన కార్యాలూ—యుద్ధంలో జయించడం కానీయండి, మంచి పందిరి వెయ్యడం గానీయండి-పతివ్రతల చరిత్రలు-సహగమన మయినాసరే, ఆత్మత్యాగం అయినాసరే - ఇలాంటివి వ్రాతగాళ్లకి ఉద్రేకం కలిగిస్తూ ఉంటాయి. ఆ ఉద్రేకాన్ని పాటలలాగో, పదాలలాగో, ఎలాగో ఒకలాగ బయటవేస్తాడు. అది పదిమందిలోనూ పాటలాగ





ప్రచారం చేస్తూంది. అలాంటివే కాటమరాజుకత, బాల నాగమ్మకత మొదలైనవి.

ఇవేకాకుండ, పురాణాల కతలు అనేకం ఉండేవి. దేవాలయాలకి సంబంధించిన కత లుండేవి. మత సంబంధం అయిన కతలు ఉండేవి. ఇన్నిటిని గూడా ఆ వ్రాతగాళ్లు ఆ రూపంగానే వ్రాసేవారు, ఆ కతల్ని కంఠపాఠంచేసి, వాటికి తగిన వేషాలతోనూ, అంగులతోనూ కొంతమంది ఊరూరు తిరుగుతూ ప్రజలకి తెలుపుతూ ఉండేవారు. వాటినిపట్టే ప్రజలకి వేడుక, వినోదం, ఉత్సాహం, బుద్ధి, నీతి, వివేకం, విజ్ఞానం, పుణ్యం అన్నీ కలిగేవి. పుణ్యానికీ, పురుషార్థానికీ అదే దారిగాఉండేది. మాట, పాట, ఆట, మీాట అన్నీకలిసి ఆదిభట్ల నారాయణ దాసుగారు అన్నట్టు, అద్భుతంగా పనిచేసేవి. ప్రజల హృదయాల్లో ఆ కతలు, ఆ పాటలు, అచ్చుపడి ఉండిపోయేవి.

ప్రజలు ఇళ్లల్లో పనిపాటు చేసుకుంటున్నప్పుడు వాటిలో నుంచే సామెతలు చెప్పుకొంటూ, బుద్ధులు చూపుకుంటూ, నీతులు నేర్పుకుంటూ ఉండేవారు. అవే తెలుగువాళ్లకి దొరికిన మొట్టమొదటి ఆస్తి.

సా మె త లు

నిజం చెప్పాలంటే, మన వాడుకలో ఉన్న సాధారణమైన సామెత లన్నీ ఈ మొదటి వ్రాతగాళ్లిచ్చినవే అనాలి. రైతులవాడుకలో ఉన్నసామెతలు చాలామట్టుకు - ఈ సామెతలు లక్షలకొద్దీ ఉన్నాయని తెలిసిన సంగతే - ఈ మొదటి వ్రాతగాళ్లు పెట్టిన భిక్ష అనకతప్పదు. ఇతర సామెతలు



ఈలాగే వేలకొద్దీ ఉన్నాయి, చాలా అందమైనవిన్నీ, ఎక్కువ బుద్ధిని తెల్పేవిన్నీ. అవి నన్నయాదులు ఇచ్చినవికావు, ప్రబంధకవులూ ఇచ్చినవికావు. వీళ్ళగ్రంథాల్లో ఎక్కడైనా ఒక సామెతపడితే, అది గ్రంథానికి ఒక అలంకారంలాగ భావిస్తూ ఉన్నాం. ఈ అలంకారాలని నన్నయాదుల కిచ్చినవాళ్లు ఆ పాతవ్రాతగాళ్లు. వాళ్ళ పలుకులు మన గొప్ప కవీశ్వరులకి తళుకు లయాయి. 'గాసట బీసట' అని పరిషత్తులు, సభలు, సిరసిస్తేనేం ? ఈ పదాలతోనే ప్రజలని యుద్ధ రంగాలకి ఉరికించేవారు; మతాలని మార్చేవారు; న్యాయాన్ని నడిపించేవారు; ప్రవర్తనలని బాగుచేసేవారు; అందాలని చూపేవారు; ఆదర్శాల నిచ్చేవారు. నిజంగా, సాహిత్యం చేయవలసినపని అంతా ఆ రోజుల్లో ఈ పాటలూ, ఈ పదాలే, చేస్తూ ఉండేవి. వ్రాతగాళ్లు గూడా వాళ్ళరోజుల్లో జరుగుతూ ఉన్న సంగతులూ, ఆచారాలూ, వ్యవహారాలూ కతలలోకి ఎక్కించేవారు. వాళ్ళ ఊహాలకి కనబడ్డట్టూ, ప్రజలకి బోధపడేటట్టూ వర్ణనలు చేసేవారు. పాటలోఉన్న సంగతీ ఆ వర్ణనా అంతా తెలుస్తూఉండేది కాబట్టి ప్రజల హృదయాలు అలా ఉర్రూత లూగుతుండేవి. అంతకన్నా వ్రాతగాడికి కావలసిం దేమిటున్నది ? సాహిత్యసేవ అంతా అప్పుడే సమకూడింది అన్నమాట.

## పు రా ణ క థ లు

పురాణాలలోని కథలు, రామాయణ భారతాలలోని కథలూ, అన్నీ ఈపాటలలోనే, ఈ పదాలతోనే, దేశంలో

ప్రచారానికి వచ్చాయి ఆరోజులలో. పల్లెలలోనూ, గ్రామాలలోనూ ఉన్న పాటకజనానికి ఈపురాణ కథలు తెలుసునంటే, అది నన్నయ్య భారతమూ, భాస్కర రామాయణమూ చేసినపనికాదు. ఈ మొదటి వ్రాతగాళ్ళు చేసినపనే. అందుచేత అనేక విషయాలలో వాళ్ళకు తెలిసిన కథలు మన పండితకవుల భారత రామాయణాలకు భిన్నంగా ఉంటాయి. నన్నయ్యచేత భారతం వ్రాయించడానికి పూర్వం- అనగా 12 వ శతాబ్ది వరకు - తెలుగు ప్రజాసామాన్యానికి భారతం కథ తెలియనే తెలియదంటే నవ్వుతారు. నన్నయ్య పుట్టడానికి ముందుగూడా గ్రామాలలో ఈ కథలు ప్రచారంలో ఉండేవి. నిశ్చయం. దానికి కారణం ఎవరు? ఈ మొదటి వ్రాతగాళ్ళేకదా !

రాజులు, ధనికులు

వాళ్ళ పాటలనే రాజులూ, రెడ్లూ, ధనికులూ అంతా వింటూ ఉండేవారు. రాజనీతి పురాణగాథలు, వీరుల చరిత్రలు, ఆగమాలు అన్నీ ఈ రూపంగానే వాళ్ళ కెక్కువగా తెలుస్తూ ఉండేవి. పాటగాళ్లు వాళ్ళ ఆదరణను పొందుతూ ఉండేవారు. ఇప్పటికీ చాలామంది రాజులు (చిన్నచిన్న రాజులు) ఈలాంటి పాటగాళ్ళని పిలిపించి, వారాలకొద్దీ వారి గ్రామాలలో ఉంచుకొని, వాళ్ళ పాటలని వింటూ ఉండడమూ, వాళ్ళకి బహుమానాలిచ్చి సాగనంపడమూ ఉంది. ఈ పదాలవాళ్ళు వచ్చారంటే గ్రామాలలో కలిగే ఉత్సాహం ఇంతింతకాదు. తిళ్లూతిప్పలూ మానుకొని ఆపాటలకి చెవులూ,హృదయాలూ



ఇచ్చివేస్తారు. ఎంత గట్టివాడు పురాణం చెప్పినా, అలాంటి ఆవేశం కలిగించలేడు ప్రజలలో. ఈపదాలవాళ్ళకి వారికే బహుమానాలు అందుకు తగినట్టే ఉండేవి. చూచేవాళ్ళకి కొంచెం కన్నుకుట్టక మానదు. అందులోనూ, 'వాళ్ళుచెప్పిందంతా వట్టి పేలపిండి' అని చూచేవాళ్ళకి మరీ ఓర్చుకోడానికి వీలుకాకుండాఉంటుంది. ఇది సహజం. చూడండి. ఒక్కమాట చెప్పుతాను జరిగిన సంగతి.

ఒక బహుమానం

కవిత్వం అంటే ఏమిటో తెలిసినవాళ్ళు, ఇంగ్లీషు తెలుగు బాగా చదువుకున్నవాళ్లు ఉన్న ఒక సభలో ఒకరాజు ఒకకవికి పెద్దబహుమానం ఇచ్చాడు. ఆ కవిచేసిన ఘనకార్యం ఇంతకూ ఏమిటంటారా? గబగబ పంజాబు మెయిలులాగ పద్యాలు చదవగలడు. ఆశువుగా చెప్పుతూ ఉన్నపద్యాలో, అంతకుముందు రాసుకున్న పద్యాలోగాని జోరుగా చెప్పుతాడు. పద్యాలలో భావం అంటే బూసుగుగంప, వట్టిబురబుర. రాజు ముగ్ధుడయి పోయాడు. ఒళ్ళుమరిచి పోయాడు. తనకంతకుముందు ఉన్న కవనదృష్టి మరిచి పోయాడు. చూస్తూఉన్న ప్రజలనీ మరిచి పోయాడు. మహాబహుమానాన్ని మంజూరు చేశాడు. సభలోనున్న చాలామంది సహించలేక పోయారు. రాజుఎదుట రవ్వంత అయినా అనలేకపోయారుగాని, బయటికి వచ్చి పైకికక్కేశారు. మనరాజుకి మతిపోయింది అన్నారు. ఎందుకిచ్చాడురా ఇంత బహుమానం అన్నారు. అదిఅన్నారు. ఇదిఅన్నారు. ఏమయితేనేం? ఆ బహుమానం చూచి ఓర్వలేక

పోయారు. సకారణమే కానీయండి, అకారణమే కానీయండి. మనస్సొప్పదు. దేనికి ? ఇవ్వడానికికాదు, ఇష్టాఉంటే చూచి ఊరుకోడానికి.

## సంస్కృత పండితులు

ఇలాంటివాళ్లే ఆరోజులలో ఉండేవాళ్ళు. వాళ్ళు సంస్కృతం చదువుకొని ఉండేవాళ్ళు. సంస్కృతంలో ఉన్న వర్ణనలు, అలంకారాలు, తళుకులు బెళుకులు అన్నీ రుచి చూచి ఉన్నవాళ్లు. వీళ్లు ఊరుకుంటారా! పదాలగాడు బహు మానం తీసుకుంటూ ఉంటే పండితుడు తనకది అవమానం అనుకుంటూ ఉండేవాడు. సమయం చూచు కొని తన దగ్గిరఉన్న భారతంలోనుంచి కొంత చదివి దానికర్థం చెప్పుతూ ఉండేవాడు. ఆ సంస్కృతం తళుకులు కొంచెం మెరిపించేవాడు. దాన్ని పొగిడేవాడు ద్విపదలనీ, పదాలనీ నిరసించేవాడు. మహాఋషుల పలుక్కులు చూపించే వాడు. వాటి అర్థాలని బోధపర్చేవాడు. మానవమాత్రుల పాటలు చూపించేవాడు. వాటిలోని లోపాలు కనపర్చేవాడు. పురాణ కాలక్షేపాలకి పూనుకునేవాడు. పాడినపాటేపాడి, ఇదంతా 'గానసట బీసట' అనేవాడు. ఈ దరువులనీ, ఈ పదాలనీ వెనకకి తొక్కేవాడు. ఈ సాధారణ సామెతలు, ఉన్నట్టు ఉన్న వర్ణనలు, ముక్కుకు సూటిగా చెప్పే కతలు అన్నీ ఎత్తి చూపించేవాడు. సంస్కృతంలో ఉన్న ఉత్ప్రేక్షలు, చమత్కా రాలు కనబర్చేవాడు. ఎంతయినా ఆమహాకవులు మహాకవులే అనేవాడు. వాళ్ళకీ మనకీ చేంతాళ్లు వెయ్యాలి అనేవాడు.



సంస్కృతంమీద మక్కువ పుట్టించేవాడు. సంస్కృతం మమత పెరిగించేవాడు. దేశికవితలమీదనున్న రుచి తగ్గించేవాడు — అనుకొని కానియ్యండి, అనుకోకుండా కానియ్యండి, ఫలం ఒక్కటే.

అందులో దోషం ఏమీ లేదు. ఆ పండితుడు నిజంగా అలా అనుకుంటూ ఉండేవాడు. అలా అనుకోడానికి కావలసినంత కారణం ఉంది. సంస్కృతభారతం, రామాయణం మొదలైన వాటిలో ఉన్న ఊహలు సామాన్యమైనవికావు. వాటిలోని విషయమూ, దాని పోషణ, చెప్పడంలో ఉన్న నేర్పు, అవన్నీ నిజంగా పొగడవలసినవే. వాటితో మన పదాల్ని, పాటలనీ సరిపోల్చేవాడు.

ఈలాటి మాటలకే బళీ బళీ అని తాళంవేస్తూ ఉండేవి ఆ రోజులలోని పండితసభలు. పురోహితులు, పండితులు, సభలు, అందరూ రాజుల దృష్టిని సంస్కృతంమీదికి తిప్పేశారు. తెలుగుదేశంలోని శూరులకతలూ చప్పన అనిపించాయి. తెలుగువాళ్లు చెప్పే పురాణం కతలూ నచ్చాయికావు. ఆ పాటలు పనికిరాలేదు. సంస్కృతం కథలు, సంస్కృతం పలుకులతో, సంస్కృతం వర్ణనలతో, సంస్కృతం నోటితో వస్తే బాగుంటుంది అనిపించింది.

## భాషాంతరీకరణాలు

రాజరాజనరేంద్రుడుకి శివమెత్తింది. అంతకుముందు పురాణకథలన్నీ అనేకసార్లు విన్నాడట. ఇక్కడ పదాలరూపంగానూ, పాటల రూపంగానూ విన్నాడనడమేకదా న్యాయం.





కొంతవరకు సంస్కృత పురాణ రూపంగానూ ఉంటే ఉండ వచ్చును. అయినప్పటికీ, సంస్కృత భారతాన్ని తెలుగు చేయవలసింది అని నన్నయభట్టుని కోరాడు.

జననుత కృష్ణద్వైపా
యన మునివృషభాభిహిత మహాభారత బ
ద్ధనిరూపితార్థ మేర్పడ
దెనుగున* రచియింపు మధికధీయుక్తిమెయిన్

తనియకుండా ఉండే 'భారత శ్రవణాసక్తి'కి ఈలాగ దారి చూపించాడు. తాతలచరిత్ర అని కొంత అభిమానం. పుణ్యం అని కొంత ఉబలాట. జ్ఞానం అనికొంతబులుపు. పాండిత్యం అని కొంతకులుకు. ఈ పండితులూ, వీళ్ళ సభలూ పొగుడు తారని కొంత ఆశ. అన్నీ ఉన్నవనే చెప్పాలి. ఇవన్నీ సహజంగా ఉండే ఊహలేగాని కొత్తవికావు మానవస్వభావానికి. పుణ్యము పురుషార్థము చూసుకున్నాడు. ఇహముపరము ఆలోచించు కున్నాడు రాజనరేంద్రుడు. అయ్యా, భారతాన్ని తెలిగించండి అని కోరాడు. నన్నయభట్టు "శ్రీ" అని ఆరంభించాడు. నారాయణభట్టు జోడయ్యాడు. పండితసభలు తోడయాయి. వ్యాసమహర్షికి కొత్తనోరు తగిలించారు. ఆ నోటితో తెలుగు భారతాన్ని పలికించారు. పెద్దపెద్ద బిరుదులు సంపాదించారు.

## గరుకు నాలుక

కాని, వ్యాసుడికి తగిలించిన తెలుగునోరుకొంచెం విపరీతమయిన నోరయి పోయింది. అసలు వ్యాసుడినోటిలోని

---

* నన్నయ నాటికింకా మన భాషకు ఆంధ్ర అన్న పేరు కనబడదు.



నాలుక మెత్తగా, నున్నగా ఉండేది. ఏదిచెప్పినా, సులభంగా చల్లగా చెప్పేది. సంస్కృతం తెలిసినవాళ్ళకి చక్కగా తెలుస్తూ ఉండేవి. కాని తెలుగునోరు పెట్టేసరికి నాలుక గరుకయి పోయింది. దడబడలు గరగరలు ఆరంభించాయి. తెలుగు వారికి బోధపడడం కొరతపడ్డది. తెలియడం తెల్లవారింది. అలాగుండడమే గొప్పగా భావించారు ఆ తరవాతివారు. ఆలాగే గరగరలూ బడబడలూ వ్రాశారు — విపరీతంగా. మొల్లలాంటి మనిషి గూడా మొర్ర పెట్టవలసి వచ్చింది. మొల్ల అంటే సామాన్యమైన మనిషికాదు. చక్కని కవిత్వం చెప్ప గలిగింది. అనేకుల మెప్పులు పొందింది. పేరుపొందిన రామా యణాలలో తనదీ ఒకటి చేర్చింది. ఆడుది. అన్యాయంగా ఇతరులని దూషించేదికాదు. అలాంటి మొల్లగూడా ఇలా అనవలసివచ్చింది.

"మును సంస్కృతంబు తేటగ
దెనిగించెడిచోట, నేమి తెలియక యుండన్,
దనవిద్య మెఱయ గ్రమ్మఱ
ఘనతర సంస్కృతము చెప్పగా రుచియగునే?

తెనుగు చేస్తానని చెప్పి, మరింత సంస్కృతం గుప్పి తెలియకుండ చేయడం అక్రమం, తన పాండిత్యం ప్రదర్శించ డానికి వ్రాసుకోనడమే అంటుంది మొల్ల.

తేనెసోక నోరు తియ్యన యగురీతి
దోడ నర్థమెల్ల దోచకున్న





గూఢశబ్దవితతి కొట్లాట పనియెల్ల
మూగచెవిటివారి ముచ్చటరయ”

ఈ మాటలు వ్రాతగాళ్ళందరు మనసులో నుంచుకో వలసిన వేగాని, చిన్నమాటలు కావు. భాషాంతరీకరణాలుచేసిన వాళ్ళను గురించే ఈ అమ్మ ఈ మాటలు వ్రాసింది. ఆడది కాబట్టి అలా అలా చెప్పిందిగాని, మొగవాడే అయిఉంటే ముక్కుగుద్ది చెప్పి ఉండును. ఎలాగ చెప్పితేనేం ? చెప్పవలసిం దంతా చెప్పింది. నన్నయాదుల తెలిగింపులో ఉన్న తెగులు చూపించింది. తెలిగించమంటే, తెలుగువాళ్ళకి బోధపడేటట్టు వ్రాయమంటే, కవీశ్వరపండితులు ఏమి చేశారు ! “ఏమీ తెలియకుండా” వ్రాశారు. వాళ్ళకున్న విద్య, పాండిత్యము చూపెంచడానికే వ్రాశారు. ఇంకా ఏమి చేశారు ? సంస్కృ తానికి తెలుగు వ్రాయమంటే సంస్కృతం తాతను వ్రాశారు. “ఘనతర సంస్కృతము” చెప్పారు. అసలు సంస్కృతాన్ని మించిపొయ్యేటట్టు, మరింత ఎక్కువ సంస్కృతం, మరింత కష్టమైన సంస్కృతం వ్రాశారు. గూఢశబ్దాలతో కొట్లాటలకి పూనుకున్నారు. అర్థం తోచనియ్యకుండా చేశారు. తెలిగిం పంతా “మూగచెవిటివారి ముచ్చట” చేశారు. ఏ వ్రాతలను చూచి తెలుగువాళ్ళంతా మురిసిపోతూ ఉండవలసిందో, అవి మూగచెవిటివారి ముచ్చటలయాయి. ఎవరికి ? మొల్ల వంటి విద్యావతికి. ఇంతకన్నా, ఆ తెలిగింపులని గురించి ఎక్కువ వ్రాయడం అనవసరం. ఎక్కువ వ్రాయడానికి వీలుగూడా ఉండదనే అనుకోవాలి.



## తెలిగింపుల వరవడి

ఈ తెలిగింపు మూగవాళ్ళ ముచ్చట్లు, చెవిటివాళ్ళ సోదెలు అయినప్పటికీ పండితులకి మాత్రం పరమానందాన్ని కలిగించేవి. సభలవాళ్లు సంతోషించేవాళ్లు. వ్రాయించిన రాజుకీ, వ్రాసిన వ్రాతగాడికీ పెద్దవాళ్ళలో పేరుగలిగింది. అది తెలుగువాళ్ళకి ఒక పెద్ద వరవడి అయిపోయింది. వ్రాయించే వాళ్ళకందరికి రాజనరేంద్రుడు వరవడి. వ్రాతలకి భాషాంత రీకరించడాలే వరవడి. వ్రాతగాళ్ళ కందరికి నన్నయభట్టే వరవడి. పుస్తకం వ్రాయించాలంటే రాజనరేంద్రుడులాగ, ఏరాజయినా కవిని పిలిపించాలి; ఆ కవిని పొగడాలి; బహు మానాలివ్వాలి; అయ్యా ఆ పుస్తకాన్ని తెలిగించండి అని అనాలి. ఎక్కడో తిక్కన్న లాంటివాడు కొంచెం కొత్తదారి తొక్కితే ఈ వరవడి తుడిచివేసి ఆ వరవడి పెట్టుకొనేవాళు.

వరవడి అంటే సామాన్యమైన వరవడా? కవిగూడా నన్నయ లాగే సంస్కృతగ్రంథాన్ని పట్టుకోవాలి. తెలిసే టట్టు ఉన్నదాన్ని తెలియకుండా ఉన్నట్టు వ్రాయాలి. తన కున్న విద్యని కనబర్చాలి. సభవాళ్ళ మెప్పును పొందాలి. వ్రాయించిన రాజుకీ తెలియనక్కరలేదు. తెలుగుభాష మాది అన్నప్రజలకీ తెలియనక్కరలేదు. ఇక పుస్తకాలో అంటే పూర్వమునీశ్వరులు వ్రాసిన పురాణాలు, కవీశ్వరులు వ్రాసిన కావ్యాలు. ఈలాగ రాజులూ, కవులూ, కావ్యాలూ అన్నీ వరవళ్ళమీదనే నడక. అంతా గొర్రెదాటు అయింది.




## మతం మొదలైన కారణాలు

ఈ భాషాంతరీకరించడాలకీ, ఈ పురాణాల వరవడికీ మరొక్క కారణంగూడా ఉండకపోలేదు. ఆ రోజుల్లో ఉన్న మతాల అలజడి ఆ వరవడికి కొంత చేయూత ఇచ్చింది. మతమూ, ఈ సంస్కృత పండితులమతమూ, దానికే దారి చూపాయి. సందుదొరికిందికదా అనే సంతోషించారుగాని, అందరికీ తెలుస్తేనే వాటి ఉపయోగం అన్నసంగతే వాళ్ళు అనుకోలేదు. వ్రాయడంవల్ల కొందరి గౌరవం నిలుస్తే, పురాణాలకి అర్థచెప్పడంవల్ల మరికొంతమంది పండితుల గౌరవం నిలుస్తుంది. కవికి పురాణంపండితుడు, పండితుడికి కవి, ఒకరి కొకరు సాయమయ్యారు. అవసరాన్ని సృష్టించారు. ఆ అవసారానికి అర్థం చెప్పేవాళ్ళని అందించారు. ఇద్దరూ ప్రపంచానికి-ఆంధ్ర ప్రపంచానికి అన్నమాట-అత్యావశ్యకమైనవాళ్ళు అయిపోయారు.

ఇంతకుముందు చెప్పినట్టుగా, అవన్నీ సంస్కృతం తళుకులే అయిపోయినాయి. సంస్కృత వర్ణన, సంస్కృత భాష, సంస్కృత నియమాలు, సంస్కృతవృత్తాలు, సంస్కృత మర్యాదలు, సంస్కృత జీవనం, సంస్కృతకట్టూ - అంతా సంస్కృతం టన్సా అయింది. తెలుగు కవిత్వం మారు రూపు పొందింది. తెలుగు విషయం లేదు. తెలుగు జీవనంలేదు. తెలుగుది ఏదీలేదు- దుమువులూ నాలుగు క్రియలు ఇలాటివి తప్ప. తెలుగుదృష్టి చాలమట్టుకు మాయమై పోయింది. తెలుగు ఘోషలు, తెలుగుపదాలు, తెలుగువర్ణనలు, తెలుగు



ప్రజలు తెరవెనక్కి వెళ్ళిపోయారు. సంస్కృత విషయాల నాటకాలకి మన సాహిత్యం రంగభూమి అయింది. తెలుగు తెరమరుగయింది.

## ప్రాకులాడేవాళ్లు లేకపోలేదు

అప్పుడుకూడా కొంతమంది మాత్రం ఆ మార్పు అంత మంచిపని కాదని గ్రహించి, దాని నరికట్టడానికి ప్రాకులాడారు. జాను తెలుగుకోసమూ, ద్విపదలకోసమూ, తెలుగు ప్రజల గాథలకోసమూ చూచేవాళ్లు కొంతమంది ఉండేవాళ్లు - నన్నెచోడుడు, పాలుకురికి సోమనాథుడు మొదలైనవాళ్లు. వీళ్ల పేర్లే మొన్న మొన్నటిదాకా మనకి తెలియకుండా పోయాయి. అంటే, వాటినంతనేళ్ళు అణచివేశారన్నమాట. వీళ్ల గ్రంథాల గొప్పతనం తెలివిమీరిన తరవాత మనకి ఎన్ని సంవత్సరాలకో గాని తెలిసిందిగాదు. అంటే వీళ్లకీ, పండిత సభలలో బయటికి రావడానికిగాని, మంచి పేరుపొందడానికి గాని ఆ రోజులలో అవకాశం కలగలేదన్నమాట. వీళ్లని పెద్ద వాళ్లలో గణించలేదు ఆ పండితలోకం.

వీళ్లు ఎవరూ చిన్నవాళ్లు కారు. పెద్దపెద్ద కవులన్న వాళ్ళతో నువ్వా నేనా అని అనగలశక్తి కలవాళ్లు. మీకన్నా తక్కువ తిన్నవాడెవడు అని అడగగలవాళ్లు. వట్టి సాధారణులు కారు. అయినప్పటికీ, ఆరోజులలో మరివీళ్లని బయటికి రానిచ్చారు కారు. వీళ్లంతా సంస్కృతం పోకడలు బాగా తెలుసుకొన్నవాళ్లు. సంస్కృత కతలని తీసుకొన్నవాళ్లున్నా. కాని తెలుగు అభిమానం జారవిడుచుకోలేదు.

వీళ్ల గ్రంథాలే మొన్నటిదాకా బయటికిరాలేదు. వీళ్ల గతే ఇలాగుంటే ఇంక చిన్న తెలుగు వ్రాతగాళ్లగతి ఎలాగుంటుందో చూడండి. తెలుగుకతా, తెలుగు జీవనం, అంతా తెలుగే అన్న వ్రాతగాడిగతి ఏమైఉంటుదో ఆలోచించండి. వాళ్ల మచ్చూ మాయా కనబడదంటే ఆశ్చర్యమేముంది ?

## తెలుగువ్రాత ఎలా గుండేది ?

ఆ తెలుగు వ్రాతగాళ్ళ వ్రాతలు ఎలాగుండేవో చూపించాలన్నా, దిక్కులేనంత దుర్దశవచ్చింది మనకి. కాల నిర్ణయంచేసి ఏదయినా పాటో, పదమో, చూపించడానికా వీలులేదు. కాని మహానుభావుడు ఒక్కడుమాత్రం ఆ పోకడలని చూపించి పుణ్యాన్ని పోయాడు. దేశంలోని కతా, దేశంలోని జీవితమూ, దేశంలోని మాటలు, దేశంలోని దరువులు ఆదరించినాడు. మాంచి సంస్కృత కవి, పండితుడు, మహాత్ముడు, మేధావి. సంస్కృతం బాగా నేర్చినా స్వంతతల్లిని మరిచిపోని ధీరుడు ఆతడే–

## పాల్కురికి సోమనాధకవి

బసవపురాణంలో బెజ్జమహాదేవి మహాభక్తురాలు. ఆయమ్మ శివుణ్ని తన కొడుకనుకొని ఉపచారాలు చేస్తూ ఉండేది. ఆమె శివుడికి కన్నతల్లి లేదని విచారించడం ఈ మహాకవి ఇలాగ వ్రాశాడు :

తల్లికల్గిన నేల తపసిగానిచ్చు,
తల్లికల్గిన నేల తల జడల్గట్టు,



తల్లి యున్న విషము ద్రావనేలిచ్చు,
తల్లి పాములనేల ధరియింపనిచ్చు,
తల్లి బూడిదయేల తలఁబూంగనిచ్చు,
తల్లి లేకుండిన తనయుఁడుగాన,
బల్లిదుండయి యిన్ని పాట్లుకువచ్చె.
చన్నిచ్చి పలుమారు వెన్నయుబెట్టి,
పన్నుగా నిన్నిన్ని పాలునుబోసి,
ఆకొనకుండఁగ నరసి పాలించి,
సాకుచు పెనుపదే జనని గల్గినను ?
తానింతవాడయ్యె దల్లి లేకయును,
తానెంత పెరుగునో తల్లి గల్గినను ?

ఒకసారి తల్లిదండ్రులు పొరుగూరికి వెళ్ళిపోతూ, కూతురుని కుంచెడుపాలు శివలింగానికి ఆరగింపు పెట్టమని చెప్పుతారు. పాపమామెుద్దరాలు కుంచెడుపాలు లింగందగ్గర పెట్టి దేవా ఆరగించు అని "పెసని ఒక్కింత మరువుననిల్చి" తరవాతవచ్చి చూచింది. పాలు తరగనైనా తరగలేదు. అప్పుడు కవి వ్రాస్తాడు :

బాలతల్లడమంది భయమునుబొంది
పాలేల యారగింపవు లింగమూర్తి ?
కాచుట చాలదో, కమ్మ వల్లామినో,
ప్రాచియో, విరిగెనో, పడుచనేననియొ,
ప్రొద్దెక్కెనో లేక పొగపట్టి చెడెనో,
బుద్ధిపుట్టదో, నెయ్యి పోయకుండిననో,





కడువేడిరో, నీకుగలిసినవనియో,
ఎడవాద్యములు లేక యేనుదెచ్చితినో,
చాలవో, అవి యాలపాలు గావనియొ,
పాలపై చిత్తమే బరపితివనియొ,
కోర(=గిన్నె) బెడంకెనో, కుంచెడులేవో,
ఆరగింపక బెట్ట నేరకుండుటనో,
మీదు పోయినవనో, మీగడలేదో,
ఏ దెచ్చునెడ నెవ్వరే జూచిరనియొ
కారణంబేమేని గలదేని చెపుమ,
ఊరికేమిటికి పాలొల్లవుత్రావ?
నిక్కపుటాకలి నీకులేదేని,
గ్రుక్కెడైనను గొని చిక్కించనాకు.
కుడుపున కియ్యెడ గుదగుదలేల?
కుడికెడు తెత్తునా గుజ్జు నోగిరము?
ఉట్టిపై బానలో నున్నదినేయి,
యిట్టున్న దెచ్చెద నిష్టమేనీకు?

ఈ కవిత్వంలో ఎంత సంస్కృతం ఉందో, ఎంత రసం ఉందో, ఎంత తెలుగుజీవనం ఉందో తెలుస్తూనే ఉంది. ఆ భావాలు వింటున్న వాళ్ళ హృదయాలకి ఎలాగ ఎక్కుతాయో కొంచెం ఆలోచిస్తే తెలుస్తుంది. ఈలాంటివర్ణనలు సంస్కృత పండితకవులు ఎంతమంది వ్రాశారో చూడండి. పెద్దపెద్ద బిరుదుగాళ్లు, అందెవేసినచేతులు ఈ మహానుభావుడి దగ్గర భిక్షమెత్తినవాళ్లే! ఈతడు తెలుగు అభిమానం గల



వాడు. ద్విపదలు, రగడలు, గద్యలు వ్రాసి గుండెలు నీరుచేసిన సమర్థుడు. తెలుగుతనం ఎంత తెలివిమీరి ఉండగలదో ప్రపంచానికి చూపించిన దిట్ట.

ఇలాంటివాడినిగూడా మరిచిపోయేటట్టు చేశాయి భాషాంతరీ కరణాల మక్కువ, సంస్కృతంమోజు, నన్నయ్య సభల వరవళ్ళు. కాకపోతే, మతంనుంచి అలా అయిం దంటారా ? లేక జంగం ఏమిటి ? ఇంత పేరురావడం ఏమిటి అనో ! ఏదయినా, మన దురదృష్టమేగాని, వేరుకాదు. ఇలాంటివివిఎన్నో మన మెరగము. పాల్కురికి సోమనాథుడు సంస్కృతం పోకడలు తెలిసినవాడు. అనేక గ్రంథాలు చెప్పిన వాడు. ఎందరో శిష్యకోటిలో ఉన్నవాడు. కాబట్టి అతని గ్రంథాలకి ప్రతులుఉండి ఉంటాయి. కాబట్టే మన కిప్పటి కైనా దొరికాయి అనడం న్యాయం.

తక్కిన తెలుగు దరువుల వ్రాతగాళ్ళకి ఆ అదృష్ట ముంటుందా ? ఏ ఒక్క ప్రహో ఉంటుంది, పాటగాళ్లెంతమంది అయినా. రోజులు వంకర అవడంచేత ఆ పాటగాళ్ళకీ, ఆ ప్రతులకీ స్థలం లేకపోయింది. నానాటికీ నశించిపోవడమే అయింది. వాటిసంగతి అనుకోడానికయినా ఆదరువు లేదు. ఎవరయినా వాటినిగురించి వాళ్ళ గ్రంథాలలో వ్రాస్తేకదూ మనకి తెలియడం ? ఆ పని ఈ సంస్కృత పండితులు ఎందుకు చేస్తారు ? అన్నారుకాదా గాసట బీసట అని. ఇంగ్లీషులో ఒక లోకోక్తి ఉన్నది.

"Give a dog a bad name and hang it." ఒక కుక్కను చంపాలి అంటే, మొట్టమొదట దానికి ఒక చెడ్డపేరు పెట్టు-కరిచేకుక్క అనో, దొంగకుక్క అనో, పిచ్చికుక్క అనో అన్న మాట-తరవాత దాన్ని చంపివేయి. ఎవ్వరూ నిన్ను నిందించరు. ఎందుకంటే, అంతకుముందే ఉన్నదికదా దానికి పెట్టిన చెడ్డ పేరు. ఆ పేరే నీ తల కాస్తుంది. ఆ చెడ్డపేరున్న కుక్కని చంపితే ఎవడూ తప్పు అనడు.

కాని, నిజంగా ఆ కుక్కకి ఆ చెడ్డపేరు పెట్టడం న్యాయమా కాదా అని ఆలోచించే వాడుండడు. ఎవడయినా అలా ఆలోచించాడా, వాడు చంపినవాణ్ని నిందిస్తాడు. ఏమి చేయగలిగినా, చేయలేకపోయినా నిందించడం మాత్రం మానడు.

అలాగే మన పండితకవులు మొదటి తెలుగు కవిత్వాన్ని "గాసట బీసట" అని ఒక చెడ్డపేరుపెట్టి పిలిచారు. తరవాత ఆ చెడ్డపేరున్నదానిని చంపారు. కాదన్నవాడెవడు? కరిచే కుక్కను చంపేశారు. అంతే. మంచిపని చేశారని పొగిడి కూడా ఉంటారు. అవి ఆ రోజు లయిపోయాయి కాబట్టి అంతటితో ఊరుకున్నారు. కాని ఇప్పటిలాగ "మెడల్సు" రోజులయిఉంటే, "గాసట బీసట కవిత్వ గజ కంఠీరవ" మెడల్సుగాని, "తెనుగు కవిత్వజీమూత ప్రభంజన" పతకాలు గాని బహిరంగ సభలుచేసి ఇచ్చిఉందురు. అంతేగాని, అది గాసట బీసట కవిత్వం అవునా కాదా అని ఆలోచించినవాడు ఎవడు? దాని కవకాశం ఏది?



ఇదిగో పాల్కురికి సోమనాథుడులాంటివాడు, సమాధి లోనుంచి బయటికి వచ్చినట్లు వచ్చి, అయ్యా, ఆ కవిత్వం ఇలాగుండేది అని చూపిస్తే మనమంతా పెద్దవాళ్ళమయాం. అది కాసట బీసట అవునో కాదో ఆలోచించడానికి వీలు దొరికింది. చంపినవాడిని నిందించడమో, అభినందించడమో, లేక నరకకూపంలో దించడమో ఇకమీద తేలుతుంది. ముద్దు లొలుకుతూ, జాతిజీవనాన్ని తెల్పుతూ, చక్కని ఊహల తోనూ వర్ణనలతోను నిండి, ఇంటూఉండిన ప్రజల హృద యాల కెక్కుతూఉండే తెలుగు కవిత్వాన్ని "గాసట బీసట" అన్నవాళ్ళని ఏమనాలో తెలియదు. చంపారు. నాశనం చేశారు. పేరుగూడాలేకుండా చేశారు. చేసీ-వీళ్ళు తీసుకొని వచ్చిందేమిటి ? ఆ సంస్కృత గ్రంథాల వరవడులు.

## పోతన్నకే దిక్కులేకపోయింది

ఆ రోజులలో ఈ పండితులు చలాయించిన అధికారం, వాళ్ళు చూపించిన గర్వం ఇంత అంత అనరాదు. వాళ్ళ ఉద్దేశాలకి కొంచెం విరోధంగా ఉందంటే దేనినిగూడా బయటికి రానిచ్చేవారుకాదు. వాళ్లు వేసుకున్న సూత్రాలకి భిన్నంగా ఉంటే అధఃపాతాళానికి అణచివేసేవారు. రూపుమాపేసే వారు. ఏ హిట్లరులు, ముస్సోలినీలు వాళ్ళముందర పనికిరారు. ఇలాగ నాశనం చేయడంలో మంచీ చెడ్డల్నీ మరి చూడడం లేదు. అది ఎంత మంచి కావ్యమైనాసరే, ఎంత గొప్ప కవి అయినాసరే, ఎన్ని మంచి గుణాలు ఉన్నాసరే, లాభంలేదు. వాళ్ళకు విరోధంగా ఒక్క రవ్వంత ఉంటే చాలు. ధ్వంసం





చేయవలసిందే! దాని పేరెత్తకూడదు. దానిని తమ గ్రంథాలలో తలచూపనీయకూడదు. ఆ కవి పేరెత్తితే సచేలస్నానము చేయాలి. అలా చలాయించేవారు వాళ్ళ అధికారాల్ని.

బమ్మెర పోతన్నలాంటి భక్తాగ్రేసరుడు, కవి కూడా వీళ్ళ ధాటికి ఓర్వలేకపోయాడు. మన తెలుగు ప్రజలకి పోతన్న ఎలాంటివాడో అందరికీ తెలుసును. ఏ గ్రంథంలోని పద్యాలు వచ్చినా రాకపోయినా పోతన్న పద్యం ఒక్కటయినా వచ్చి ఉంటుంది ప్రతీ వాడికన్ని. ఏదీ రాకపోయినా.

"ఇందు గలడందు లేడని
సందేహము వలదు"

అని అయినా అంటాడు. అలా ప్రజల హృదయంలోకి వెళ్ళి ఇల్లు కట్టుకొని ఉన్న కవికూడా వీళ్ళ దెబ్బలను భరించవలసి వచ్చింది. ఈ పండితుల సూత్రాలకి కొంచెం విరోధంగా వ్రాశాడట! అక్కడితో అతనిలో ఉన్న మంచి అంతా మంట కలిసిపోయింది. అతని నేస్పు అంతా నీటిలో కలిసిపోయింది. బుద్ధిఅంతా బూడిదెలో కలసిపోయింది. పండిత లోకానికి అతను ఒక అస్పృశ్యుడు అయిపోయాడు. అతణ్ని ఎవరూ ముట్టరు. ఒక అవాచ్యుడు అయిపోయాడు. పోతన్న పేరు ఎవ్వరూ ఎత్తరు. ఆ రోజుల్లో ర, ఱ అన్న రెండు అక్షరాలనీ భేదంలేకుండా ప్రాసగా వాడుకచేశాడు పోతన్న. ఆ సంగతి మన పండితులకు పనికి వచ్చిందికాదు, నన్నయ్యగారు

రయోస్తు నిత్యం స్యాత్ (వైధర్మ్యం)

 

అని అన్నారు కాబట్టి. అప్పకవి అనే మహానుభావుడి ధర్మాన్ని ఈ పోతన్న "బోయ్‌కాట్"లోని రహస్యం బయట పడ్డది. అతడు చెప్పకపోతే, ఎందుకిలాగ పోతన్నను మట్టు కునేవారు కారో నిశ్చయించడానికి వీలు ఉండక పోయేది.

బమ్మెర పోతరాజకృత
  భాగవతంబు జగద్ధితంబుగా
కిమ్మహి నేమిటంగొదవ ?
  యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుంగలిసి
  ప్రాసములైన కతంబునం గదా
యిమ్ముల నాది లాక్షణికు
  లెల్లను మాని యుదాహరింపఁగాన్.

అలా పోతన్నకే దిక్కులేదంటే తక్కినవాళ్ళ సంగతి వేరుగా వ్రాయడం ఎందుకు. తెలుగువారి జాతీయ సార స్వతం అలా మాయమైపోయింది. ఆ పేరూ ప్రతిష్ఠ పొంద డానికి వచ్చాయి ఈ భాషాంతరీకరణాలు, వాటి వరవడులు. వీటితో తెలుగు జాతీయ సారస్వతం మాయమయింది. ప్రాత తెలుగుకవిత్వం యెంచి ఏలాంటిదో తెలియకుండా పోయింది.



# 6

# తెలుగుకు జరిగిన అపకారం

నన్నయభట్టుగారి దగ్గరనుంచి వ్రాతగాళ్లకి భావాన్ని, విషయాన్ని, అన్నిటినీ సంస్కృత మూలగ్రంథాలే ఇచ్చాయి. చదువుకొని ఉన్నదంతా సంస్కృతమే. ఆ పాండిత్యంతో భారతాన్నో, రామాయణాన్నో, మరే గ్రంథాన్నో పట్టుకుంటారు భాషాంతరీకరించడానికి. కతకోసం కక్కుర్తి పడనక్కరలేదు. భావంకోసం వెతుక్కోనక్కరలేదు. అంతా తయారుగా "రెడీమేడ్"గా అందులోఉంది. పద్యాలు అల్లేశక్తి వీళ్లలోఉంది. ఎలాగవ్రాసినా "బలే" అనడానికి అభిమానం సభలకి, ప్రభువులకీ ఉంది. అంతేకాకుండా "ఏమండీ ఇలాగుంది" అని అడగడానికి శక్తి ప్రజలకి లేదు. ఇంకేమికావాలి? భాషాంతరీకరణాలు అందామా వీటిని? భాషాంతకరణాలు అందామావీటిని? (అదిగో కొంచెం పిట్టకలంధోరణి-చెప్పాను కాదా ఆ ధోరణి అంత తేలికగాపోదని.) వ్రాతగాడిశక్తి ననుసరించి మూలగ్రంథంలోని కతను, ఆ వర్ణనలని, ఆ భావాలని తెలుగులో, అంటే వాళ్లు అనుకున్న తెలుగులో, వ్రాస్తారు.



అలా తెలుగు చేయడంలో మూలగ్రంథంలోని సంగతిని తూ, చా తప్పకుండా ఉండాలనే వాళ్ళ అభిప్రాయం అనడం న్యాయం. ఎందుచేతనంటే, వాళ్ల దృష్టిని ఆ మూలగ్రంథాలు కేవలం సారస్వతంమాత్రమేకాక పురుషార్థంకూడాను. వాళ్ల దృష్టిని అవన్నీ మహాఋషులు వ్రాసినవన్నీ, అందులో ఉన్న దంతా మహా పవిత్రమైన సత్యమనిన్నీ, అంతకన్నా బాగా వ్రాయడం మానవ మాత్రులకి సాధ్యంకాదన్నీ, అలా ఒక వేళ ఎవడయినా ప్రయత్నం చేస్తే వాడు నరకకూపంలో పడతాడన్నీ గట్టిగాఉండేది. ఆదృష్టి సరియైనదా, కాదా అన్న ప్రశ్నతో మనకిక్కడ జోక్యంలేదు. కాని వాళ్లు సాధ్య మైనంతవరకు మూలగ్రంథాన్ని అనుసరించేవారు. భారతం మొదలైన భాషాంతరీకరణాలలో ఇదే ఎక్కువగా కనబడుతూ ఉంది.

కొంతమార్పు ఉందిఅంటే—

కాని అక్కడక్కడ మూలానికి తెలుగు కొంచెం భేదిస్తూ ఉండడంగూడ లేకపోలేదు. అలా మార్పు కనబడ డానికి కారణం ఏమిటో అని ఆలోచించడానికి చిక్కులున్నాయి చాలా. మొదట వాళ్ళకు దొరికిన మూలగ్రంథాల ప్రతులేవో మనకు తెలియదు. వాళ్లు చేతిలో పట్టుకున్న ప్రతిఒకటిఅయి, మనము పట్టుకున్నది మరొకటి అయితే నిజం తెలియడం కష్టం. ఒక గ్రంథానికి ప్రతులున్నాయిఅంటే అన్నిప్రతులు ఒక్కలా గుండవుకదా! కొన్నిటిలో ఎక్కువ పద్యాలుంటాయి, ఎక్కువవిషయాలుంటాయి. అంశాలు ముందువి వెనకా,

వెనకవి ముందూ ఉంటాయి. కొన్నిటిలో అసలు కవివికానివి గూడా ఇరికిపోయి ఉంటాయి.

ఈ సంగతి ఆ సంస్కృత గ్రంథాలకేకాదు. చేతి వ్రాతలతో గ్రంథాలు వ్రాసుకొంటూఉండే రోజుల్లో అన్ని దేశాలలోనూ, అన్ని భాషలలోనూ ఉండేవి. భారతదేశంలో మరికొంచెం ఎక్కువ అని మాత్రం మన ఆధిక్య ముందిలెండి! కాబట్టి నన్నయ్య పట్టుకున్న ప్రతి ఏదో నిర్ధారణ అయినంత వరకు **అతను** ఈ యీ మార్పులు చేశాడు అని నిశ్చయించడం కష్టం. కాక ఎక్కడో కొంచెం ఉద్దేశపూర్వకంగానే మార్చ వచ్చును. తమ మతానికి భంగంకలుగుతుందన్నా, తమ ఆచారాలకు విరుద్ధంగా (బ్రాహ్మణులకు ధర్మరాజు రకరకాల మాంసాలు వండించి పెట్టాడన్నట్టు) సంస్కృత మూలంలో ఉన్నా, మార్చక ఏంచేస్తాడు? మూలగ్రంథంమీద ఎంత గౌరవండున్నా తానూ ఒక మనిషేకదా. అలా మార్చడానికి ఏవో బలమైన కారణాలు చెప్పవచ్చును. కాని అలాంటివి చాలా తక్కువగా ఉండడంబట్టి మూలాన్ని అనుసరించడమే ముఖ్యసూత్రం అని గట్టిగా మనం చెప్పవచ్చు. కథ మారలేదు, పాత్రలు మారలేదు, వర్ణనలు మారలేదు. అంతా మూలం ప్రకారమే ఉంది.

## ద్రౌపదీ పాత్ర

నన్నయ్యగారి ద్రౌపది అనీన్నీ, తిక్కన్నగారి ద్రౌపది అనీన్నీ బుద్ధిమంతులు కొన్ని సూక్ష్మమైన భేదాలు చూపిస్తూ వ్యాసాలు వ్రాస్తున్నారు; వాళ్ళ కుశాగ్రబుద్ధినీ, విమర్శనా



శక్తినీ, పాండిత్యాన్నీ ప్రకటిస్తున్నారు. ద్రౌపది పాత్రను నిరూపించడంలో నన్నయ్య ఎంతవరకు సంస్కృత ద్రౌపదిని మార్చాలనుకున్నాడు? తిక్కన్న, నన్నయ్య ద్రౌపదిని ఎంతవరకు మార్చాలనుకున్నాడు? ఈ ప్రశ్నలు చాలా చిక్కు అయినవే. గట్టిబలం దొరికిందాకా మార్చాలని అనుకున్నారనుకోవడం మంచిదికాదు. వాళ్లుగూడా అలా మార్చాలని అనుకొనిఉండరు. కాని, వ్యాసుడి గ్రంథం చదువుకొన్నప్పుడు వ్యాసుడే అలాంటి ఉద్దేశంతో ద్రౌపది పాత్రను పోషించాడని వాళ్లు అనుకొనిఉంటారు. అందులో నన్నయ్య వ్యాసుడి ఉద్దేశం ఒకలాగున్నదని అనుకొని ఉండ వచ్చును. ఇప్పుడు షేక్స్పియరు వెన్నిసువర్తకుడిలో షైలాకును గురించి అభిప్రాయాలు ఎలాగ వేరు వేరుగా ఉన్నాయో, అలాగే వ్యాసుణ్ని చదివినప్పుడు వేరువేరు అభిప్రాయాలు నన్నయ్య, తిక్కన్నలకు పుట్టవచ్చును. అది సహజమే. అంటే వ్యాసుడే అలాంటి అభిప్రాయాన్ని పొంది ఉండేవాడని నన్నయ్య అనుకున్నాడు. ఆ అభిప్రాయం ప్రకారం అతను వ్రాశాడు. తిక్కన్న మరొకలాగ అనుకొని ఆ ప్రకారం తాను వ్రాశాడు. ఇందులో మార్చినదేమిటి? మర్చాలనుకొన్న దెక్కడ? వాళ్లెవరున్నూ

"గుణంబు పోషించియు, దోషంబు పరిహరించియు" అన్న సూత్రం చెప్పలేదు, సూచించడంగూడా లేదు. కాబట్టి నేనన్నట్టు, నన్నయాదులు మూలాన్ని చక్కగా అనుసరించిన వాళ్లనే చెప్పాలి. మూలగ్రంథాన్ని వాళ్లు ఎలాగ బోధపర్చు కున్నారో అలాగే వ్రాశారు అనిన్నీ, వాళ్లకు దొరికిన మూల

గ్రంథం ప్రతులనుబట్టి వాళ్లు వ్రాశారు అన్నీ మనం భావించడం సమంజసం. ఆ ప్రకారంగా మన సాహిత్యంలోని భాషాంతరీకరణాలకి వరవడి పెట్టారు. ఆ వరవడి అవిచ్ఛిన్నంగా సాగింది కొన్నాళ్లు.

దీనివల్ల కలిగిన ఫలితాలు ఏమిటి ?

ఇలాగ భాషాంతరీకరణాలు దిగిపోయినందువల్ల తెలుగు సారస్వతానికి - అంటే ఆ తెలుగు భాషకు-కొన్ని గ్రంథాలు దొరికాయి. సంస్కృతంలో ఉండే తెలివితేటలు, కొంతవరకు తెలుగువాళ్ల చెవులకెక్కాయి. ఆ తెలివితేటలు, ఆనీతులూ, అజ్ఞానమూ సామాన్యమైనవికావు. అలాంటివి తెలుగులోనికి వచ్చాయి అంటే సంతోషించని తెలుగువాడుండడు. అసలు సంస్కృతంలో వ్రాసినవాళ్లు మహానుభావులు. తెలుగులోకి తెచ్చిన వాళ్లు మహాపండితులు. సంస్కృతం చదువులో పండి పోయినవాళ్ళు. అలాంటివాళ్లకు సంబంధించిన గ్రంథాలు తెలుగు గ్రంథాలు అనుకోవడం మనకి కొంత ఉబ్బిపోవడానికి తగిన కారణం అవుతుంది. సంతోషించవలసిందే. అలాగ సంతోషించడంలో మేము ఎవరికీ తీసిపోము.

కాని, ఇలాగ దిగుమతి అవడంవల్ల కొన్ని నష్టాలు కూడా కలిగాయి. ఈ నష్టాలని గురించి ఎవరయినా బాగా, నిష్కపటంగా, పక్షపాతం లేకుండా ఆలోచించినట్టయితే గుండెలు గుభులుమంటాయి. ఆహా, అందుకు సందేహం లేదు ! ఈ సంస్కృత భాషాంతరీకరణాల సాహిత్యం మన తెలుగుకు చేసిన ఉపకారంకన్నా ఎన్నోరెట్లు ఎక్కువ అప



కారం చేసింది అని ఇప్పుడు అనక తప్పదు. అవి కలుగజేసిన ఆనందంకన్న వెయ్యిరెట్లు ఎక్కువ విచారాన్ని కలిగించాయి అని ఒప్పుకోవలసివస్తున్నది ఇప్పుడు.

ఇప్పుడు అంటే ఎప్పుడు ?

మనకి తెలిసినదంతా సంస్కృత సాహిత్యం మాత్రమే అయినప్పుడు (మనలాగే ఉండే కన్నడ సాహిత్యంగూడా కలపండి కావాలంటే) మన గ్రంథాలు చూచుకుంటే అంతా చక్కగానే ఉన్నట్టు కనబడేది. ఎందుకంటే, వాటి టస్సాలే ఇవి కాబట్టి, మనవాళ్ళదికూడా సంస్కృతం బుద్ధే అయి ఉండేది. కాబట్టి కొరత ఏమీ ఉన్నట్టు కనబడేదికాదు. అలాగుండడం అప్పుడు. ఇప్పుడో ?

ఇప్పుడు మనకి తెలిసింది చాలా ఎక్కువ అయింది. అవతల అరవమూ, బంగాళీ, మరాటీ మొదలైన దేశ భాషల లోని సాహిత్యం తెలిసింది. ఇంగ్లీషు, రషియను, నార్వేజియను మొదలైన ఇతర దేశభాషలలోని పుస్తకాల సంగతి కొంత తెలిసింది. గ్రీకు, ఇటాలియను మొదలైన పురాతన భాషలలోని గ్రంథాలు తెలిశాయి. ఆయా భాషలలో సాహిత్యం ఇప్పుడెలాగున్నదో, అప్పుడెలా ఉండేదో, అది ఎలాగ మారుతూ వచ్చిందో తెలిసింది. అంటే సాహిత్యం గురించిన జ్ఞానం ఎక్కువ అయింది. తారతమ్యాలు స్ఫుటంగా కనిపించే రోజులు; సాహిత్యాలలో ఎలాంటి, ఎలాంటి మార్పులు కలుగుతూ ఉండేవీ చక్కగా తెలుసుకోవడానికి వీలు కలిగిన రోజులు; ప్రపంచ గౌరవాన్నీ, ప్రజల





ఆదరణాన్నీ పొందడానికి తగిన భావాలు ఎలాగుంటాయో బోధపర్చుకోగలిగిన రోజులు; ప్రపంచంలోఉన్న భావాలలో వేనికి ఏయే సాహిత్యాలు ఎంతవరకు తోడుపడ్డాయో అని పరీక్ష చేసుకునే రోజులు; ప్రపంచంలోఉన్న చక్కని భావాలలో ఎన్ని భావాలు మన తెలుగు సాహిత్యం ఇచ్చిందో అని, దురభిమానం లేకుండా, తెలుగువాళ్లు పరీక్ష చేసుకోవలసి వచ్చిన రోజులు. అలాంటి రోజులు "ఇప్పుడు" అంటే. ఇలాంటి ఇప్పుడు మన సాహిత్యాన్ని చూచి మురిసిపోవలసిందెంత ఉందో, ఆనందాన్ని పొందవలసిందెంతో చూచుకుంటే నేను చెప్పిన మాటలలోని నిజం తెలుస్తుంది. వరవళ్ళవల్ల కలిగిన లాభాలకన్నా నష్టాలు ఎక్కువ అని బోధపడుతుంది.

## నియమాలూ, రూళ్ళకర్రలు

ఎందుచేతనంటే, భాషాంతరీకరణాలు ఎప్పుడు ముఖ్యం అని తలంచారో అప్పుడే మరికొన్ని కూడా ముఖ్యమయి పోయాయి, దీపంపెట్టామంటే నీడగూడ వచ్చినట్టు. వ్రాతలలో కథా, వర్ణనా మొదలైనవన్నీ మూలగ్రంథాన్ని చూచి వ్రాసేవాళ్లకి ఆ సంస్కృతంలో ఉన్న నియమాలూ, సూత్రాలుకూడా ముఖ్యమయి పోయాయి. అది సహజమే. అందులోను మన వ్రాతగాళ్ళందరూ నేర్చుకొని కృషిచేసిందంతా ఆ సంస్కృతమే. వీళ్ళకు తెలిసిందంతా సంస్కృత సూత్రాలే. గాసటబీసట సూత్రాలు వాళ్లుచూచి ఉంటారా, ఆదరించి ఉంటారా మరి! అందువల్ల భాషాంతరీకరణాలతో పాటు తెలుగులోనికి దిగిపోయాయి వందలకొద్దీ నియమాలు,



సూత్రాలు, పద్ధతులు, సంసారం అంతాను. భాషకి సంబంధించిన నియమాలేకావు; భావానికి సంబంధించినవి, విషయానికి చెందినవి, వర్ణనలకి చెందినవి, పుస్తకాలుండవలసిన రీతులకి చెందినవి, గ్రంథాలలో పాత్రలకుండవలసినవి - అన్ని నియమాలూ దిగిపోయినాయి సంస్కృతంనుంచి. గడ్డలకిచెందిన నియమాలుకాక శరీరానికి, జీవానికి సంబంధించిన నియమాలు గూడా సంస్కృత సారస్వతంనుంచి రవానా అయి మన తెలుగు గ్రంథాలలో ప్రవేశించాయి. అంతకుముందుండే పాటలూ, దరువులూ, వీటికి ఉండే ఉద్దేశాలూ అంతరించిపోయాయి. సంస్కృత నియమాలు తాండవమాడడం ప్రారంభించాయి. సంస్కృతదృష్టివల్ల దానిలోని వృత్తాలు దిగిపోయి నృత్యం చేశాయి. తెలుగువరసలు వెనక్కి వెళ్లాయి. ఇంతటితో తీరిందా ? లేదు, మమ్మాటికి లేదు. మరొక్క పెద్దపనిచేశారు. యతిప్రాసల జమిలి సంకెళ్లు తెచ్చిపెట్టారు.

## యతిప్రాసల జమిలి సంకెళ్ల

తెలుగుభాషకి అక్షరయతీ లేకపోతే ప్రాసా చాలా అనుగుణంగా ఉంటుంది. భాషాతత్వంలోనే మన కవిత ఉందని అందరమూ ఒప్పుకుంటాము. మన సామెతలుగూడా ఆ మాటనే రుజువు చేస్తాయి. ఏదో ఒకటి ఈ శబ్దాల సొగసు లలో ఉంటే చాలా ఇంపుగా ఉంటుంది.

చచ్చినవాడి కళ్లు చారడేసి
మెత్తనివాణ్ని చూస్తే మొత్తబుద్ధి





ఇలాగ ఒక అందం తెలుగులో ఉంది. కన్నడంవాళ్ళకి ఇలాగే ప్రాస ఎక్కువ అభిమానం. అందుచేతనే

కన్నడక్కె యతియిల్ల,
కోణక్కె మతియిల్ల

అని ఒక లోకోక్తి ఉన్నది. అంటే కన్నడవాళ్ళకి యతి అన్నది లేదు. దున్నపోతుకు మతి అన్నది లేదు అన్నమాట. ఆ ప్రాసాన్ని ఒక నియమం చేశారు తెలుగులో. అదేమాత్రం అయిఉంటే కన్నడ పద్యాలలాగ మన పద్యాలుగూడా ఉండేవి. చూడండి కన్నడ భాషలోని కందపద్యం :

అళిగతకుసుమపరిమళ
ఫలరస మందానిలాద్రి కాననలీలా
విలసనదింభోగమహీ
తళమెనిపుదు విషయజనవె వేంగివిషయం.

కన్నడ కవిత్వంలో ఉత్పలమాల చూడండి :

తుంగమతంగజేంద్ర వన
దిం ఫలభారవినమ్రనాళికే
రంగళి నద్రికాననది
నుత్తమ శాలివసంగళిం చళ...

వీనిలో అక్షరయతి లేదు. ఇదెక్కడనుంచి వచ్చిందంటారా ? సంస్కృతంలో యతి, విరామం, విశ్రాంతి అన్న మాటలన్నీ పద్యం చదవడంలో ఆగే జాగాలకి పేర్లు. ఆ యతి ఉన్నచోట కొంచెం ఊపిరి తీసుకుంటాం. అంతేగాని ఆ చోట



నుండే అక్షరానికిన్నీ, ఆరంభంలో ఉన్న అక్షరానికిన్నీ సంబంధం ఉండదు. ఉండాలి అన్న నిర్బంధం లేదు.

రే కందర్ప కరం కదర్థయసి కిం
కోదండటంకారితైః
రేరే కోకిల కోమలైః కలరవైః
కింవా వృథాజల్పసి

కోదండ, కింవా అనడానికి ముందు చదువు విరుగుతుంది. అదీ యతి అంటే. ద్రావిడభాషలలో అలాంటిచోట అక్షరంగూడా సరిపడడం కొంచెం ఉందని చెప్పానుగదా. అదీ, ఇదీ కలిపి, యతికి అక్షరం కలిపి, దానికి ప్రాసను అతికించారు. అరవవాళ్లు వండుకునే "కూటుకరి" లాగ అన్నీ కలిపి కలగూరగంప చేశారు. జమిలి సంకెళ్లు వేశారు.

## ఎందుకు వేసుకున్నారు ఈ సంకెళ్లు?

ఎందుకిన్ని సంకెళ్ళు వేసుకున్నారు అంటే, భాషని అందంచేయడానికి అని పెద్ద ఉద్దేశాన్ని జవాబుగా చెప్పుతాం. అదికాదని ఎవ్వరూ అనలేరు. కాని, దానికి తోడుగా మరి కొన్ని కారణాలుగూడా ఉన్నాయి అని ఒప్పుకోవాలి. తమ తమ పాండిత్యాలు చూపించడానికి అనికూడా అనుకోవాలి. నియమాలు ఎంత ఎక్కువఉంటే అంత చక్కని కవిత్వం అని అనుకుంటూ వుండేవారుగదా! ఎంతకష్టం అయినపని చేస్తే అంత గొప్ప కదా సర్కసులో! అలాగే అయింది మన కవిత్వంలో గూడాను. కవిత్వం అంటే అదొక సర్కసు అయింది. ఇంతకూ మరొక్క కారణం ఉంది. "పనిలేని మంగలి





ఏమి చేశాడు అంటే పిల్లితలగొరిగినాడు" అన్నట్టు పనిలేకపోయి నప్పుడు చాకచక్యం చూపింపడానికి అవకాశాలు వెదకడం వుండికదా! మన పండిత కవులకి ఆ రోజులలో ఉండే పని ఏమిటో చూడండి. కతను అల్లుకోవడం ఉందా? దానిని పోషించుకోడానికి అవస్థపడాలా? వర్ణనలకోసం దేవులాడాలా? ఈ పనులు ఏమీ లేవుగదా. సంస్కృతం సాహిత్యం ధర్మాన్ని అవన్నీ సిద్ధంగానే ఉన్నాయి భాషాంతరీ కరణాలవారికి. మరి వీళ్లు చేసేదేమిటి? ఉత్తనే తెలుగు చేసేస్తే అంత గౌరవం వస్తుందా? అందరూ చేసేస్తారే. వాళ్ల గౌరవం, వాళ్ళ గొప్ప ఎలాగ నిలుస్తాయి అని ఆలోచించుకున్నారు ఓపిక ఉన్న వాళ్లు. గ్రంథాలు వ్రాయడానికి ఇతర కవీశ్వరుడు పడవలసినంతబాధ వీళ్లకిలేదు. కొంతపని కల్పించుకోడాని కేమీ అభ్యంతరం లేదు. యతి, ప్రాసా, రెండూ పెట్టుకుంటే పద్యాలకి కొంత సొగసుకలుగుతుంది. అందరూ వ్రాయడానికి అవకాశంఉండదు. పరువు నిలుస్తుంది. బాగుంటుంది. ఇంత ఆలోచన ఉంది అందులో. కొంత నేర్పుతో పనిసాగించారు ఆ మహామహులు.

## యతిప్రాసల బాధలు

ఈ యతిప్రాసలు అందాన్ని ఇచ్చాయన్న మాట ఎంత నిజమో, అడ్డంకులని తెచ్చాయన్న మాటకూడా అంత నిజమే. గడుసువాళ్లూ, పెద్దవాళ్లూ ఆ అడ్డంకులన్నీ చమత్కారంగా తప్పించుకునేవాళ్లు. కాని తప్పించుకోవడం తప్పించుకోవడమే గాని మరొకటి కాదుకదా! దాన్నిపట్టే అవి అడ్డంకులన్న మాట నిజమే అవుతుందికదా! తెలుగు భాషలో ఉన్న పడి



కట్టురాళ్లన్నీ వీటివల్ల కలిగాయనే చెప్పాలి. ఈ ఒసరన్, ఒప్పుగ్, ఓలి, ధరగ్ మొదలైనవన్నీ ఈ యతిప్రాసలబాధలని వేయినోళ్లతో చాటుతున్నాయి.

అంతేకాదు, మహాపండితులూ, ఉద్దండకవులూ అనిపించుకున్నవాళ్లుగూడా వీటిబాధనుండి తప్పించుకోలేక పోయారని చాటుతున్నాయి. సంస్కృత సమాసాలు వాడుక చేసేటప్పుడుగూడా పడికట్టురాళ్లు మనకవులు వేసుకో వలసివచ్చింది. సంస్కృతం కాబట్టి పైకి పాదపూరణాలలాగ కనిపించవు; కాని అవిగూడా పడికట్టురాళ్లే. ఉద్యత్, స్ఫురత్, విలసత్, ఇలాంటివీ, అర్థంలేకుండా ఉపయోగంచేసే ఉపసర్గలూ (అభి, ప్ర, సం లాంటివి) అన్నీ పడికట్టురాళ్ళే. ఈ సంస్కృతం పడికట్టురాళ్ళు సంస్కృత కావ్యాలలో ఇంత జోరుగా పడవు. ఎందుకంటే, వాళ్ళకున్నది ఒకబాధే. మనకో, మూడుబాధలు: ప్రాసాలయాతన.

ఈ పడికట్ల అవసరం నన్నయ్య, తిక్కన్న మొదలైన పెద్దవాళ్ళకే కలిగింది అంటే ఇకనున్న చిన్నకవుల గతిఏమిటి? పెద్దకవులువాడారని ఆ పడికట్లకకూడా అర్థంకోసం తాపత్రయం పడతాం. చిన్నవాడి పడికట్లయితే ఛీ అవతలకిపో అంటాం. ఏమన్నా పడికట్లు పడికట్లే. తిక్కన్న

సింగంబాకటితో గుహాంతరమునన్
చేడ్పాటుమై నుండి, మా
తంగస్ఫూర్జిత యూథదర్శన
సముద్యత్క్రోధమై

అన్నప్పుడు స్ఫూర్జత్, సముద్యత్ ఎందుకు వాడాడో అందుకే ఘంట సింగయ్య కిరాతార్జునీయంలో

భారవిభట్టు రచించిన
భారవి యను కావ్యమవని ప్రఖ్యాతిగనే
నారూఢిని తెనిగించెద
ధారుని నాచంద్రనిత్య తారార్కముగాన్.

అన్న పద్యంలో అన్ని పడికట్టు రాళ్లు వాడాడు. కవులనిపట్టి హెచ్చు తగ్గులంటాం గాని సంగతి ఒక్కటే. యతిప్రాసల బాధలని ఎవ్వరూ తప్పించుకోలేదు. కథావర్ణనలూ అన్నీ అమర్చి ఉన్నతరువాత అఖండ పాండిత్యాలు కలిగినవారు అయినప్పటికీ వీటిబాధలని తప్పించుకోలేక పోయారు కదా! ఇకను తన ఊహని, తన వర్ణనతో వ్రాయాలనుకుంటూఉన్న సాధారణుడు ఎలాగ తప్పించుకుంటాడు?

అలాంటివి ఈ యతిప్రాసలు. ఇవి పెట్టారు. వీటికి సూత్రాలు కట్టారు. మేకుబందీ చేశారు. ఈ బంగారం కత్తితో పీకె కోసుకోండి అన్నారు. మరొక్కమాట. ఆ యతిప్రాసల సూత్రాలని మన కవులు ఎంతమంది తృణీకరించారో చూడండి. ఎంతమంది లక్ష్యపెట్టలేదో చూడండి. ఎన్ని రకాలుగా ఆ సూత్రాలు పెరిగిపోయాయో చూడండి. ఇదంతా దేనిని బోధపరుస్తుంది? యతిప్రాసలు సంకెళ్ళే అనికదా చాటుతుంది. ఇంకా సందేహం ఎందుకు? అందం కావలసిందే. అలా అని మేకుబందీ చేస్తే అందం అడుగంటిపోతుంది కదా! సంస్కృత పద్యాలలో లేదా అందం? పద్యం వ్రాస్తాననుకున్న వాడికి



కొంత ఛందోబద్ధంగా ఉండవలసిన అవసరం ఉంది. అది చాలును పద్యం అనిపించుకోడానికి. చరణాలు పెద్దవిగా ఉంటే ఎక్కడో ఒకదగ్గర ఆగడంకూడా అవసరమే అవుతుంది. అంతటితో ఊరుకోవాలి. కావాలి అన్నవాళ్లు మరి పది నియమాలు పెట్టుకోమనండి. మనం కాదని అనం. కాని అందరూ అదే చెయ్యాలంటేనే వస్తుంది చిక్కు.

ఇన్ని చూచుకొనేసరికి భావం అన్నది పరారీ అయి పోతుంది. ఏది ముఖ్యం అయిందో దానిమీద అంతదృష్టి ఉండదు. ముఖ్యంకాని వాటికోసం అన్ని ప్రయత్నాలు చేయ వలసివస్తుంది. ఎంతమంది చక్కని భావాలు ఉన్నవాళ్లు, పద్యాలు రాయాలని ఉవ్విళ్ళూరుతూ ఉన్నవాళ్లు, చక్కగా తెలుగుగ్రంథాలు చదివిఉన్నవాళ్లు, ఇలాంటివాళ్ళు ఎంత మంది ఈ చీకాకులు పడలేక పద్యాలికి ఒక నమస్కారం అని ఊరుకున్నారు! వీళ్ళకి ఈ పడికట్లు అసహ్యంగా ఉంటాయి; కాబట్టి వాళ్లు వాటిని వాడరు. అందుచేత పద్యాలు నడవవు. భావం, జీవం లేనివాళ్లు పడికట్టురాళ్లతో పరమకవులయి ప్రఖ్యాతి పొందుతూ ఉన్నారు. భావం ఉన్న అలాంటివాళ్లు వచనం వ్రాసుకోకూడదా అంటారు బుద్ధిమంతులు! ఆ ప్రశ్నకి జవాబు ఇప్పుడు చెప్పనుగాని, అటుతిరిగి "ఏమీ, పద్యమే వ్రాయకూడదా?" అని నే నడుగుతాను. ఏమంటారు? వ్రాయనియ్యండి గణబద్ధంగాను. శక్తిఉంటే తక్కిన తళుకులు ఉపయోగించనియ్యండి. లేకపోతే పోనియ్యండి. భావాన్ని,





ఉత్సాహాన్ని అరికట్టేయకండి. సాహిత్యాన్ని పాడుచేయకండి అని మనవి చేస్తాను.

వచ్చినవాడు ఫల్గునుడు
తప్పక గెల్తు మనంగరాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు
రెండును గెల్వనేర్చునే?
హెచ్చగు కుందగుందొడను
టన్నివిధంబుల గోర్చునట్లుగా

అంతే ఏమిటి తగ్గిపోయింది? ఎంత అందం ఎగిరింది! కొంచెం దారితప్పాం. యతిప్రాస లనేసరికి ప్రస్తుతం అవసరం కాకపోయినా కొంచెం సాగింది కథ. ఇంగ్లీషు మొదలైన భాషల్లో మంచిమంచి కవిత్వాలు చూడండి. పడికట్టురాళ్లు ఏపాటిఉంటాయో, అలాంటివి మనకి ఇంత ఎక్కువగా ఉండ డానికి కారణం ఏమిటో ఆలోచించండి. లేదా, కవులని పేరు పొందిన వాళ్ల నెవరినైనా రహస్యంగా అడగండి. ఈ యతి ప్రాసలు భావప్రకటనానికి అడ్డుగా కనిపిస్తూ ఉంటాయో, లేదో; నిష్కపటంగా చెప్పమనండి. అందులోనే పుట్టి, అందులోనే పెరిగి, అపారమైన అలవాటయిపోవడంచేత ఇబ్బందిలేనట్టే కనబడవచ్చు. సర్కసులో తీగమీద నడిచేవాడికి అది ఇబ్బందిగా కనబడదు. అలవాటుబలంచేత తాను ఏమిచేస్తూ ఉన్నా కాలుమాత్రం తన జాగా చూచుకుంటూనే ఉంటుంది. చేయి ఊపును కాచుకుంటూనే ఉంటుంది, అనాయాసంగానే



తీగమీద నడక జరుగుతూఉన్నట్టు ఉంటుంది. అలాగే, మన కవులకి తలకాయలు, వాటంతట అవే, ఈ అడ్డంకులని తప్పించుకోడానికి మార్గాలు వెతుక్కుంటూ ఉంటాయి. కవిగారికి తెలియకపోవచ్చు అన్ని చోట్లాను. కాని, కొన్ని చోట్లమాత్రం వీరుగూడా రంగంలోకి దిగవలసివస్తుంది. అడగండి మర్మం విడిచి చెప్పేవారిని......



# 7

# కావ్యసూత్రాలు, కవిసమయాలు

ఈ వృత్తాలు, ఈ యతిప్రాసలు అవన్నీ పై ఆకారాలవే. వీటిలోకే ఇంత రవానాచేసినవాళ్లు గ్రంథాలలో ఉన్న సరుకు కోసం ఎంత రవానా చేస్తారో అనుకోవద్దా? చేశారు, శక్తివంచన లేకుండా తెలుగులోకి దిగుమతీచేశారు. కవి సమయాలన్నారు, సాహిత్య సూత్రాలన్నారు, కావ్యమర్యాద లన్నారు, నాటకలక్షణా లన్నారు. వెయ్యిపేర్లు చెప్పారు. పదివేల నియమాలు దింపారు. అంతా నియమాలమయం చేశారు. ఇవన్నీ సంస్కృతం రేవులోనుంచే దిగుమతీ.

సంస్కృతంలోఉన్న పుస్తకాలలో ఎలాగుంటే అలాగే తెలుగు పుస్తకాలలో ఉండాలన్నారు. సంస్కృతంలో ఉన్న వర్ణన ఎన్ని రకాలుగా ఉంటే అన్నిరకాలుగానే ఉండాలి తెలుగులోకూడా. ఆ వస్తువు సంస్కృత కవికి కనిపించినట్టు తెలుగుకవికి కనిపించినాసరే, కనిపించకపోయినాసరే, సంస్కృత కవులకి కనిపించినట్లే వ్రాయాలి అన్నమాట. వాళ్ళు గ్రంథా లలో ఏమే విషయాలు — పురం, సూర్యోదయం, విరహం-



మొదలైనవి ఎత్తుకున్నారో ఆ విషయాలే తెలుగుకవులుగూడా ఎత్తుకోవాలి. కాని దాటకూడదు. భావాలని, శృంగారంఅనండి, కోపంఅనండి, శోకంఅనండి, వాళ్లు ఏ అంచీలమీద నడిపించారో ఆ అంచీలమీదనే వీళ్ళూ నడిపించాలి. అంతేగాని వరస తప్పనియ్యకూడదు. వాళ్లు ఎలాంటివారినిగురించి కావ్యాలు వ్రాశారో, వీళ్లు అలాంటి – ధీరోదాత్తులు, ధీరోద్ధతులు, ధీర లలితలు – అలాంటివారిని గురించే వ్రాయాలి. వాళ్ళు నాట కాలకి ఎన్ని సంధులు – ముఖం, ఆ ముఖం, గర్భం మొదలై నవి – పెట్టారో అన్ని సంధులు వీళ్ళు పెట్టాలి.

అంతేగాని ఒక్క అడుగు జవదాటకూడదు. ఏదయినా ఒక్కచోట తెంపరితనంతోనో, లేక తనకి బాగా ఉన్నట్టు కనబడడంచేతనో ఎవడయినా తెలుగువాడు కొంచెం వ్యతి రేకంగా వ్రాశాడో, వాడిని ప్రమాణాలు చూపమంటారు. సూత్రాలతో సాధించమంటారు. ప్రయోగాలు ఇవ్వమంటారు. "నేరకపోయినాను: ఇక నా కళ్ళని వాడనురా బాబూ" అని ఏడుస్తారు. "ఇక నెప్పుడూ నాకు కనబడేటట్టూ, నా ఊహాకు వచ్చినట్టూ, యథార్థంలో ఉన్నట్టూ ఇక నెప్పుడూ వ్రాయను, వ్రాయను, వ్రాయను" అని చెంపలు వేసుకున్నట్లు చేస్తారు.

## కష్టంటే కలిగే చిక్కు

"ఒక బాటసారి మిట్టమధ్యాహ్నం ఒక పెద్దచెరువు దగ్గిరకి వెళ్లాడు. ఆ చెరువులో వికసించిఉన్న కలవపుష్పాలూ, పరిచిఉన్న కలవఆకులూ, ఈదుతూవున్న నీటి బాతులూ, స్నానంచేస్తూఉన్న తుంగదుబ్బులూ, ఆవలిగట్టున చీరలార





వేసుకుంటూఉన్న ఒక చిన్నది, అన్నీకలిసి అతని ఆయాసాన్ని ఒక్కసారి ఎగరకొట్టేశాయి" అని ఎవడైనా ఒకడు వ్రాస్తే, ఇకను ఏమైనా వాడి మర్యాదా చిక్కుతుందా? వాడిని ఏడుచెరువుల నీళ్ళు త్రాగించకుండా ఉండేవారా? ఆ వ్రాతగాడికి అటు ఏడుతరాలదాకా, ఇటు ఏడుతరాలదాకా మోక్షం ఉండడానికి వీలుందా? ఇంత ఘోరానికి కారణం ఏమిటో చూచారా? పట్టపగలు కలవలు వికసించి ఉండకూడదు అని మహాకవులు ఎక్కడో,ఎప్పుడో వ్రాశారు. సూర్యుడు రాగానే కలవపువ్వులు ముకుళించిపోతాయట, రాత్రికాగానే పద్మాలు ముకుళించిపోతాయట. ఆ మాటని జవదాటకూడదు, ఎవ్వడయినా సరే. పగలు కలవపువ్వులు వికసించి ఉండడం ఎంతమంది చూచారు కారు, అవి కలవలు కావంటారా? అయితే మనం కలవలని చూడడమే లేదన్నమాట.

కళ్ళతో చూచిన దానిని కలంతో వ్రాస్తే, ఇంత ఆగడం వస్తుంది. కళ్ళుమూసుకొని "కలవలన్నీ ఆ సమయాన్ని ముకుళించుకపోయి ఉన్నాయి" అని వర్ణిస్తే అందంగాఉందని అంటారు. ఇది ఒక కవిసమయం. ఇలాంటి కవి సమయాలు చాలా ఉన్నాయి. చకోరపక్షులు చంద్రుడి కిరణాల్లోని మొదటి తళుకులు తిని జీవిస్తాయట! అవేమిపక్షులో, ఎవరు చూచారో మన మెరగం. కాని వ్రాయడంమాత్రం మానరు. ఇవన్నీ కవిసమయాలే. వీటిలో ఏమయినా నిజంఉంటే, అది ఏదో ఒకదేశంలో, ఒక శీతోష్ణస్థితిలో అలాఉండి ఉండవచ్చును. కాని మన దేశంలోమాత్రం అవి అన్నీ వట్టి అబద్ధాలు అన్నమాట.



కవిసమయం అంటే ఇలాగ తేలింది ఏమిటి? కళ్లు మూసుకొని కవులు ఆచారరూపంగా వ్రాస్తూఉన్న అబద్ధాలు అని తేలుతుంది. అచ్చువేసి విడిచిన అబద్ధాలు. అంతేగాని వేరుకాదు. అంతే అయినా, వాటిని తప్పించివ్రాస్తే ప్రమాదం వస్తుంది.

అబద్ధాలకే ఇంత అధికారం ఉన్నప్పుడు, అవే ఇంత పట్టుదలతో అవలంబించవలసి వచ్చినప్పుడు అంతో, ఇంతో సత్యంఉన్న తక్కిన వర్ణనల కెంత అధికారం ఉంటుందో వేరే చెప్పడం ఎందుకు? చచ్చినా, చెడినా, ఒప్పుకున్నా ఒప్పుకోక పోయినా, వీళ్ళకలాగ తోచినా తోచకపోయినా వాటిని అవలంబించక తీరుతుందా? అవశ్యం అవలంబించాలి. అలాగే వ్రాయాలి. అలాగ వ్రాసినంతకాలమూ ఎవ్వరూ ఆక్షేపించరు.

ఏ రవంత అయినా ఆ వ్రాతలని తప్పించి వ్రాశాడో ఇక చూడండి వాడిపాట్లు! వ్రాసినదానిలో ఏమయినా నిజం ఉందా, లేదా అని చూడడంలేదు. ఆలాంటి వర్ణన ఎవడయినా "మహాకవి" వ్రాశాడా, లేదా అని చూస్తారు. "ఏమండీ కవిగారూ ఎక్కడయినా ప్రమాణం ఉందా" అని అడుగుతారు. లేదండీ అంటే లెంపలు వేసుకోమంటారు. అంగీకరించరు. అవతల పారవేయమంటారు.

కాబట్టి ఆ వర్ణనలే ఉండడం తటస్థించింది. ముఖం పద్మమో, పూర్ణ చంద్రబింబమో అయింది. కొప్పు (నాచు) శైవాలమో, చమరీవాలమో అయింది. ఇలాగే శరీరంలో ఉన్న అవయవాలన్నీ ఏమిటేమిటో అయాయి. అయి అయి





ఆఖరికి ఊరుకున్నాయి. మరి అనడం మానుకున్నాయి. ఏబాణుడో ఇక మరికాకూడదు అని ముద్ర, 144-వ సెక్షన్ లాగ, వేసేవాడు. అందుచేత మరి కొత్తగా ఏ అవయవమూ ఏదీకాదు. అయిందంటే అపరాధం అయింది. ఎవడికో, ఏ సమయంలోనో, ఏగుణాలవల్లనో కాళ్ళు పద్మాలలాగ కనిపించాయి. వాడు అలావ్రాశాడు. వాడు పెద్దపేరూ, పాండిత్యమూ ఉన్నవాడు. కాబట్టి అందరూ అలాగే వ్రాయాలనడం ఏమి న్యాయం? ఇంకొకలాగ వ్రాయకూడదు అనడం ఏమినీతి? పోనీ అలా వ్రాసినవాడయినా, ఎందుకు కాళ్లు కమలాల లాగున్నాయో, ఆ సంగతి అయినా చెప్ప గలడా? చూపులు తుమ్మెదలాగ ఎందుకన్నారో తెలుసునా? పూర్ణచంద్రుడిలాగ ముఖం ఎందుకు, ఏగుణంవల్ల కనబడు తున్నదో చెప్పలేదు. కాని వ్రాయడంమాత్రం మానలేదు. వ్రాస్తూనే ఉన్నాం ఉగ్గుపాలతో నేర్చుకున్నాం కాబట్టి. ఎవరైనా నాకలాగే కనిపిస్తూఉన్నాయి అంటే ఆ మాటగూడా మనం ఒప్పుకోవాలి అనుకుంటాను. అంతవరకు వచ్చింది మన దృష్టి.

## నియమాలు పంపిపారేశాయి

ఇలాగ ఏమిటయింది? తెలుగులో గ్రంథాలు అనేకం లేచాయి. వాటిలో అనేకపట్టణాలు, అనేక రాజులు, అనేక స్త్రీలు, అనేక వివాహాలు, అనేక వేటలు అనేకం వర్ణించారు. కాని, ఆ పట్టణాలన్నీ ఒక్క ఇంజినీరు కట్టినట్టే ఉంటాయి. ఆ రాజులంతా ఒక్కబడిలో చదువుకున్నట్టే ఉంటారు.



ఆ స్త్రీలంతా ఒక్కదిమ్మనితీసిన బొమ్మల్లాగే ఉంటాయి. అంతా అచ్చువేసినట్లుంటుంది. రవంతైనా వ్యత్యాసముండదు. కాసంతైనా కంటికి కట్టినట్టుండదు.

ఇకను కతలుగూడా అలాంటివే. ఒక్కకమ్మచ్చున తీసినతీగలే. ఆ అష్టాదశవర్ణనలే. ఆటస్సాలే. ఇలాగ ఒకనాడా, రెండు రోజులా దగ్గరదగ్గర ఆరు, ఏడువందల సంవత్సరాలు ఈ సంస్కృతం వరవళ్లు తను ప్రభుత్వాన్ని చలాయించాయి. వాటిఆజ్ఞలు రామాజ్ఞఅనేటట్టు పాలించాయి. ఒక విమర్శ కుడు అన్నట్టుగా ఒక పుస్తకంచూస్తే తక్కినవి చూడ నక్కర లేదన్నంత వరకు వచ్చింది.

అంటే అర్థంఏమిటి ? దురభిమానంలేకుండా చెప్పాలి అంటే, తెలుగు సాహిత్యం జీవంలేనిది అయిందిఅని అనాలి. అంటే ఆ సంస్కృతం నియమాలు మన సాహిత్యాన్ని చంపి పారేశాయి.

## నియమాలని నిందించవచ్చునా ?

నియమాలుండడం మంచిదేకదా ! మరి ఆ నియమాలు వచ్చాయని విచారించడ మెందుకు అంటారు. నిజమే, నియ మాలు ఉండాలి. నియమాలు, ఆదర్శాలూ ఉండవలసినవే. నేనింతకు ముందు చెప్పినట్లు అవిలేకుండా ఉండలేము. కాని, ఎలాంటి నియమాలు ? ఎలాంటి ఆదర్శాలు ? తగినవి, మన అభివృద్ధికి దారి చూపించేవి, ప్రజలు అనుసరించేలాంటివి. అలాంటి నియమాలు ఉండవలసినవే. కాని, మనకి సంస్కృతం

ఇచ్చిన నియమాలు అలాంటివికావు. పొరపాటు. సంస్కృతం ఇచ్చినవి అంతే కొంచెం సత్యానికి దూరమైపోతూంది. కాబట్టి, సంస్కృతంలోనుంచి మన పండితులు తెచ్చుకున్న నియమాలు అనడం మంచిది. ఈ తెచ్చుకున్న . నియమాలు చాలా అన్యాయమైనవి. అపాయకరం అయినవి. ప్రాణవాయువులని పీల్చివేశేవి. మన వ్యక్తిత్వాన్ని నాశనం చేశేవి. అలాంటి నియమాలతో తెలుగు సాహిత్యాన్ని కట్టివేశారు. ఇలాంటివాటిని నిందించడం న్యాయానికి విరుద్ధం అని అనలేము. ప్రపంచంలో ఏది శాశ్వతం, అంతామిథ్య అని ముక్కుమూసుకొని ఉన్నవాళ్లు అయితే ఏమని అంటారో కాని, పులుసూ, కారం తింటూఉన్న మనలాంటివారం మాత్రం అది తప్పుకాదు అని అనలేము. సాహిత్యానికంతటికీ అపారమైన నష్టంకలిగించినదాన్ని కన్నతల్లిలాగ కౌగిలించుకోగలమా ?

## సంస్కృతాన్నిగురించి ఒక్కమాట

నా వ్యాసాలలో చాలాసార్లు సంస్కృతాన్ని గురించి చెప్పవలసివచ్చింది. అది తెలుగుకు చేసిన నష్టంగురించి వ్రాయవలసివచ్చింది. అందులో చాలామట్టుకు వినడానికీ, వ్రాయడానికీ, చదవడానికీ చాలా కష్టంగా ఉంటుంది. ఈ మాట నేను ఎరుగుదును. ఆ మాటలు వ్రాయడానికి నేనూ కష్టం పడుతూనేఉన్నాను. నేనూ చిన్నప్పటినుంచి సంస్కృతం మర్యాదలతోనే పెరిగినాను. ఆ అభిప్రాయాల్లోనే జీవించాను. అయినా, వ్రాయవలసిన అవసరం కంటికి ప్రత్యక్షంగా కని



పిస్తూ ఉన్నప్పుడు నిజం వ్రాయడానికి జంకలేదు. అభిమానం సత్యాన్ని కప్పిపుస్తే దురభిమానం అవుతుంది. అంచేతనే ఇలాగ వ్రాయవలసివచ్చింది. ఇందుచేత సంస్కృతంభాషని, సంస్కృత సాహిత్యాన్ని, సంస్కృత విజ్ఞానాన్ని నిరసిస్తున్నానని మాత్రం పాఠకులు తలంచకూడదు. ఆ అభిప్రాయము నాకు రవ్వంతయినా లేదు.

## సంస్కృతం గొప్పతనం

సంస్కృతం చాలా గొప్పభాష అనీ, అందులోని విజ్ఞానం చాలా ఉత్కృష్టమైనదనీ, ఆ సారస్వతం చాలా ప్రశంసనీయమని నేను ఎరుగుదును. ప్రపంచ విజ్ఞానంలో సంస్కృతం వాళ్లు ఇచ్చినది చాలా ఎక్కువ అని నేనూ అంటాను. ప్రపంచానికి ఉన్న కవులలో సంస్కృతంవాళ్లూ కొంతమంది ఉన్నారు అని నేనూ అంటాను. మంచిమంచి పుస్తకాలు సంస్కృతంలో ఉన్నాయి అని నేనూ వాదిస్తాను. సంస్కృత సాహిత్యం ఎక్కువ శ్రద్ధతీసుకొని చదవవలసిందే. అనేక విషయాలలో సంస్కృత విజ్ఞానం మనకు ఆధారం అనవలసిందే. సంస్కృతం చదవవలసిందే. అందులోఉన్న విజ్ఞానం తెలుగులోనికి తీసుకురావలసిందే. ఈ సంగతులు చెప్పడంలోనూ, సాధ్యమైనంతమట్టుకు ఆచరణలోపెట్టే అభిలాషలోనూ నేను ఎవరికీ తీసిపోను.

ఇక్కడ మనకు కావలసింది అంతా మన సాహిత్యంగాని మరొకరి సాహిత్యంకాదు; ఆంధ్ర సారస్వతంగాని సంస్కృత సారస్వతంకాదు; తెలుగుభాషగాని సంస్కృతభాష కాదు;

వీటి మంచిచెడ్డలనుగురించి మాటలాడవలసివచ్చినప్పుడు సంస్కృత దృష్టివల్ల కలిగిన ఫలాఫలాలు చెప్పక తప్పింది కాదు. సంస్కృతంలోని శాస్త్రాలు, విజ్ఞానం, మంచిఊహాలు అన్నీ తెలుగులోనికి రావలసిందే. ఆరూపంగా తెలుగు అభివృద్ధి పొందవలసిందే అని అందరూ ఒప్పుకుంటారు. అలా అని తెలుగుతనాన్ని నిర్మూలం చేయనియ్యడం దోషం అవుతుంది. తెలుగులో సంస్కృత సాహిత్యాన్ని చూపడంతో తీరదు వ్రాతగాళ్ళపని. తెలుగులో తెలుగు సాహిత్యాన్ని చూపాలి. సంస్కృతం పరిచయంవల్ల మరింత అభివృద్ధి పొందడానికి బుద్ధిపుట్టాలి, గాని బానిసబుద్ధి పుట్టిపోకూడదు. సంస్కృత జ్ఞానం కలిగింది అని తెలుగు స్వతంత్రం రూపు మాసిపోతే లాభం ఏమిటి? తెలుగుప్రజలు, తెలుగు జీవనం, తెలుగు ఊహ అనేవి కనిపించకుండా ఉంటే, లక్ష గ్రంథాలు ఉంటే ఏమిటి? వెయ్యిలక్షల కవులుంటే ఏమిటి? తెలుగు సాహిత్యం అనిపించుకుంటుందా? అప్పు అనిపించుకుంటుంది. ముష్టి అనిపించుకుంటుంది. మరేదో అనిపించుకుంటుంది కాని తెలుగు అనిపించుకుంటుందా? అనిపించుకోదు. ఈ ఉద్దేశమే నన్నీవిధంగా వ్రాయించింది.

అభిమానాలని దూరంఉంచి, పక్షపాతంలేకుండా ఆలోచిస్తే మీ కందరికీ ఈ ఉద్దేశం కలగక తప్పదు. మాటకోసం ఏమీ మన పుస్తకాలలో తెలుగుతనం లేదా, తెలుగు ఊహ లేదా అని అనకండి. ఇది వాదనా, గెలవడమూ కాదు; నిజం తెలుసుకోవడం. రైలుబండిలో కూర్చొని ప్రయాణం



చేస్తూ ఉన్నవాడికి ఆ రైలు ఎన్ని వంకరలు తిరుగుతూ ఉంటుందో తెలియదు. ఎప్పుడూ ముక్కుకి సూటిగా, తిన్నగా పోతూఉన్నట్లే అనిపిస్తుంది. బయటికివచ్చి చూస్తే ఆ సంగతి అంతా, నిజం ఎలా ఉందో అలా కనిపిస్తుంది. మనం అంతా అలా రైలుబండిలో పోతూనే ఉన్నాము. అందులో పోతూఉండిగూడా పైని నిలబడి చూస్తూ ఉండడానికి శక్తి ఉండడం సులభంకాదు. కాబట్టి వంకరలు, టింకరలు కనబడ డానికి అవకాశాలు తక్కువ. అంతమాత్రంచేత మనమున్న రైలు తిన్నగా పోతూనే ఉన్నది అనుకోవడం తెలివితక్కువ అవుతుంది. ఈమాట మనసులో ఉంచుకోవాలి. సంస్కృతం మనకి అలాంటి నష్టాన్ని ఏమైనా కలిగించిందా, లేదా అని అడుగుతే, నేను ఒక్క సంగతి చెప్పతాను వినండి.



# 8

## తమిళ సాహిత్యం

అరవవాళ్ళకున్న సాహిత్యం ఒక్కసారి పరీక్షచేస్తే కొన్ని ముఖ్యం అయిన సంగతులు బోధపడతాయి. వాళ్ళ సాహిత్యమే తమిళ సాహిత్యం. తమిళ సాహిత్యం అంటే తక్కువ సాహిత్యంకాదు; చాలా పురాతనం అయింది. చాలా మట్టుకు స్వంత శక్తిమీద, స్వంత ఊహమీద నడిచింది. చాలామంది విదేశీయుల గౌరవాన్నిగూడా పొందింది. ఆ సాహిత్యా, దానిలోని మార్పులూ చూస్తే మన సంగతి కొంత బోధపడుతుందంటాను. అరవలనే ఎందుకు ఎత్తుకొన్నాను అంటే, వాళ్ళకీ మనకీ చాలా సంబంధం ఉంది. అన్నా, అమ్మా అని అనడం ప్రారంభించింది మొదలు, కాలూ, చెయ్యీ ఆడించిన నాటినుండి, కూడూ, గుడ్డా కోరిన దగ్గరనుంచీ, ఇల్లూ, వాకిలీ కట్టుకున్న రోజులనుంచీ చావు కలిగినదాకా వాళ్ళకీ, మనకీ సంబంధం కనబడుతూనే ఉంది. మనం అంతా ఒక్క శాఖవాళ్ళం. వాళ్ళూ, మనమూ తోబుట్టువుల్లాంటివాళ్ళం. కాబట్టి వాళ్ళతో సరిపోల్చుకుంటే మనకి కలిగిన మార్పులు చక్కగా తెలుస్తాయి



అని నేను వాళ్ళతో పోలుస్తున్నాను. వాళ్ళ గ్రంథాలలో మొట్టమొదటిదని నేను చెప్పలేనుగాని, చాలా పురాతనమైనది "సిలప్పదికారం" అనే గ్రంథం ఒకటి ఉన్నది. 2000 సంవత్స రాల క్రిందట వ్రాసిన గ్రంథం ఇది. ఇప్పటికీ ఉన్నది. చాలా మంచి గ్రంథం. కొంత శ్రమపడి ఈ గ్రంథాన్ని గురించి కొంత తెలుసుకున్నాను. నెలకు రు. 20 లు ఇచ్చి ఒక పండి తుని పెట్టుకొని ఈ గ్రంథంలోని సంగతులు తెలుసుకున్నాను. కాబట్టి దీనిని గురించి చెప్తాను.

## సిలప్పదికారం

ఈ సిలప్పదికారంలోని కథని నేను కొంతకాలం క్రిందట "సమదర్శిని" పత్రికలో ప్రచురించాను. అది వట్టికథమాత్రం. వర్ణనాదులు అందులో నేను వ్రాయలేదు. కాని వాటిని నేను చక్కగా బోధపర్చుకున్నాను. అప్పటికి నాకు కొంత తెలుగు పోకడలు, సంస్కృతం పోకడలు, కొంత పాశ్చాత్య భాషలలోని పోకడలు తెలిసిఉండేవి. కాని సిలప్పదికారంలోని పోకడలు వేరు. ఆ గ్రంథం చదువుతూఉంటే ఆ రోజులలోని అరవజాతివారు ఎలాగుండేవారో, వాళ్ళ ఆచారాలు ఏమిటో, వాళ్ళ పట్టణాలు ఎలాగ కట్టుకొనేవాళ్లో, వాళ్ళ వ్యాపారాలు మొదలైనవి ఏమిటో ... అన్నీ అలా కంటికి కట్టినట్టు కనబడ తాయి. గ్రీకు భాషలో "పెరిప్లూస్ ఆఫ్ ది ఇరిత్రియన్ సీ" మొదలైన గ్రంథాలు చదివితే ఏమి సంగతులు తెలుస్తాయో ఆ సంగతులు చాలామట్టుకు, నాకు ఈ సిలప్పదికారంలో కనిపించాయి. ఇలా నేను వ్రాస్తే అది ఒక చరిత్ర పుస్తకమో,





ఒక భూగోళశాస్త్రమో అని అనుకుంటారేమో! కాదు. చక్కని ప్రబంధం. పులకలు పుట్టించే కథావస్తువు. గుండెలని ఆపేసేలాంటి సన్నివేశాలు. బొమ్మలు, సజీవచిత్రాలు, కలిగించే వర్ణనలు. ఇలాంటివాటితో నిండిఉన్న మహాకావ్యం. అంతేకాని సాధారణం అయిందికాదు. చమత్కారాలకో, లోటులేదు. అలా కవి దానిలో తన శక్తులని చూపించాడు. ముష్టిలేసి మొగతనాన్ని కనబరిచాడు. స్వతంత్రం అంటే ఏమిటో తెలిపించాడు, కవి అన్నవాడికి నోరూరించాడు. తగిన కీర్తి సంపాదించాడు. ఆ వర్ణనలకీ, మన కలవాటుపడిపోయి ఉన్న వర్ణనలకీ మహాసముద్రాలు మధ్యనఉన్నాయి. కంఠతాపెట్టిన వర్ణనలు మనవి; కళ్ళతో చూచిన వర్ణనలు అతనివి.

ఇలాంటివే "మణిమేఖలై" మొదలయిన గ్రంథాలు. వాళ్ళ కంబరామాయణం చూడండి. కథ ఆన్యులిచ్చినదే. కంబడు చెప్పినట్టు తాను మునివపుడు (వాల్మీకి) చెప్పిన రామాయణాన్ని చూచాడు. అయినా కంబడి వర్ణనలు కంబడివే. అతని ఊహాలు అతనివే. దిమ్మని తీసిన బొమ్మలు కావు. స్వతంత్రం స్ఫుటంగా కనిపిస్తూ ఉంటుంది. ముష్టి కసబడదు.

వీళ్లు మనసోదరులు. వాళ్లలాగే మన కవులుగూడా ఊహా, చాతుర్య శక్తీగలవాళ్లేగాని తక్కువ కావలసిన వాళ్లుకారు. కాని; ఏమిలాభం? వాళ్ల స్వతంత్రాన్ని బలి చేశారు. అమాంతంగా కళ్లనుఊడదీసి నైవేద్యం చెల్లించారు. సర్వశక్తి పరిత్యాగంచేశారు. అచ్చుదిమ్మలతో ఆనందించారు



అని మనసు ఎంతనొస్తుందో ఆలోచించండి. అలాంటి ప్రాత గ్రంథం ఒక్కటయినా మనకిలేదే అని ఎంతవిచారం కలుగుతుందో చూడండి !

## చచ్చిన నియమాలు

ఇలా గయిపోవడానికి కారణం ఏమిటంటారు? ఇందాకా నేను చెప్పిన నియమాలు, మనవాళ్లు తెచ్చిన నియమాలు, నడపకపోతే నరకంఅని అమలులోపెట్టిన నియమాలు, సజీవ నియమాలుకావు. సంస్కృతం మృతభాష. తెలుగులో అందరికీ తెలిసేటట్టు చెప్పాలంటే చచ్చినభాష అనాలి. అది ఈనియమాలవల్లనే చచ్చిందో, మరేకారణంవల్లనే చచ్చిందో ఆ సంగతితో మనకిక్కడ పనిలేదు. కాని, ఒకటిచచ్చినప్పుడు దానికి ఆచారాలు, నియమాలుగూడా కొంతకారణం అవుతవి అనిమాత్రం మనము మరవకూడదు. అలా చచ్చినప్పుడు దానికి ఉన్న నియమాలని తెచ్చి మన తెలుగువాళ్లు అచ్చు దిమ్మలుగా తయారుచేశారు. వాటిలో ఏమాత్రమయినా జీవకళ ఉన్నా, అది ఈ దిమ్మలలో చచ్చింది అనక తప్పదు. సంస్కృతం జీవసాహిత్యాన్ని ఇస్తూఉండే రోజులలో నియమాలు ఉండేవి. కాని, ఆ నియమాలు పెరగడానికి, తరగడానికి వీలుగా ఉండేవి. కవుల భావాలనీ, స్వతంత్రాన్నీ నిర్మూలించేసేలాంటివి కావు. ఆ రోజులలో కవుల కళ్ళకి గంతలు కట్టలేదు. ఊహాలకి సంకెళ్లు వెయ్యలేదు. క్రొత్తక్రొత్త ఊహాలూ, చక్కని గ్రంథాలూ పుట్టుతూఉండేవి.

జీవకళలు తగ్గిపోతూఉన్నకొద్దీ నియమాలు కొయ్యబారిపోయాయి. ఆ నియమాలు మనవాళ్లు తీసుకొనివచ్చారు. తెచ్చి, నేను చెప్పినట్టుగా, సీసపుదిమ్మలు చేసేశారు. ఇంక పెరగడానికిగాని, తరగడానికిగాని, మార్పు కలుగడానికిగాని అవకాశం ఏమిఉంటుంది? బ్రతికిఉన్నవాడి నియమాలు అవలంబించకుండా, శవంనియమాలు అవలంబిస్తే బ్రతికిఉన్న వాడుకూడా శవం కావలసిందేకదా, అంటే జీవకళలేకుండా ఉండవలసిందేకదా! అలాగే అయింది మన తెలుగుసాహిత్యం. వేడివేడి నెత్తురుతో జీవయాత్ర సాగిస్తూఉన్న తెలుగుప్రజలకి మన సాహిత్యంలో జాగా లేకపోయింది. జావా, సుమత్రా ద్వీపాలికి వెళ్లి వలసలు ఏర్పాటుచేసే చేవగలిగిన తెలుగుతనానికి జాగా లేకపోయింది. పడవలు కడుతూ, సముద్రాలు దాటిన తెలుగు సాహసానికి జాగాలేకపోయింది. ఇంతెందుకు, బ్రతికిఉన్న తెలుగుకి జాగాలేకపోయింది తెలుగుసాహిత్యంలో.

## అరవవాళ్లపాటి మనంకామా?

తెలివితేటలలోగాని, ఊహాశక్తిలోగాని, సాహసంలోగాని, స్వాతంత్ర్యంఅంటే అభిలాషలోగాని, చమత్కారబుద్ధిలోగాని ఆంధ్రులు అరవవాళ్ళపాటి వాళ్లుకారా అన్న ప్రశ్నకి మనమందరం ఇచ్చేది ఒక్కటేజవాబు: అరవవాళ్ళపాటివారమేకాదు. అరవవాళ్ళకన్నా ఎక్కువవాళ్ళమే. ఎన్నో విధాల ఎక్కువవారమే. అలాగ అయిగూడా మనం చూపించింది ఏమిటి ఈ ప్రపంచానికి? వాళ్లు చూపించినట్టు స్వాతంత్ర గ్రంథాలుచూపించలేక పోవడానికి కారణం ఏమిటి? ఆ పాటి



స్వతంత్రబుద్ధిని కనబరచక పోవడానికి హేతువుఏమిటి అని ఆలోచిస్తే, ఈ శవనిబంధనలే అని అనవలసివస్తుంది. ఈ బానిస బుద్ధే అని చెప్పవలసివస్తుంది. ఈ శృంఖలాలే లేకపోతే మనం గూడా గర్వించడానికి తగిన పుస్తకాలు చూపించి ఉందుం. మనంగూడా మా స్వతంత్రబుద్ధి, ఊహ ఇలాగ ఉండేది అని చెప్పి ఉందుం. తెలుగులో తెలుగు సాహిత్యం కనబర్చి ఉందుం.

అలాజరగలేదు. కాబట్టే సంస్కృత విషయాన్ని గురించి ఇలాగ వ్రాయవలసివచ్చింది. వస్తువు విలువకలిగినదే కావచ్చు. మంచిదే కావచ్చు. కాని మనకి అది నష్టం కలిగించినప్పుడు అది పనికిరాదు అని చెప్పడం అవసరం. అది మన కందరికీ కర్తవ్యంకూడాను. అందుచేతనే ఈలాగ వ్రాస్తున్నాను. అంతేగాని, సంస్కృతం నాకు కిట్టక కాదు. అందులో అభిరుచి లేక కాదు.

ఈ ఆరేడువందల సంవత్సరాలలోనూ తయారయింది అంతా తెలుగులో సంస్కృత సాహిత్యమే గాని, తెలుగు సాహిత్యం కాదు అని అన్నాను. అలా చప్పిడిమాటలతో చెప్పితే చాలామందికి నచ్చకపోవచ్చును. కొంతమందికి కిట్టక పోవచ్చును. ఎవడో ఒకడు అలా అనుకున్నాడు, దానికేం అని కొందరు త్రోసివేయ వచ్చును. కాని, అదికాదు. ఆంధ్ర ప్రపంచం అంతా ఈ మాటనే చాటుతూ ఉన్నది. ఆంధ్ర విద్యా సంస్థలన్నీ ఈ అభిప్రాయాన్నే వేయినోళ్ళతో ప్రకటిస్తూ ఉన్నవి. సాహిత్యాలను గురించి సర్వం తెలిసిన విద్యాధికు

లంతా ఈ ఉద్దేశాన్నే, చెవిటివాళ్లుగూడావినేటట్టు, చెప్పుతూ ఉన్నారు చూడండి.

ఆంధ్ర విష్ణువులు

పాఠశాలలో మొన్న మొన్నటిదాకా తెలుగు నేర్పుతూ ఉండే పండితులంతా ఎవ్వరో ఒక్కసారి చూడండి. వాళ్లు నేర్చుకున్న దేమిటో తెలుసుకోండి. వాళ్ళందరూ ఏసంస్కృతం గురువుగారి దగ్గరనో సంస్కృతం నేర్చుకున్నవాళ్లే. వాళ్ళకి వచ్చిందంతా సంస్కృతమే. ఏదో ఒక తెలుగు వ్యాకరణం, నాలుగు తెలుగుపద్యాల లక్షణాలు చూచుకుంటే చాలు; తెలుగు పీఠాలని అధిష్ఠించడానికి అర్హులు అయిపోయేవాళ్లు. సంస్కృతం వచ్చిన తరువాత తెలుగేపాటి అండీ అనేవారు. విద్యాధికారులు అవునని తలలూపేవారు. ఉద్యోగా లిచ్చే వారు. ఇప్పుడు తెలుగు మేష్టరులుగా రావాలన్న వాళ్లు ప్యాసుకావలసిన పరీక్షలు చూడండి. తెలుగు వస్తే చాలదు. సంస్కృతంలోనూ ప్యాస్ కావాలి. విశ్వవిద్యాలయాల్లోనూ, కళాపరిషత్తులలోనూ తెలుగు లెక్చరరులు కావాలంటే వాళ్ళుగూడా సంస్కృతం కాగడా పట్టుకొనే వెదుకుతారు. సంస్కృత పరీక్షలు ప్యాసు కావాలి, లేకుంటే తెలుగు చెప్ప డానికి అర్హుడుకాడు.

ఈ సంగతులన్నీ నిజం. అతిశయోక్తిలేదు. ఇవన్నీ దేనిని తెలుపుతాయి? తెలుగు సాహిత్యం అన్నది తెలుగు అచ్చులో, తెలుగు అక్షరాలలో ఉన్న సంస్కృత సాహిత్యం అన్నమాట కాదా? ఈ విద్యాధికారులూ, ఈ విశ్వవిద్యా



లయాలూ ఆ మాటనే కదా చెప్పకుండా చెప్పుతూ ఉన్నారు! కృష్ణదేవరాయలకి ఆంధ్ర విష్ణువు కలలో కనిపించి అన్నాడట. ఏమని తెలుసునా? "ఓ కృష్ణరాయా, నీవు సంస్కృతంలో అది వ్రాశావు, ఇది వ్రాశావు. పండితులంతా మెచ్చుకున్నారు. అలాంటి నీకు తెలుగులో వ్రాయడం ఏపాటి? కాబట్టి ఆముక్తమాల్యద తెలుగులో వ్రాసేయ్" అని అన్నాడట. ఏదో అలాంటి ఉద్దేశం ఆ 1500 చిల్లరవాడికి ఉంది. కాని 1936 లో కూడా అలాగే ఉంటుందా అనుకుంటాం. కాని ఇప్పటికీ ఆ ఆంధ్ర విష్ణువు అనేక అవతారాలు తాల్చి, అనేక రూపులతో అలాగే ఆంధ్ర విద్యాలోకంలో ఉన్నాడు.

ఒక సమాధానం

సంగతి ఇలాగే ఉంది అని ఒప్పుకుంటే, కొందరు ఒక సమాధానం చెప్పతారు. ఆంధ్ర సాహిత్యంలో సంస్కృతం ఎక్కువగా ఉంటుంది కాబట్టి, సంస్కృత జ్ఞానం అవసరం అన్నారు గాని మరేమీ కాదంటారు. ఇవి నీళ్ళుతుడిచే మాటలు, క్షమించాలి. ఇంగ్లీషుభాషలో ఎంత గ్రీకు, ఎంత లాటిన్, ఎంత శాగ్జను ఉంది? ఇంగ్లీషులో, లెక్చరరు కాదు, పెద్ద ప్రొఫెసర్ కావాలి అన్నా, అతనికిఇంగ్లీషు బాగావచ్చునా రాదా అనే చూస్తారు కాని, అతను గ్రీకు పరీక్షలు ప్యాస్ అయాడా, లేదా అని చూడరే! లాటిన్ పరీక్ష సర్టిఫికేటు చూపించు అని అడగరే! ఎందుచేత? గ్రీకు మాటలు ఉన్నాయి, గ్రీకు సూత్రాలు కొన్ని ఉంటాయి ఇంగ్లీషులో అని వాళ్ళకు తెలియదా? తెలుసును. కాని ఇతను చెప్పవలసింది

ఇంగ్లీషు సాహిత్యంగాని, గ్రీకు సాహిత్యంకాదు అని వాళ్ళు ఎరుగుదురు. కావలిస్తే నిఘంటువు లుండనే ఉన్నాయి. కాబట్టి ఇంగ్లీషే చూస్తారు. మనది అలాగ లేదే అంటే, ఆ సమాధానం పనికిరాదన్నమాట. ఆంధ్ర విష్ణువు ఇంకా ఉన్నాడన్నమాట. ఇలా సంస్కృత పాండిత్యంతో తెలుగు ఆచార్యులు అయినవాళ్ళవల్లకూడా తెలుగుకి కొంత నష్టం కలిగింది.

ఆచార్యులుగ్రహించలేకపోయారు. చెప్పలేకపోయారు. చాలా సున్నితమైన తెలుగు అందాలు ఈ పండితులు పట్టుకోలేకపోయారు. కొన్నిచోట్ల తప్పులుగూడా చెప్పారు. సంస్కృత సాహిత్యంలో ఢంకామీద దెబ్బకొట్టి చెప్పే చమత్కారాలన్నీ వాళ్ళకి తెలిసిఉండేవే. కాబట్టి వాటిలో ఏమీ తొణుకుబెణుకు ఉండదు వీళ్ళకి. కాని సూక్ష్మమైన తెలుగుకంఠంలో తక్కువ స్థాయిని వాగించిన ధ్వనిని వీళ్ళు గుర్తించలేకపోయారు. ఇలాంటి నష్టం కొంత కలిగింది. ఇలాంటిది రాకుండా కాచుకోవలసిన భారం విద్యాసంస్థలమీద ఉంది అని మనవి చేస్తున్నాను.



# 9

# నియమాల పంజరం

ఇలాగ ఒక్కొక్కదానికి ఒక్కొక్క కట్టుడు నియమాలతో ఒక సంస్కృత పంజరం చేశారు. గట్టి ఇనపకడ్డీలతో బందోబస్తుగా తయారుచేశారు పంజరాన్ని. ఆ పంజరంలో బ్రతకవే అని విడిచిపెట్టారు మన తెలుగుని. అందులో కొట్టుకుంటూ ఉండు అని అనుగ్రహించారు. ఇక తెలుగు చేయవలసింది ఏమి ఉంటుంది? ఏమిచేసినా నియమాల పంజరం అడ్డుతుంది. తెంపరితనం చేయబోతే చెంపలకి దెబ్బలు తగుల్తాయి. ఇంకా గట్టిగా ప్రయత్నిస్తే తల పగులుతుంది గూడాను. అలా అయింది మన తెలుగు సంగతి ఆ రోజులలో. మన కవులకు అలా ఉండేది కాలబలం.

## స్వతంత్రంగా ఉండాలన్న ఆశ

పంజరం ఎంత గట్టిదయినా, చిలుక ఎంత బలహీనమైనదైనా చిలుక తన స్వాతంత్ర్యాన్ని మరచిపోతుందా? ఎలాగ మరచిపోతుంది? స్వతంత్రంగా ఉండాలి. తనకిష్టంవచ్చినట్టు చెయ్యాలి. తన శక్తిని కనబర్చాలి అన్న ఊహలు ప్రతిజీవికి





సహజం. స్వతంత్రం, స్వశక్తి చూపించడానికి ప్రతిమనుష్యుడు ప్రయత్నిస్తాడు. తక్కినవాళ్లను మించిపోవాలన్న ఉద్దేశం ప్రతి మనుష్యుడికి ఉంటుంది.

అలాంటప్పుడు ఎక్కువ ఊహలూ, ఎక్కువ హృదయమూ కలిగిన కవులకు ఆ ఉద్దేశం ఉండకపోతుందా? ఎంత వాళ్లు నియమాలలో పడిపోయినా ఈ స్వతంత్రబుద్ధి పోదు. ఎలాగయినా తన తెలివితేటలు చూపించి తక్కినవాళ్లకన్నా గొప్ప అనిపించుకోవాలి అన్న ఆశ ఉండక మానదు. పంజరంలోఉన్నా ఆ చిలుకగూడా రెక్కలు రెపరెపలాడిస్తుంది. క్రిందినుంచి మీదికీ, మీదినుంచి క్రిందికీ వస్తూపోతూ ఉంటుంది. ముక్కుతో ఇనపకడ్డీలను కొరుకుతుంది. కొంతస్వేచ్ఛకోరుతూ ఉన్నట్లు కనబడుతూ ఉంటుంది కదా.

మనుష్యుడు అందులో కవి, ఏమీ చేయకుండా ఊరుకుంటాడా? ఊరుకోడు; ఊరుకోలేడు. కాబట్టి కొంత ఆధిక్యాన్ని సంపాదించాలని తప్పకుండా ప్రయత్నంచేస్తాడు. కొంత సాధిస్తాడు.

కాని, ఆ సాధించింది తన నియమాలుండడంవల్ల సాధించాడు అని మాత్రం మనం అనుకోకూడదు. ఆ నియమాలున్నప్పటికీ వాటి నతిక్రమించి అతడు సాధించాడనే అనుకోవాలి. అంటే ఆ ఆధిక్యం సంపాదించడంలో నియమాలు అతడికి ఏమీ సాయంచేయలేదు అన్నమాట. తన గొప్పతనాన్ని చూపించడానికి ప్రయత్నం చేస్తాడు. అది తక్కినవాళ్ళ గొప్పతనంకన్నా కొంచెం ప్రత్యేకంగా ఉండాలని చూస్తాడు. తన స్వాంతాన్ని కొంత కనబరుస్తాడు.



## మనకవులు చూపిన స్వాతంత్ర్యం

కాబట్టి మన కవులు ఆ రోజులలోనయినా కొంత స్వాతంత్ర్యాన్ని చూపకుండా ఉంటారా? అని అడుగుతే మన కవులుగూడా కొంత స్వతంత్రాన్నీ, కొంత ప్రత్యేకతనీ వాళ్లవాళ్ల కవిత్వాలలో చూపించారు అని గట్టిగా చెప్ప వలసిందే. తెలుగు వ్రాతగాళ్ళలో అప్పుడూ, ఇప్పుడూ మంచి బుద్ధిగలవాళ్లు ఉన్నారు. చురుకయిన తెలివితేటలు గలవారు ఉన్నారు. కుశాగ్రమయిన విమర్శనగలవారు ఉన్నారు. ఇలాంటివాళ్ళు తమ స్వాతంత్ర్యాన్ని చూపించకుండా ఉండ లేరు. వాళ్ళముందు వ్రాసిన కవుల గ్రంథాలు చూచి ఉంటారు. వాటి వాటిలో ఉన్న మంచిచెడ్డలను గ్రహించి ఉంటారు. మంచిని మించిపోదాని అనుకుంటారు. చెడ్డని తప్పించుకుందాం అని ఆలోచిస్తారు. ముందుపోయిన వ్రాతగాళ్ళ త్రోవలు చూస్తారు. మళ్ళీ అలాగే వ్రాస్తే గొప్ప లేదని తెలుసుకుంటారు. కొంచెం కొత్తమార్గం చూపించాలని నిశ్చయించుకుంటారు.

ఈలాగ వాళ్ళకున్న తెలివితేటలు వినియోగించటానికి ప్రయత్నం చేయడం సహజం. ఏభాషలో కానీయండి, ఏ దేశంలో కానీయండి, ఇది మానవస్వభావం. దాన్ని ఎవడూ తప్పించుకోలేడు. ఆ స్వభావం ఉండబట్టే ప్రపంచం ఇన్ని విధా లుగా మార్పు చెందుతూఉంది. అభివృద్ధి పొందుతూ ఉంది. సజీవంగా ఉంది. ఆ ఒక్కగుణమూ లేకుండా ఉంటే ఈ ప్రపంచం వట్టి శవం అయి ఉంటుంది కదా !

అలాంటి సజీవమైన సృష్టి సూత్రాన్ని తెలుగువాళ్ళు మాత్రం ఎలాగ తప్పినడుస్తారు ? నడవలేరు. నియమాల పంజరం ఉండనీయండి, నిర్బంధాల కోటగోడలు ఉండనీయండి, సూత్రాల బందిఖానా ఉండవనియ్యండి, ఆ స్వతంత్రబుద్ధిని చూపించాలి. మన ప్రాతగాళ్ళు చూపించారు. నిర్జీవమైన ఈ నియమాల పంజరమే లేకుండా ఉంటే ఆ చూపించడం లోకం అంతా చూచేటట్టు చూపించే ఉందురు. సంస్కృతంలో మొదటి కవీశ్వరులు, అరవంలోని కవులు, విదేశాలలోని కవులు చూపించినంత స్వాతంత్ర్యమేకాదు, దానిని మించిపోయినంత స్వాతంత్ర్యంగూడా ప్రకటించే ఉందురు. ఈఇనపరూళ్ళ కర్రలే లేకుండా ఉంటే స్వేచ్ఛావిహారం చేసి, సాహిత్య ప్రపంచంలో ప్రఖ్యాతిని పొంది ఉందురు. ఈ వేరుపురుగు లేకుండా ఉంటే తెలుగు సాహిత్యం శాఖోపశాఖలుగా పెరిగి, మహావృక్ష మయి, చాల ఉపయోగకరంగా ఉండి ఉండును. ఈ సంకెళ్ళే లేకపోతే ప్రపంచంలో ఎన్నిభాషలలోనికో మన తెలుగు గ్రంథాలు తర్జుమా అయిపోయి ఉండును. తెలుగుతనమూ, తెలుగు రుచులూ, తెలుగు భావాలూ ప్రపంచమంతటా వ్యాపించి ఉండును. ప్రపంచం తెలుగుమీరిపోయి ఉండును.

ఇది వట్టి అతిశయోక్తికాదు. ఇది కవిత్వధోరణికాదు. ఉపన్యాసరంగం బుద్ధికాదు. వాస్తవం, యథార్థం, సత్యం. త్రికరణశుద్ధిగా నేను పొందిన అభిప్రాయాన్ని వ్రాశాను.

మన గ్రంథాలను విమర్శనతో చదివినవాళ్ళకందరికి ఆ స్వాతంత్ర్యం తళుకులు, మినుకుమినుకుమనే కానీయండి,



కనబడక తప్పవు. మన ప్రబంధాలని ఆలోచనతో చదివినవాళ్ల కందరికి ఆ కవులకుండే ఉన్నతమైన అభిప్రాయాలు సూచనగా నైనా కనిపించకపోవు. ఈ సంగతి నేను బాగా చూచాను. ఆ ఛాయలు ఉన్నాయి. కాని ఈ సూత్రాల మహాసముద్రంలో అవి తేనెచుక్కలయిపోయాయి. స్థూలదృష్టికి కనబడకుండా పోయాయి. అలాంటివి చూడడానికి ప్రయత్నంగూడా మన పండితులు చేయలేదు మొన్న మొన్నటిదాకా.

## మన కవుల విమర్శనశక్తి

మన కవులలో చాలామంది మంచి నేర్పుగలవారు, సూక్ష్మమైన బుద్ధిగలవారు, మంచివిమర్శనశక్తిగలవారు అంటే ఈ రోజులలో కొందరికి హాస్యాస్పదంగా కనబడవచ్చు. కొందరు నమ్మకపోవచ్చును. కాని ఆ మాట నిజం. ఆ దినాలలో విమర్శన అనేది ఒక ప్రత్యేకకళగా ఉండకపోయినా, వాళ్లకి సాధారణంగా ఉండే విమర్శన అంతా ఆ కావ్య సూత్రాలని అనుసరించి ఉండేదేఅయినా, అదిమనకి ఇప్పుడు రుచించకపోయినా, ఏమయినా, వాళ్లకి విమర్శనశక్తి అపారముగా ఉండేదనిమాత్రం మనం ఒప్పుకోకతప్పదు. వాళ్లందరు వట్టికుంకలనీ, గ్రుడ్డి పాతాలు వ్రాయడమే పరమార్థం అనుకున్న వారనీ తలచడం అన్యాయం. సాహసంగూడా అవుతుంది. మన కది గ్రుడ్డి అభిప్రాయం అవుతుంది.

నన్నయాదుల పద్ధతి చూచి తిక్కన 'అలంతి తునియల కాహళ సంధించి'నట్లుండాలి అని వ్రాయడం గ్రుడ్డివ్రాత అవుతుందా ? వేలకొలది పద్యాలు వ్రాసిన కవులను చూచి

వాళ్లవాళ్ల కవిత్వాలలో ఉన్న సారాన్ని విడదీసి చెప్పగలగడం గ్రుడ్డిగ్రవ్రాత అవుతుందా? నన్నయభట్టు, తిక్కయజ్వ, శంభుదాసుడు, ముగ్గురు ఒక్కలాంటి పండితులు, కవులు. ఒక్క పుస్తకాన్ని పట్టి తెలుగు చేసినవాళ్ళు. ఎక్కువగా, వేలకొలది, పద్యాలు వ్రాసినవాళ్లు. అలాంటివాళ్ల కవిత్వాలని పట్టుకొని, విడమరిచి, వాళ్ళవాళ్ళలో ఉన్న ప్రత్యేక గుణాలని చూడగలిగిన వాళ్ళది గ్రుడ్డిచూపు అవుతుందా? నన్నయభట్టు ఉభయవాక్కుల ప్రౌఢి కలవాడని, తిక్కన రసోచితమార్గమున పోవువాడని, శంభుదాసు శబ్దవైచిత్రి కలవాడని వేరుపరిచిచెప్పగలవాడు దద్దమ్మ అవుతాడా? పెద్దవిమర్శనగాళ్లు ఇప్పుడయినా ఆ ముగ్గురిని విమర్శించి వ్రాయదగినది ఇంతకన్నా ఏమయినా ఎక్కువఉందా? లేక కవితాసారాన్ని బాగా రుచిచూచి, సమాసాల సర్కసునీ, మాటలగారడీని అనుభవించి, సంస్కృత కవుల పోకడలనీ, తెలుగు వ్రాతగాళ్ళ పోకళ్ళను కళ్ళతో చూచి, కవిత్వం అంటే ఇలాఉండాలి అని చెప్పగలిగిన పింగళి సూరన్నలాంటివాళ్ళు తెలితక్కువ గ్రుడ్డివ్రాతగాళ్ళవుతారా? చూడండి ఏమన్నాడో సూరన్న!

శబ్దసంస్కార మెచ్చటను జాఱగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబు పొంతఁబోక,
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియ గడవఁజనక,



ప్రకృతార్థభానంబు పాదుకోనదుకుచు
నుపపత్తియెందు నత్యూర్జితముగ,
నొకటం బూర్వోత్తర విరోధమొందకుండం,
దత్తదవయవ వాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరం
బలుకనేర్చుట బహు తపఃఫలముకాదె?

తిక్కన చెప్పిన—

అమలోదాత్త మనీష నే నుభయకా
వ్యప్రౌఢిం బాటించు శి
ల్పమునన్ బారగుండన్ కళావిదుండ...

అన్నమాటలకి అర్థమేకదా అది.

పొసగ ముత్తెపుసరుల్ పోహళించినలీల...

అని సూరన్న చెప్పడం తిక్కన చెప్పినమాటేకదా!

......నప్పలుకుల్ సరిగ్రుచ్చునట్లుగాం
జేరుప నేరంగావలయుం
జేసెద నేం గృతియన్నవారికిన్.

ఇలాంటివాళ్లు గ్రుడ్డిగ్రాతగాళ్ళవుతారా? చేమకూర వేంకటరాజకవి చెప్పినట్టు మూడు అంతస్థులతో ఉన్న విద్యా విధానం మనకు ఎంతమందికి బోధపడ్డది?

ఎందును విద్యలే యెఱుంగ
రెవ్వ, రెఱింగినం గొంతమాత్రమే
యందును సాహితీరస మ
హత్వమెఱుంగ, రెఱింగి రేని యా
యంద మెఱుంగలేరు......





అన్నాడే, అలాంటివాడు గ్రుడ్డిచదువుగాడవుతాడా? గ్రుడ్డివ్రాతగాడవుతాడా? అలా అనడం చాలా సాహసం అవుతుంది. మొట్టమొదట అది మానవస్వభావంకాదు. తరవాత వీళ్ళందరూ ఇన్ని దృష్టాంతాలు చూపిస్తున్నారు. కాబట్టి విమర్శనవాళ్ళ కందరికీ ఉంది.

## ప్రబంధకవుల స్వాతంత్ర్యం

పోనీయండి, విమర్శనశక్తి ఉన్నంతమాత్రంచేత లాభం ఏమిటి? ఆవిమర్శన ఫలితాలని వాళ్లు మనకిస్తేకదా, ఆ విమర్శనలవల్ల కలిగిన లాభం వాళ్ళ గ్రంథాల్లో కనిపిస్తేకదా అని అడగవచ్చును. అలా అడిగినా మన కవులు వెనకపడవలసిన వాళ్లుకారు. వాళ్ళకి విమర్శన ఉన్నది అని ఎంత నిరాఘాటంగా చూపించారో, అలాగే స్వాంత్రాన్నిగూడా నిస్సందేహంగా చూపించారు. కవికి కొంత స్వాతంత్ర్యం చూపించడానికి అవకాశం ప్రబంధాలలో కలిగింది మనవాళ్ళకి. శ్రీనాథుడు శృంగారనైషధం వ్రాస్తే, అన్నా ఇది బాగుందికదా అని పిల్లలమర్రికవి శృంగార శాకుంతలం వ్రాయడానికి పూనుకొంటే, అల్లసాని పెద్దన్న మనుచరిత్ర వ్రాయడానికి పూనుకున్నాడు. కథలు పూర్ణంగా సంస్కృతంలోనివే. అందులోను మనుచరిత్ర కథ పూర్తిగా మారనగారి మార్కండేయ పురాణంలోనిదే. ఘట్టాలు అవే, వాక్యోపవాక్యాల చమత్కారమూ అదే. కాని వర్ణనలు పెంచి చక్కనిమాటలతో, అపూర్వమైన తూగుతో, చతురమైన వచోరచనతో అల్లి వ్రాశాడు. అల్లసానివాని అల్లిక జిగిబిగిఅని పేరు పొందాడు. ఇది కాదని

 

ముక్కు తిమ్మన్న చిన్నకథను తీసుకొని, పెంచి పెద్దచేసి, బొమ్మను చిత్రించినట్లు కళాకౌశలంతో పారిజాతాపహరణం వ్రాశాడు. ముద్దుపల్కులకి ముద్రపట్టుకున్నాడు. ఇతని కళా దృష్టి మంచి సమర్థులయిన వ్యాఖ్యాతలుగూడా గమనించ లేదని చెప్పడానికి విచారంగా ఉంది.

ముక్కు తిమ్మన్న

ప్రస్తుతమున్న వ్యాఖ్యానాల్లో ఈలోపం ఉండడం చూచి, చింతించి, అయ్యో పోయెనుగదా ముక్కుతిమ్మన్న గారి శ్రమఅంతా అనీన్నీ, మళ్ళా ఎవరయినా వ్రాయడానికి పూనుకుంటారా ఇంత వ్యాఖ్యానము అనిన్నీ, ఈనాటి వాళ్ళకి ఇంతకన్నా ఎక్కువ తెలియలేదే అని మన తరవాతి ఆంధ్రులు అంటారుకదా అనిన్నీ నేను, ఉండబట్టక, పారిజాతా పహరణ "భావప్రకాశిక" అన్న పేరుతో, ఒక వ్యాఖ్యానమే అనండి, కథను వ్రాశాను. ఆకథ "సమదర్శిని"లో 1932 లో ప్రకటితమయింది గూడాను ఒక రెండు నెలలపాటు. అలాంటి కళాదృష్టి చూపించి పెద్దన్నకన్న మిన్న అనడానికి చూచాడు. తిమ్మన్న. అది చూచాడు రామరాజభూషణుడు.

రామరాజుభూషణుడు

వాళ్ళని మించిపోవడానికి ఎన్ని ప్రయత్నాలు చేశాడో, ఎంత తెలివితేటలు చూపించాడో ఎంత పేరు సంపాదించాడో అందరికీ తెలిసినసంగతే. సాహిత్యానికి సంగీతం మేళవించాడు. అర్థానికర్థం జోడించాడు; ఎత్తుకి పై యెత్తు వేశాడు.





కేవల కల్పనాకథలు
కృత్రిమరత్నము, లాద్యసత్కథల్
వావిరి పుట్టు రత్నము ల
వారిత సత్కవికల్పనావిభూ
షావహపూర్వవృత్తములు
సానలఁదీరిన జాతిరత్నముల్.

అని వాడి నొకచెంప, వీడినొకచెంప కొట్టి తన ఆధి క్యాన్ని అలా నిలుపుకోవాలని చూచాడు. ఆంధ్రకవులు అన్న వాళ్లలో చాలామందికి ఒక పెద్ద వరవడి పెట్టాడు. చేతులకి జల కలిగించాడు. నోళ్లు ఊరించాడు.

అయితే మాత్రం అతన్ని విడిచి పెట్టారా? అందరూ అతని వరవడినే వ్రాశారా? అదెలాంటి కృత్రిమరత్నం అవు తుందో చూదాం అని మాదయ్యగారి మల్లన్న * స్వతం త్రించాడు. ఆ సంస్కృతంనుంచి ఆ పాటి కథనయినా ఎందుకు తీసుకోవాలి, అంతా మననే కల్పించకూడదా కథని అని ఈయన తెలుగులో మొట్టమొదటి స్వతంత్ర ప్రబంధాన్ని వ్రాశాడు. నీ సానల తీరినదేపాటో, నామాయరత్నం ఎలాంటిదో చూడు అన్నాడు.

చెప్పఁదగు కవిత రసముల్
చిప్పిల, నప్పప్ప, బళిబళీయన; లేదా
యెప్పుడు చెప్పక యుండుట
యొప్పుసుమీ, సుకవి యెంత యుచితజ్ఞుఁడో కో!

---

* రాజశేఖర చరిత్రకర్త.



అని రామరాజ భూషణుడికి బదులు సవాల్ చేశాడు.

ధూర్జటి, రామకృష్ణులు తమ స్వాతంత్ర్యాన్ని సుస్థిరంగా చేసుకున్నారు. గ్రుడ్డిగ్రాతగాళ్లు ఆ గౌరవాన్ని పొందగలరా మరి ?

## పింగలి సూరన్న

చూచాడు పింగలి సూరన్న. సారస్వత ప్రపంచంలో అన్ని జాగాలు అందరూ ఆవరించుకొని కూర్చున్నారు. నేను కూర్చోడానికి జాగా లేదని ఊరుకున్నాడా ? లేదు. వాళ్ళకన్నా ఎక్కువ ఆధిక్యం సంపాదిస్తానని కంకణం కట్టుకున్నాడు. పరిశీలించాడు. అప్పటి వాళ్లంతా రెండర్థాలతో ఒక్కపద్యం వ్రాస్తేనే మహాబాగుందని ఆనందించేవాళ్లు. చూడండి నా దెబ్బ అని

రెండర్థంబుల పద్యమొక్కటియు ని
ర్మింపంగ శక్యంబు గా
కుండున్ దద్ద్వయిఁ గావ్యమెల్ల నగునే
నోహో ! యనంజేయదే !

అని రాఘవపాండవీయం వ్రాశాడు. కలం బలం చూపించాడు. అవకాశం ఎంతవరకుంటుందో అలా ఒక్కసారి కనబరిచాడు. పూర్వంవారి శ్లేషయమక చక్రవర్తిత్వానికి కొంచెం చిక్కు తెచ్చాడు. రాజశేఖరచరిత్రం కేవల కల్పిత కథేగాని అంత దిగ్భ్రమను కలగజేసేదికాదు. పాతపోకడలే అన్నిన్ని. అలా ఉంటే రామరాజభూషణుడికి తగిన ప్రతి సవాల్ కాదనుకున్నాడు. రామరాజభూషణుడి జెండా దింపక

పోయినా తనజండా అంతకన్న ఎత్తుగా ఎగరాలి అని నిశ్చయించుకున్నాడు. ఆలోచించాడు. ఆంధ్రలోకానికి ఇచ్చాడు అమూల్యరత్నాలలాంటివి, కళా పూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము. దేనికదే. అమూల్యాలు. వాటిని గురించి వ్రాయడానికి ఇది స్థలంకాదు. ఆయన చెప్పినట్లుగానే, మంచి అందమైన వస్తువునుచూస్తే వ్రాతగాడికి దానిని పారము ముట్టేటట్టు వర్ణించాలని ఉంటుంది.

అటుగా కద్భుత రామణీయక గుణాఢ్యంబైన
సద్వస్తువున్
పటు నాచారసికుల్ ప్రసంగమయినన్ పారంబు
ముట్టన్ రసో
త్కటతన్ జెప్పక మానజాల రనుపక్షంబొండు
భావించినన్...

మరి దేనికీ అలా ఉన్నా, లేకపోయినా అతని ప్రభావతీ ప్రద్యుమ్నానికి మాత్రం అలా ఉండక తప్పదు. అంచేత ఇప్పుడు ఆ ప్రశంసలో పడలేము. ఇలాంటివాడిని గ్రుడ్డి వ్రాతగాడంటామో? ఘోరమైన విప్లవకారుడనే అంటామో! పాఠకులే నిర్ణయించాలి.

వీళ్ళకు కొంచెం ముందుగా ఉన్న కృష్ణదేవరాయ చక్రవర్తీ, అతని ఆముక్తమాల్యదా చూడండి. ఆ ఊహా చాతురీ, ఆ ప్రపంచ పర్యాలోకనమూ, ఆ కవిత్వ దృష్టీ చూచినవాళ్ళకి అతడు గ్రుడ్డి వ్రాతగాడుకాక ఒకనూరు



కళ్లున్న వ్రాతగాడిలాగ కనిపిస్తాడే! అతని తీరు అంతకుముందు వాళ్ళకు లేదుకదా! తరవాత వాళ్ళకయినా వచ్చిందా!

## చేమకూర కవి

సూరన్న తరవాత మళ్లా స్వాతంత్ర్యం మాకూ ఉంది అని ముక్తకంఠంగా చెప్పినవాడు మన చేమకూర వేంకట రాజు. విజయవిలాసం అన్నా, చేమకూరవాడన్నా ఒకటే అని రెండో వ్రేలు ముడవడానికి వీలుండదు. ఆ ఫక్కీయే వేరు. ఇతరులకి రాదు. కమలంవాసన కమలానిదే. చేమకూర రుచి చేమకూరదే. ఉత్తనే అన్నాడూ మహాకవి, మహారసజ్ఞుడు, మహారాజు అయిన రఘునాథరాజు–

ప్రతిపద్యమునందు జమ
కృతిగలుగం జెప్పనేర్తు, వెల్లడబలుకా
కృతివింటి మహారముగా
క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమీ

అని? పింగలి సూరన్న పిట్టలను పెట్టి, వాటిచేత మాటలాడించి, వాటికి స్వభావాతీతమైన శక్తులనిచ్చి, నైషధంలోలాగ కథ లను నడిపించాడు. ఆ సంగతి చూచాడు చేమకూరకవి. అందులోనుగూడా తన నేర్పు చూపించాలని ఇతనూ పిట్టలను పట్టుకొనే రెండు ముఖ్యమైన ఘట్టాలలో, గత్యంతరాలు లేకుండా ఉండే సన్నివేశాల్లో కథ నడిపించాడు. కాని ఎక్కడా వాటికి లోకాతీతమైన శక్తులని ఇవ్వలేదు. అవి సాధారణపు పిట్టలే సుమండీ!





రతికిన్ భారతికిన్ వినోదకథలన్
ప్రాగల్భ్యముం జూపి, త
త్పతులన్ గూర్చిన......

అని రతిపతికి ప్రభావతీ ప్రద్యుమ్నములోనూ, భారతీపతికి కళాపూర్ణోదయములోనూ చేసిన సాయాన్ని ఎత్తిపొడిచాడు.

హంసవింశతిని వ్రాసిన అయ్యలరాజు నారాయణామాత్యుడుగూడా ఆంధ్రకవులత్రోవను ధిక్కరించి, క్రొత్త త్రోవనుచూపి, తన స్వాతంత్ర్యబుద్ధిని ప్రత్యక్షముగ కనబరిచినవాడు. ప్రజలలో, ముఖ్యంగా పాటకజనాల జీవితంలో ఉన్న విశేషాలను, ఆచారాలను, వారి వారి పనిముట్లులను స్వయంగా తెలుసుకొన్నాడు. వాటినన్నింటినీ తన గ్రంథంలో చూపి, ఆంధ్రుల కొక నిఘంటువులాంటిదానిని అందించాడు. కాబట్టి వాళ్లు స్వాతంత్ర్యంఅంటే అభిలాషలేని వాళ్ళనీ, బానిసబుద్ధితోనే పుట్టారనీ అనలేము. అనవద్దు. ముమ్మాటికి అనవద్దు. ఒకరి నొకరు మించిపోవలెనన్నదృష్టే ఉండేది. అలా మించిపోవడంఅంటే తేలికపనికాదు. రామరాజ భూషణుడిని గాని, పింగళి సూరన్ననిగాని మించిపోవడంఅంటే ఎలాంటిది? తాజమహల్‌నీ, హిమాలయా పర్వతాలనీ మించిపోవడం లాంటిది ఆ యా గుణాలలో. అంచేత వాళ్ళు చూపించిన స్వాతంత్ర్యం ఆ యా గుణాలలో సాధారణమైనదికాదు. సాధించడానికి చాలా కష్టమైనది అని స్పష్టం అవుతుంది. దానినిపట్టే వాళ్ళ స్వాతంత్ర్యాభిలాష ఎంతబలమైనదో మనకు తెలుస్తుంది.





వాళ్ళ కా రోజుల్లో ఉన్న చిక్కులలో అంతకు ముందు వ్రాసి గతించిన మహాకవులను మించడానికి వాళ్లెంత శ్రమ పడ్డారు. ఎటువంటి పరికరాలని ఉపయోగించారు. వారిదగ్గర ఉండే కవితాసామగ్రి ఏమిటి. ఆ సాధనాలతో ఎటువంటి మహా ఫలాన్ని సాధించారు అని చూడవలసినభారం మనమీద ఉంది. ఊరకే, అంతా అంటున్నారుకదా అని, ఇవి వట్టి పేలపిండి ప్రబంధాలు అని వాటిని చూడకుండానే నిరసించడం మంచి పనికాదు. వాటిలోఉన్న చెత్తని మనం తప్పకుండా త్రోసి పారవేయవలసిందే! దానికి మరేమీ బంగారం మలామా వేసి మంచిది అనం. కాని, వాటిలోఉన్న మంచిని, ఆవగింజంత అయినాసరే, స్వీకరించాలి. దానిని పోగొట్టుకోకూడదు. అలా చేసినట్టయితే నన్నయ్యగారి సభలు, పండితులుచేసిన మహా ఘోరాన్నే మనమూ చేసినవాళ్ళమౌతాం. మరి మనగొప్ప ఎక్కడుంటుంది? విద్యాధికులూ, విమర్శకులూ వాటిని తరచి, వాటిలోని గుణములను చూపించాలి.

అప్పుడే ప్రబంధాలరోజులు అంతరించాయి. సకారణం గానే అంతరించాయి. ఆ బంధకవిత్వాలు, ఆ మూడర్థాలు, నాలుగర్థాలు, ఆ తేలికతలకాయల కవిత్వాలూ రానురాను ప్రబంధాల మారణమంత్రాన్ని పఠించాయి. కాబట్టే అవి అంతరిస్తూ ఉన్నాయి. అంతరించ నియ్యవలసిందే. కొత్తరకాలు బయలు దేరవలసిందే. కొత్తపోకడలు పుట్టవలసిందే. కాని కొత్తపంటకి అంతరించిపోతూఉన్న పాతపంట ఎరువుకావాలి కదా! అది దీనికి బలం ఇవ్వాలి. అది వ్యవసాయ ధర్మం.

అంచేత మనం అందులోని బలం తీసుకోవడం ముఖ్యం. వాళ్ల ఉద్దేశాలు, వాటిని సాధించిన విధమూ, అందుకు ఉపయోగించిన పరికరాలూ–అవి గ్రహించకుండా పారవేయడం అన్యాయం. అవి భావికవులకి ఉపయోగపడతాయి. ఉద్దేశమూ, మార్గమూ, పరికరమూ ఇవి ఎల్లప్పుడూ ఉండేవే గదా కవులకిగాని, కార్యసాధకులికిగాని !

అంచేత ఈ దృష్టిని ప్రబంధాలు–అంటే ఉత్తి మాయ పూసల ప్రబంధాలుకావు, పేసగాంచిన ప్రబంధాలని మనం కొంచెం జాగ్రత్తగా చూడాలి. వాటిని కేవలం పారవేయకూడదు. అలా పారవేసినట్టయితే ఆంధ్ర సారస్వత జీవనంలో మూడు, నాలుగు వందలసంవత్సరాలు వ్యర్థమైపోయినట్టే అవుతుంది. అంతనష్టానికి ఎవరు ఒప్పుకోగలరు ? ఒకపొలములో మూడుసంవత్సరాలు వట్టి గడ్డి గాదరే పెరిగి చస్తూఉండిందనుకొండి. ఆ సంవత్సరాలలో మనకి దానివల్ల లాభం కనబడకపోయినా ఆ గడ్డి గాదరవల్ల ఆ పొలానికి కొంత బలం కలిగి ఉండాలిగదా ! ఆ బలాన్ని మనం మరచిపోకూడదు గదా !

అందుకే నేను పిట్టకలం పారవేయలేదు. దానిని ఆధారం చేసుకొని కొత్తపాళిని కట్టాను. దానిని పారవేయవద్దు. వాళ్లవిమర్శనా, వాళ్ల స్వాతంత్ర్యాభిలాషా, వాళ్ల పరికరాలూ, వాళ్లకి సిద్ధించినఫలమూ వాటిని గమనించాలి. అప్పుడు వాళ్ల గుణాలు తెలుస్తాయి. విమర్శనశక్తి, స్వాతంత్ర్యాభిలాష, కళాదృష్టి, నేర్పు–ఇలాంటివి వాళ్ల హృదయాల్లో ఎంత బలంగా ఉండేవో, ఎంత శక్తిమంతంగా ఉండేవో బోధపడుతుంది.



# 10

# వాటిలో జీవం కనబడదు

ఆంధ్ర ప్రబంధకవులు విమర్శనశక్తి లేనివారు కారు. స్వాతంత్ర్యం చూపించాలని కోరకుండా ఉండేవారు కారు. కష్టం తెలుసుకోగలగడమూ, తగిన పరికరాలని ఎంచుకోవడమూ, కష్టాన్ని అతిక్రమించడమూ, కోరికను సఫలం చేసుకోవడమూ, ఇవి ఏ కార్యములో ఎవరు చూపించినా చూడదగినవేగదా? అదే ప్రపంచ పాఠం. ఆ గుణాలన్నీ వాళ్ళకి కావలసినంతమట్టుకు ఉన్నాయి. కాని ఆ గుణాలని మన ప్రబంధకవులు చూపించినది మనకి సంతృప్తి కలిగించలేదు. ఇతర దేశాలలోనూ, ఇతర భాషల్లోనూ కవులు చూపించిన విమర్శన, స్వాతంత్ర్యం చూస్తూ ఉన్నాం. వాటితో వీటిని సరిపోల్చుకుంటున్నాం. తారతమ్యాలను పరీక్షిస్తున్నాం. మన హృదయాలకి ఆనందం కలగకుండా ఉంది. ఒక్కొక్కప్పుడు సిగ్గుగూడా వేస్తూ ఉంటుంది. ఇన్ని గొప్పగుణాలూ నిరర్థకం అయిపోయినట్టు తోస్తుంది. ఇన్నిఉండి లాభంలేనట్టు కనిపిస్తుంటుంది. ఎంతఉంటే ఏమిలాభం అనిపిస్తుంది.

కారణం ఏమిటి అనిచూస్తే కనబడేది ఒక్క సంగతే. ఇన్ని గుణాలూ ఆ నిర్బంధనాలవల్ల పనికిరాకుండా పోయాయి. అన్నిటినీ ఆవరించేస్తూఉన్న ఆ సంస్కృత సూత్రాలవల్ల నిష్ప్రయోజనం అయిపోయాయి. సంస్కృతాన్ని సమాప్తి చేయించి, నిర్జీవమైపోయి, తెలుగులోనికి దిగిన నియమాల వల్ల ఏమీ లాభం లేకపోయింది. వాళ్ళ కృషీ, వాళ్ళ పాండిత్యా, వాళ్ళ విమర్శనా, వాళ్ళ స్వాతంత్ర్యమూ అన్నీ సార్థకం కాకుండా పోయాయి.

## రైలుపట్టాలమీద ఇంజను

ఈ నియమాలవల్ల వాళ్ళకున్న స్వాతంత్ర్యం, అంత గొప్పదయినా, లేనిదానిక్రిందకే వచ్చింది. ఆ స్వాతంత్ర్యం అంతా ఎలాగయిందంటే, మంచి బలంఉన్న ఒక ఇంజనుని రైలు పట్టాల మీద పెట్టేసినట్టయింది. ఆ ఇంజనుకి ఎంత బలం ఉంటేనేమి, ఎంత శక్తి ఉంటేనేమి? ఆ పట్టాల మీదనే పోవాలి. పట్టాలు తప్పించ లేదు. వంకరేకానీ, తిన్ననే కానీ, ఎత్తుఎక్కడంకానీ, పల్లం దిగడంకానీ, ఏదయినాసరే ఆ పట్టాలమీదనే, అవి ఉన్న త్రోవనే పోవాలి. తనకున్న బలంఅంతా ఆ పట్టాలమీదనే చూపించాలి. తక్కిన ఇంజనుల కన్నా మెల్లగాపోవచ్చు, వడిగాపోవచ్చు, చప్పుడు కాకుండా పోవచ్చు, చప్పుడుచేస్తూ పోవచ్చు, ఆగవచ్చు, కదలవచ్చు, తనశక్తిని సర్వం చూపవచ్చు ఆ ఇంజను. కాని పట్టాలు మాత్రం ఉంటాయి. అవి తప్పవు. తన బలంఅంతా అంతటి లోనే ఉంది. మీరదు.



అలా అయిపోయింది మనవాళ్ల స్వాతంత్ర్యం, మన వాళ్ల గుణం అంతాను. రాజశేఖర చరిత్రలాగ ఒక స్వంతకథ కల్పించాలన్నా ఆ పట్టాలే ఉంటాయి. స్వతంత్రంగా ఒక మనిషినో, ఒక పట్టణాన్నో వర్ణించాలన్నా ఆ పట్టాలే; నాయికా నాయకుల అనురాగం చూపించాలన్నా ఆ పట్టాలే. అన్నిటికి ఆ పట్టాలే అడ్డు, ఆ పట్టాలేదారి. చూడండి!

## ముక్కుపద్యం

దీనికి దృష్టాంతంగా అందరికీ తెలిసిన ఒక సంగతిఉంది. తెలుగు సారస్వతంలో ఉన్న ముక్కు వర్ణనలలో ఒక పద్యం చాలా ప్రఖ్యాతిని పొందింది. ఆ ముక్కు శాశ్వతమై నిలిచి పోయింది. అది చాలా బాగుంది అనీ, దానిని వ్రాసిన గొప్ప తనం ఎవరిది అని కొంతగాథగూడా బలిసింది. రామరాజభూష ణుడు వసుచరిత్రలో వ్రాశాడని అంటారుకొందరు. కాదుకాదు, అది నంది తిమ్మన్న వ్రాసి, మంగలివాడికి అణాకి బదులుగా, అదిఇచ్చి క్షవరం చెయ్యించుకున్నాడు. దానిని రామరాజ భూషణుడు కొనుక్కొని తన పుస్తకంలో ఇరికించాడు అని అంటారు కొందరు. ఇన్ని మంచిమంచి వర్ణనలతో వసుచరిత్ర నంతా నింపివేసిన కవి ఈ ముక్కు పద్యాన్ని ఒకరిదగ్గర కొని తెచ్చుకుంటాడాఅంటే, ఈ పద్యం తిమ్మన్నే వ్రాయకపోతే నంది తిమ్మన్నకి ముక్కు తిమ్మన్న అని పేరెందుకు వచ్చింది అంటారు. అలాంటి పేరుపొందిన ముక్కుపద్యం చాలా అపూర్వం అనీ, స్వతంత్రం అనీ ఒప్పుకోవాలికదా. పద్యం ఇది.




నానాసూనవితాన వాసనల నా
నందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బ
ల్కాకన్ దపంబంది యో
షా నాసాకృతిం బూని సర్వసుమన
స్సౌరభ్య సంవాసియై,
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీ
పుంజంబు లిర్వంకలన్.

ఈ పద్యంలోని కథ ఏమిటంటే: తుమ్మెద అన్ని పువ్వుల వాసనలూ చూస్తూ ఆనందిస్తూ ఉంటుంది. కాని, నా దగ్గరికి రానైనా రాదేమి అని సంపెంగపువ్వు ఆలోచించిందట. ఎలాగనయినా తనదగ్గరికి వచ్చేటట్టు చెయ్యాలి అని అడవులలో తపస్సు చేసింది. ఆ తపస్సుకి ఫలముగా ఆ సంపెంగ పువ్వు ఆ అమ్మాయి ముక్కు ఆకారాన్ని పొంది, అన్ని పువ్వుల వాసనలు పొందుతూ, తన రెండుపక్కలా తుమ్మెదల సమూహాలను (అవే కంటిచూపులు) నిలుపుకున్నది అని కథ. అదీ కల్పన. దానికే ఆనందించాము. ఇదే ఒరిజినాలిటీ, స్వాతంత్ర్యం! చూపులు తుమ్మెదలు, ముక్కు సంపెంగ పువ్వు. ఇవి పాతవర్ణనలే. ప్రతిపేజీలోనూ అచ్చుపడిపోయి ఉన్నాయి మన సాహిత్యంలో; అంటే సంస్కృత సాహిత్యంలో. మనుష్యుల ముక్కులలో లక్షలకొద్దీ భేదాలున్నా మన పుస్తకాల్లోఉన్న ముక్కులన్నీ సంపెంగపువ్వులు. తప్పితే నువ్వుపువ్వులు; అంతే. కాబట్టి పాతవర్ణనే. అన్ని పువ్వుల



దగ్గరికీవెళ్ళే తుమ్మెద సంపెంగపువ్వుదగ్గరికి వెళ్ళదు అని మన కవులు చెప్పి చెవులలో ఇల్లుకట్టుకున్నారు. నిజమే అనండి, కాదనండి. ప్రపంచాన్ని చూచిన పెద్దలున్నూ, తుమ్మెదలనీ, సంపెంగపువ్వులనీ నిశ్చయంగా తెలిసిన పెద్దలున్నూ, కాదని గట్టిగా అంటే అది కవిసమయంఅని తప్పించుకుంటారు. అంటే మన కవులు ఆచారరూపంగా చెప్పుతూ వచ్చిన అబద్ధం అన్నమాట.

కాని, ఇది మనకవులు, అంటే సంస్కృత కవులు అన్నమాట, చిన్నప్పటినుంచీ చెప్పుతూ వచ్చిందే. కోరికలని సాధించడానికి తపస్సు చెయ్యడమూ, జన్మాంతరాలలో ఫలం పొందడమూ మనపూర్వులు పెట్టిన భిక్షేకదా ! ఇలా అంతా అంతకుముందున్న సరుకే. కొత్తదానిని దేన్నీ తేలేదు. ముక్కుగాని, చూపులుగాని కొత్తగా ఇతనికి కనబడలేదు. అసలు కనిపించాయో, లేదో గూడా అనుమానమే. అతనికి కనిపించిందంతా పుస్తకాలలో సుప్రసిద్ధంగాఉన్న వర్ణనలు, నమ్మకాలు మాత్రమే. కవులు ఇచ్చిన కవితా సామగ్రి కట్టే.

దానిని తప్పి నడవడానికి సాహసం ఉండదు. అలా చేస్తే కవిసమయాలూ, ప్రయోగాలూ, ప్రమాణాలూ ఎక్కడనుండి తేవడం ? అంచేత అందులో అందులోనే పట్టీలు కొట్టాడు. కథ కల్పించాడు. ఆ కల్పనకే అంతపేరు పొందాడు. ఈ రూపంగానే తనశక్తిని, స్వాతంత్ర్యాన్ని కనబరిచాడు.

చూచారా, స్వాతంత్ర్యం పడవలసివచ్చిన పాట్లు ! ఒకగొర్రెని తాడుతో ఒక చెట్టుకు కట్టివస్తే దానికి స్వాతంత్ర్యం

లేదూ ? ఉంది. తాడు ఎంత పొడుగుంటే అంత పొడుగునా చుట్టూఉంది స్వాతంత్ర్యం. అటుపైని మరి లేదు. ఆ తాడుతో గీసినగీత, ఆ సున్నా, దాటలేదు. ఏమిచేసినా ఆ సున్నాలోనే చెయ్యాలి. గొర్రె మేసినా, నిద్రపోయినా, గంతినా, అరచినా, అంతా ఈ సున్నా దాటకుండానే చెయ్యాలి. అలా చూపాడు మన రామరాజభూషణుడు తన స్వాతంత్ర్యాన్ని. గీతలని దాటలేదు. కళ్ళతో చూడడానికిబదులు చెవులతో చూచాడు. ఇతను చాలామట్టుకు తపస్సు, జన్మాంతరాలు తన కల్పనలో పెట్టడమే దీనికి నిదర్శనం.

ఇంతిమృదూక్తి మాధురికి
నిక్షురసం బెనవోవ జాల కా
ద్యంతము నోడి, మధ్యమ గు
ణాశ్రయమై... పెక్కు జ
న్మాంతములన్ వహించి తన
యంత నె ఖండములయ్యెగాని యా
వంతయు గాంచదయ్యె......

ఏమేమోచేసి, అనేక జన్మాంతరములనుపొంది తనంతనే ఖండము లయిందికాని, ఆ గిరికాదేవి మాటలకున్నంత తియ్యన కాలేక పోయింది పాపం ఆ చెరుకురసం.

సతి యూరుద్యుతి జెందబూని నిజ దు
శ్చర్మాపనోద క్రియా
రతి పాథోలవ పూరి తోదరములై
రంభేభహస్తంబులు



స్నతిరిన్ వీడె మరుద్విభూతి కదళీన్
త్వస్తోష మాచంచలో
ద్ధత శుండాలము బాయదయ్యె నదె పో
తద్వైర మూలం బిలన్.

అరటి బోదెలున్నూ, ఏనుగు తొండాలున్నూ తపస్సు చేశాయి. ఇన్నింటిలోనూ రామరాజభూషణుడు చూపిన స్వాతంత్ర్యం అంతే. చేసిన ఘనకార్యమూ అదే. అతనికున్న తెలివి తేటలూ, విమర్శనా, పాండిత్యమూ, అంతా ఈ ఇనపపట్టాల వల్ల లాభంలేక పోయింది. అంతకుముందు సంస్కృత కవులు వ్రాసిన ఉపమానాలూ, ఆ తళుకులూ, ఆ మార్గాలూ పరవళ్లు అవడమేకాకుండా మేకు బిగింపులు గూడా అయాయి. అప్పటికప్పుడే సంస్కృతంలో పెరిగిపోయి సర్వాన్ని ఆవరించేస్తూ ఉన్నవి కొన్ని సంగతులు. అవి దిగుమతి అయి మనభాషలో ప్రకోపించిపోయాయి. అందులో స్త్రీ, మన్మథుడు, శృంగారముతీవ్రంగా తాండవించాయి.

## ఆడది అనడానికి మాటలు

అనేక సారస్వతాలని చూస్తూ ఉన్నవాళ్లున్నారు. భారతదేశానివీ, ఇతరదేశాలవీ భాషలు చూచినవాళ్ళున్నారు. కొంచెం చూడండి. స్త్రీ అనే అర్థంకోసం ఎన్ని మాటలు అలా సుప్రసిద్ధమయిపోయి మన గ్రంథాల్లో ఉన్నాయో! ఒక్కసారి భాషలోని మాటలమీద దృష్టి సారించండి. ఆడుది అనడాని కెన్ని పేరులున్నాయో చూడండి. వెండ్రుకలను బట్టి, నుదురునుబట్టి, ముక్కునుబట్టి, కన్నులనిపట్టి, మెడ, దంతాలు,





నడుము, చేతులు, కాళ్ళు, ఇంకా శరీరంలో ఎన్ని అవయవాలూ, వాటి భాగాలూ ఉన్నాయో, వాటన్నిటినీ పట్టి ఎన్నెన్ని పేరులు వాడుకలో ఉన్నాయో చూడండి. ఎలాంటి మాటలు? కళ్ళుమూసుకొని స్త్రీ అని అర్థం చెప్పవలసిన మాటలు, వ్యుత్పత్తులని ఆలోచించ నక్కరలేకుండానే ఆడది అని చెప్పవలసిన మాటలు. అందులో మన అదృష్టం కొద్దీ మనకి రెండు ఆస్తులు సంక్రమించాయి. అవతల సంస్కృతం లోనివి, ఇవతల తెలుగులోనివి. అవతల ఉత్పలాక్షీ వచ్చింది, ఇవతల కలువకంటీ వచ్చింది.

ఫలితం ఏమిటి అంటే ఆంధ్రదేశంలో ఉన్న స్త్రీల కన్నా స్త్రీ అనే అర్థం ఇచ్చే మాటలు మనభాషలో ఎక్కువ అయిపోయినాయి. మళ్లా మగవాడు అనడానికి మూడు, నాలుగు పేరులు చెప్పిన తరవాత ముక్కవలసిందే మరొక్కటి చెప్పడానికి. మరే భాషలోనయినా ఇలా ఉందేమో చూడండి! స్త్రీ యందు ఆంధ్రులకున్నంత అభిమానం మరి ఎవరికీ లేదేమో తెలియదు. సాధారణాగా స్త్రీ అన్న అర్థం మన కవీశ్వరుల కెంతబాగా పట్టిపోయిందంటే, కొడుకు చచ్చిపోగా కాష్టంలోకి తీసుకవెళ్ళి ఏడుస్తూ ఉన్న చంద్రమతిని వీరదాసుడు—

కరుణాతలంప నెక్కడిది
గంధగజేంద్ర సమానగామినీ

అంటాడు శంకర కవి పుస్తకంలో. 80 ఏళ్ళ వయస్సు కలిగిన ముసలిదానిని తరుణీమణీ అంటాడు మరొక్క కవి. ఎందుచేత?



వాటికి సాధారణంగా స్త్రీ అన్న అర్థమే రూఢి అయిపోయింది. అసలర్థం అంతరించిపోయింది.

## మన్మధుడు అనడానికి

మనభాషలో ఇతనుగూడా సహస్రనామాలతో ప్రకాశిస్తున్నాడు. అతని అనుచరులనుపట్టి, తల్లిదండ్రులనుపట్టి, కవి సమయాన్నిపట్టి, పుట్టినస్థలాన్నిపట్టి, పట్టేవింటినిపట్టి, వేసే బాణాన్నిపట్టి, అల్లే తోటనిపట్టి, వాహనాన్నిపట్టి, భార్యను పట్టి వేలకొద్దీ పేర్లు. ఆంధ్రకవిత్వం అంతా ఎలా కనిపిస్తూ ఉంటుందంటే, ఆడది అనడానికి, మన్మధుడు అనడానికి ఉన్న పేర్లన్నీ తెలిస్తే చాలగ్రంథాలు సాగదీయవచ్చు నన్నట్లుంటుంది. ఇదీ సంస్కృతంలోనుంచి వచ్చిన మహాప్రసాదమే.ఎంత కామపరవశులమోగాని!

## శృంగారం వర్ణనలు

ఇకను మనగ్రంథాలలో ప్రకోపించిపోయివున్న సంగతులలో శృంగారవర్ణనలు చాల ఎక్కువఅయి ఉన్నాయి. ఒకొక్కప్పుడు ఏగ్రంథమయినా ఆడవాళ్ళదగ్గిర చదవాలి అంటే, ఈరోజుల్లో, కొంచెం లోగొంతుకలో చదవవలసిన భాగాలు చాలఉంటాయి, కొన్నిపద్యాలకి పద్యాలే విడిచిపెట్టవలసివస్తుంది. ఎందుచేత? ప్రస్తుతం మనకున్న మర్యాద సూత్రాలనుబట్టి అవి అసభ్యం అని. ప్రబంధకవిత్వంలో ఇది ఒక పెద్దని ద. అందులోనూ మన వ్రాతగాళ్లు మీదమీద పోయే రకంవాళ్ళు కారు. ఒకొక్క అవయాన్నిపట్టి పిప్పిచేసిందాకా వదలరు. వాళ్లు చదువుకున్నదాన్ని అంతటినీ





విసియోగించవలసిందే. అందులో స్వాతంత్ర్యం చూపుతూ సర్కసు మొగ్గలు వెయ్యవలసిందే. భార్యాభర్తలు గదిలోనికి వెళ్ళిపోయి తలుపులు వేసుకొన్నా, ప్రాతగాడు కిటికీలో కూర్చొని చూడవలసిందే. చూచిఊరుకుంటాడా? అందరికీ తెలిసేటట్టు కోడిలాయి కూయవలసిందే. ఎంతఉబలాటమో తెలియదు. ఈ పరిస్థితులు కొంచెం మన ఆంధ్రపాఠకులకి కష్టంగా ఉంటుంది. అది ఒప్పుకోకతప్పదు.

మరే సారస్వతంలోనూ, భాషలోనూ ఇన్ని అగచాట్లు కనిపించవు. ఇంత చేటు ఉండదు. వాళ్ళకీ శృంగారం ఉంది. వాళ్ళలోనూ స్త్రీల కుండవలసిన అవయవా లున్నాయి. వాళ్ల లోనూ స్త్రీ పురుషుల సాంగత్యాలున్నాయి. వర్ణించాలన్న కుతూహలం వాళ్ళ కవులకీ ఉంది. కాని ఈలాటి ఆవేశం వాళ్లు చూపలేదు. సంస్కృతం ఆఖరిరోజుల్లో ఈ వర్ణనలు అధికమయిపోయాయి. ఐశ్వర్యం ఎక్కువయిపోయికానీయండి, అభిరుచులు తక్కువయి పోవడంచేతను కానీయండి, ఆ వర్ణనలు ఎక్కువ అయిపోయాయి. అందులోనుంచి నైషధంలాంటి కావ్యాలు దిగాయి తెలుగులోనికి. గొప్ప కవుల కిదీ ఒక లక్షణ మనుకున్నారు మనవాళ్లు. అవయవాలమీద మొగ్గలువేయడం ఆరంభించారు. మనవారికి గూడా ఇంతో, అంతో ఐశ్వర్యం ఉండేది. గ్రంథం ఇలా ప్రకోపించిపోయింది. మన గ్రంథాలు అలా పరిణమించాయి.

మాతా మరకతశ్యామా
మాతంగీ మధుశాలినీ



అన్న దగ్గర అమ్మా అని పిలిచిన కాళిదాసుగూడా శ్యామలా దండకంలో

కుచోన్నతే కుంకుమరాగశోణే

అని కుచోన్నతిని గురించి చెప్పాడు. పుస్తకం విప్పేసరికి కన బడుతుంది దేవుడిమీదగూడా

శ్రీ వక్షోజ కురంగ నాభ మెదపై -
ఏమండీ ఇలాగంటే, ఇది శృంగార ప్రబంధమూ, నాందీ పద్యంలో వస్తునిర్దేశం ఉండాలి కదా అంటారు. ఆ దేవుడు మన కెందుకు అని బిల్హణీయంలో కవి 'స్తనత్రుటిత కంచుకం' అయిన స్త్రీల రవికలను చించే యౌవనానికి నమస్కరించాడు.

ప్రతిక్షణ విజృంభణా
దుభయ బాహుకూలంకష
స్తన త్రుటిత కంచుకం
నమత యౌవనం యోషితాం

బమ్మెరపోతన్నలాంటి భక్తాగ్రేసరుడు, సాక్షాత్తుగా సరస్వతీదేవి ఏడుస్తూ ఉన్నప్పుడు, తన మనస్సంతా మహా మహా ఉద్వేగం కలిగి తపించుతున్నప్పుడు గూడా చనుకట్టును చూడకుండా ఊరుకోలేకపోయాడు.

కాటుకకంటినీరు చను
కట్టు పయింబడ నేలయేడ్చెదో

అన్నాడు. అలా భాషాసాహిత్యం అంతటిలోనూ ఇవే త్రుళ్ళింతలాడటం కలిగింది. అవసరంలేని చోటులలోనే ఇంత ప్రధానంగా వచ్చినప్పుడు ఇక అదే అవసరమయి వాటినే





వర్ణించవలసివచ్చినప్పుడు మరెంత సర్వాంకషంగా ఉంటాయో వేరే చెప్పవలెనా ?

శృంగారరసవర్ణనలుగూడా అలాగనే శైలుపట్టాల మీదనే నడిచాయి. అంతా స్థాయీభావాలు, సాత్త్విక భావాలు, వ్యభిచారీభావాలు, దశావస్థలు, ఉపాలంబనలు వగైరాలమీదనే నడిచాయి. ఏమి ఇలా అయింది అని ప్రతిఆంధ్రుడు ఆశ్చర్యపడతాడు. కారణ మేమిటి అని ప్రశ్నించు కుంటాడు. ఏదో సమాధానం చెప్పుకుంటాడు.

## స మా ధా నా లు

ఐశ్వర్యం బాగాఉండేది ఆ రోజులలో. చేసినంతవరకు యుద్ధాలు చేసేవారు. తిన్నంతవరకు దెబ్బలు తినడమో, శక్తి ఉన్నంతవరకు దెబ్బలుతినిపించడమో చేసేవారు. ఇంటిదగ్గర సుఖంగా కాలక్షేపం చేయడానికి పూనుకొనేవారు. ఇలాంటి సమయాల్లో వీళ్లు సాధారణంగా స్త్రీలోలులు అయిపోయి, శృంగారసౌఖ్యంలో మునుగుతూ, తేలుతూ ఉండడానికి ప్రయత్నంచేసేవారు. శరీరంలో బలమూ, చేతిలోడబ్బూ, చెలాయించడానికి అధికారమూ, ఎప్పుడు ఏ ముహూర్తాన్ని చచ్చిపోతామో అనే అభిప్రాయమూ, అన్నిటికన్న గొప్ప, కాదని అనేవాళ్లు తక్కువగా ఉండడమూ, అన్నీకలిసి ఇలాంటి ఉద్దేశాలకి చాలా అవకాశాన్ని కలిగించాయి. యుద్ధభూమి నుంచి తిరిగారూ అంటే స్త్రీలమీదికే దృష్టిఅని భర్తృహరి లాంటివాడు చెప్పాడు.



ఆశాసాగరపార మెవ్వరికి శ
క్యంబౌనె చేరంగ భో
గాశాయుక్తము జవ్వనంబు గళితం
బైనం ధనంబేల ? ధా
త్రీశా, యింటికి బోదనే ప్రియవధూ
హృద్యోల్లసద్రూపరే
ఖాశోభాతిశయంబు దుర్భరజరా
క్రాంతంబు గాకుండగన్.

ఆ రోజులలో "యువతీజన మన్మథా" అనడమూ, "పరనారీసహోదరా" అనడము ధనికులకి పెద్దబిరుదులుగా ఉండేవి. శ్రీకృష్ణదేవరాయలను 'వనితా జనతాస్మరుడు' అని సూచించాడు ముక్కుతిమ్మన్న.

అందుచేత స్త్రీలోలత అంతగా నిరసించేవారు కారనే చెప్పవచ్చునేమో ! ఏమయినప్పటికీ, కవులుమాత్రం శృంగారానికి ఎక్కువగా ఒరిగారు. ఆ రాజులకీ, ఆ రెడ్లకీ అలాంటి గ్రంథాలు పుచ్చుకోవడమే ఆచారమైపోయింది.

నిజంగా సంపదకీ, ఇలాంటి శృంగారానికీ అలాంటి సంబంధం ఉందా, లేదా అన్న సంగతిగూడా ఉన్నది. మహా ఐశ్వర్యం ఉన్న రోజుల్లోనూ, రాజుల దగ్గరనూ ఈ శృంగారం శోభించకుండా ఉండడమూ ఉంది. ఇలాంటి ఐశ్వర్యం ఏమీ లేకుండా స్వల్పసంపద ఉన్న రోజులలో ఈ శృంగారం ప్రకోపించి ఉండడమూ ఉన్నది. కాబట్టి ఐశ్వర్యానికీ, ఈ శృంగారానికీ లంకెవేయడం ధర్మంకాదు. విషయలోలత ఆ రోజులలో అంత

విశేషించి పోయిందనడం కూడ ధర్మంకాదు. తెచ్చుకున్న నైషధంలో ఉన్నపద్ధతిని కవులు పట్టుకున్నారని అనడం న్యాయం. శృంగారం ఉత్సాహజనకంగా ఉంటుందికదా! అలాంటి గ్రంథాలు వ్రాయడానికీ, వినడానికీ, కృతి నందుకోడానికీ అభ్యంతరం ఉండేదికాదు. కవిత్వాన్ని గురించి సభలో చెప్పమంటే అల్లసాని పెద్దనామాత్యుడు చూడండి ఎంత శృంగారాన్ని ఉపమానంగా తెచ్చిపెట్టాడో!

పూతమెఱుంగులున్ బసరు
పూఁప బెడంగులు జూపునట్టివా
కైతలు?...............

అని ఎంత శృంగార మొలికించినాడు?

ఆ రోజులలో కవిత్వానికి ఉపమానం "అరచాటగు నాంధ్రవధూటి చొక్కపుంజనుఁగవ" ఎవ్వరికీ ఏమీ అనిపించదు.

మనకందరికీ ఉన్న పెద్ద సమాధానం ఉండనే ఉంది: మన గురువులూ, వరవళ్లుపెట్టిన మహామహులూ ఆ సంస్కృతం వాళ్ళు ఇచ్చిందికదా అని; ప్రమాణాలు, ప్రయోగాలు ఉన్నాయి కదా అని. కాని మొదట ఈ అవయవ వర్ణనకు ఏ భాషలో అయినా సమాధానం ఒకటుండాలి కదా! అదేమిటి అంటే ఒక్క సంగతి చెప్పాలి.

## శిల్పబుద్ధి - అల్పబుద్ధి

ఒక చిత్రకారుడు ఒక స్త్రీ బొమ్మను వ్రాస్తాడనుకోండి. అది తన తల్లిదో, తన సోదరిదో అయే ఉంటుందనుకోండి. అప్పుడు ఆ చిత్రకారుడు అన్ని అవయవాలనూ తగినంత శ్రద్ధ



తీసుకొని చిత్రించడా ? ఏమయినా కొన్ని భాగాలని గౌరవం చేత చిత్రించడం మానివేస్తాడా? అలా మానినట్టయితే చిత్రానికి సంపూర్ణతా, అందమూ కలుగుతుందా ? అలా పనికిరాదు. వ్రాసే బొమ్మ తల్లిదే అయినా తాను అన్ని యెత్తుపల్లాలనీ వ్రాయక తప్పదుగదా. అలాగే ఒక శిల్పి ఉంటాడు. తన తల్లిదే చలువరాతి విగ్రహం ఒకటి చెయ్యబోతాడు. అప్పుడు తాను ఏ భాగాన్నయినా విడిచిపెడతాడా ? అలాగే, కవి గూడా ఒక శిల్పి, ఒక చిత్రకారుడే. కాబట్టి ఆయా అవయవాలని మాటలతో చిత్రిస్తాడు. వాళ్లలాగే ఇతనుగూడా వాటిని విడిచిపెట్టలేడు. ఏ రెండు ముక్కలలోనైనా వాటిని చూపాలి. అలా చేయకపోతే ఆకారమంతా కంటికి కట్టినట్టు ఉండదు. కొంత కొరత గలిగినట్టుంటుంది. అలా నిజమైన శిల్పబుద్ధితో వ్రాశారు కొందరు. అది వరవడిగా పెట్టుకొని అల్పబుద్ధితో వ్రాయడం మొదలుపెట్టారు తక్కినవాళ్లు.

ఇంత మడికట్టుకోలేదు

మరొక సంగతి కూడా కనిపిస్తుంది. ఆ రోజులలో మనుష్యులు ఇప్పటంత మడికట్టుకొని ఉండలేదని తెలుస్తుంది. మాట అంటే మానం పోతుందని ఆరోజులలో భయం అంతగా ఉండినట్టు కనబడదు. పెద్ద పెద్ద ధనికులూ, రాజులూ అంతఃపుర స్త్రీలతో కూర్చొని ఈ గ్రంథాలని చదివించేవాళ్లు, అంకితాలు పుచ్చుకుంటూ ఉండేవాళ్లు, అర్థాలు చెప్పించుకుంటూ ఉండేవాళ్లు. స్త్రీలు పుస్తకాలు వ్రాస్తూ ఉండేవాళ్లు - ముద్దుపళనిలాంటి వారేకాదు, తరిగొండ వెంకమ్మ లాంటివాళ్లూ,

ఆతుకూరి మొల్ల లాంటి వాళ్లున్నా. అలాంటి సమయాల్లో గూడా ఇలాంటి వర్ణనలు ఉండేవి. వాళ్ళందరూ చెవులు మూసుకోకుండా, శ్రీహరీ అనుకోకుండా, సిగ్గుపడకుండా వినేవాళ్లు.

మోహనాంగి చదరంగం

ఒకనాడు కృష్ణరాయలు తన కూతురితో చదరంగం ఆడుతూఉన్నాడట. అప్పుడు రెండు పెద్ద పగల మధ్యను కూతురిబంటు ఉండడం తటస్థించిందట. అప్పుడు బంటును నడిపి పగ తప్పిస్తూ ఆ అమ్మాయి-

ఉద్ధతులమధ్య నిరుపేద కుండఁదర మె

అని అన్నదట. అవివిని కృష్ణదేవరాయలు, అమ్మాయీ పద్యం అంతా చదువు, అన్నాడు.

ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిజూచి
పొలతి తనుమధ్య మెచటికో తొలగిపోయె,
నుండె నేనియు గనపడకుండు నటవె ?
యుద్ధతులమధ్య నిఱుపేదకుండఁ దరమె ?

అని చదివిందట. తరవాత ఎక్కడిదీ పద్యం అని అడగడం, సంకుసాల నృసింహకవి దనడం- అదంతా సాహిత్య చరిత్ర. తండ్రితో కూతురు మాటలాడుతూ ఉంది. పద్యంలో కటి, కుచవర్ణనం, అందులోనూ ఉద్వృత్తిప్రధానం. ఇలాంటి పద్యం చదవడానికి ఆయమ్మ సంకోచించ లేదు. ఇది చదివి నందుకు రాజు మొఖం చిట్లించుకోలేదు. తప్పు అని భావించడం గూడా లేదు. ఏమీదోషం ఉన్నట్టుకనపడనేలేదు.



చూచారా! వాళ్లుమర్యాదాఅంటే తెలియని మూర్ఖులనుకోడానికీ వీలులేదు. ఆపద్యం అర్థం తెలియకుండానే ఇద్దరూ ఉన్నారని అనుకోడానికీ వీలులేదు. అర్థం తెలిసిన మర్యాదస్థులే. అయినా తప్పుగాతోచలేదు. దీనిని పట్టిచూస్తే, ఇప్పుడున్నట్టు అప్పుడు ఈ మాటలభయం అంతగా లేదని కనబడుతుంది. ఇప్పటిలాగ అసాధ్యంగా మడి కట్టుకొని ఉన్నట్టు కనపడదు.

## ఇప్పటి మడికట్టుకోవడం

విశ్వవిద్యాలయాలవాళ్లూ, కళాపరిషత్తులవాళ్లూ ఈ మాటలంటే చాలాజడుస్తారు. ఇలాంటి మాట యేదయినా వాళ్ళ పఠనీయ గ్రంథాల్లో వస్తే వాళ్లే వాటిని తీసేసేవాళ్లు. లేదా ఒక ప్రబంధభాగమే పఠనీయంగా పెడితే కుచాది వర్ణనలున్న పద్యాలన్నీ మాని వెయ్యమనేవాళ్ళు. ఒకనాడు—నేను బి. ఏ. క్లాసు చదువుతున్నాను—మా తెలుగుపండితుడుగారు పాఠం చెప్పుతూ ఉన్నారు. ఒకపద్యం ఆరంభించి చదువుతూ చదువుతూ మూడోచరణం మధ్యను చటుక్కున ఆగిపోయారు. అక్కడ కుచ అన్నమాటఉంది. కుర్రవాళ్ళంతా కెవ్వున అరిచారు. ఆ పద్యం వదిలేయండి, ఆ పద్యం అక్కరలేదు అని అంటున్నారు పండితుడుగారు. ఈ గొల్లు అంతా విని, లెక్కలు చేసుకుంటూ ఉన్న నేను, ఏమిటండీ సంగతి అని పండితుడిగారిని అడిగాను. పాప మాయన నోటితో ఆ మాట చెప్పలేక, నన్ను దగ్గరికి పిలిచి, పుస్తకంలో ఉన్న ఆ మాటను





వేలుతో చూపించారు. నేను ఊరుకోకుండా ఏమంటే, మీరు దానిమీద చెయ్యిపెట్టవచ్చును గాని, కుర్రవాళ్లు వినకూడదా అని అన్నాను. ఎలాగయితేనేమి, చదివించాము. అలా కట్టుకున్నారు మరి. పుస్తకంలో ఉన్నమాటలంటే మానుకున్నారు గాని, ప్రపంచంలో ప్రతిక్షణమూ కనబడుతూ ఉన్న వస్తువుల నేమి చేస్తారు? వస్తువు పేరెత్తడమే నరకం అంటే ఎలాగ? ఏ వస్తువులో స్వతస్సిద్ధంగా చెడుగు లేదు? దానిని ప్రదర్శించే విధంలోనూ, ఆ సన్నివేశంలోనూ ఉంటుంది చెడుగు. దిగంబరంగా ఉన్న గ్రీషియను విగ్రహాలూ, మన విగ్రహాలూ చూస్తూ ఉన్నాముకామా? చెడుగు ఏమయినా ఉందా? అలాంటి విగ్రహాలని మన ఇళ్ళల్లో బల్లలమీద పెట్టుకుంటూ ఉన్నాముకామా? మన స్త్రీలు, పిల్లలు గూడా చూస్తూనే ఉన్నారుకారా? చెడుగు ఏది?

అసభ్యత ఎక్కడుంది?

ఒక గొప్ప చిత్రకారుడు దిగంబరంగా ఉన్న ఆడదాని బొమ్మను వ్రాశాడట. అతని స్నేహితుడొకడు — కొంచెం మడికట్టుకున్నవాడు— ఆ పటాన్ని చూచి అంతా బాగుంది గాని అసభ్యంగా ఉంది అన్నాడట. వాళ్ళిద్దరూ కొంత వాదించుకున్నారు. నలుగురూ ఏమంటారో చూదామని అనుకున్నారు. ఈ చిత్రకారుడు మరొక బొమ్మనిగూడా వ్రాశాడు. అదీ ఇందులో ఉన్న ఆడదే. ఆ అందమే. కాని దిగంబర కాదు. బట్టలున్నాయి. ఆ బట్టలు చిత్రించడంలో తన చమత్కారం చూపించాడు. ఆ రెండు బొమ్మలు ఒక్క-



చోట ప్రదర్శించారు. నలుగురిని కుటుంబాలతో వచ్చి ఆ బొమ్మలిని చూడమన్నారు. దిగంబరంగా ఉన్న బొమ్మని పురుషులు, స్త్రీలు, పిల్లలు చక్కగా చూచేవాళ్ళు. ఆ బట్ట లతో ఉన్న బొమ్మదగ్గిరికి వెళ్ళేసరికి తలలు వంచుకోవడమూ, కూతుళ్ళనీ, భార్యలనీ తొందరపెట్టి అక్కడనుంచి తీసుకొని పోవడమూ ఇలాంటి సంగతులన్నీ జరిగాయి. దాన్నిపట్టి ఏది అసభ్యమో ఆ స్నేహితుడికి బోధ పడ్డది.

వస్తువులో అసభ్యత లేదు. దాన్ని ప్రకటించే విధంలో ఉంది. ఆ ప్రకటించే విధానాన్ని పట్టి దురూహలు కలగడమూ మానడమూ ఉంటుంది. ఆ సంగతి మరచిపోయి ఊరికే మడి కట్టుకోవడం అన్యాయం. మానేయండీ అంటే మరీ పట్టుపట్టి చదువుతారు. కొందరికి వాళ్ళ పుస్తకాల్లో మరేపద్యాలు రాకపోయినా ఈ నిషేధించిన పద్యాలన్నీ కంఠతా వస్తాయి.

అలా తయారుచేసిన విద్యార్థులు, గాజు ఇళ్ళలో పెంచిన పువ్వుల మొక్కల్లాగ, బయటికి వచ్చేసరికి పాడయి పోతారు.

## స్త్రీ పురుష జ్ఞానం ఆవశ్యకంగూడాను

అంతేకాకుండా స్త్రీ పురుషులూ, వాళ్ళ సాంగత్యమూ మొదలయిన సంగతులు మానవులకు తెలుసుకోవలసినవి. చాల ప్రధానమైనవి. తక్కిన జ్ఞానం ఉన్నా, ఉండకపోయినా ఈ జ్ఞానం మాత్రం ఉండాలి సంఘానికి మేలు కలగాలంటేను. దానిని బహిష్కరించిన దేశాలలోనివాళ్ళు వాళ్ళ తెలివి తక్కువని గ్రహించుకున్నారు. మళ్ళా ఆ శాస్త్రాలకి ప్రాముఖ్యం





ఇవ్వడానికి చూస్తూఉన్నారు. ఇదీ ఒక శాస్త్రం. ఈ జ్ఞానంవల్ల ఉపయోగం చాలా ఉంది. అనేకమైన దురాచారాలు పోతాయి. చాలా అసంతృప్తి ఎగిరిపోతుంది. కొన్ని అభిప్రాయాలు బాగుపడతాయి. ఆ జ్ఞానం లేకపోవడంచేత మానవ సంఘం చాలా అవస్థలకు పాలవుతూఉంది. కాబట్టి ఈ విషయాన్ని మనం కేవలంగా నిషేధించకూడదు. గ్రంథాలలో స్త్రీ పురుష సాంగత్య విషయంలోని సంగతులన్నీ మడికట్టుకొని విడిచిపెడితే బాగుండదు. జ్ఞానదృష్టిని ఆ సంగతులను గూడా కవి, అనుభవజ్ఞుడు, గురువు, జనకుడు అంతా చెప్పవలసిఉంది. ప్రపంచాన్ని కళ్ళతో చూడడానికీ, మనసుతో గ్రహించడానికీ తగినట్టు చెయ్యాలి మనవాళ్ళని. గాజు ఇళ్ళలో పెంచితే లాభంలేదు. అలా పెంచి సంఘాన్ని బాగుచెయ్యాలంటే ప్రయోజనంలేదు. వివాహంగాని, సంతానంగాని, బ్రతుకుగాని బాగుపడదు. అందుచేత వీటినన్నిటినీ 'బాయ్‌కాట్' సూత్రం క్రిందికి తేవడం శ్రేయస్కరంకాదు. ఉండడానికి తగినంత, ఉండవలసినరీతిగా ఉండాలి. కాని తలా తోక లేకుండా, అంతా అదే అయిపోయి ఉండడం మంచిది కాదంటాము. ఎవ్వరో ఉద్దేశపూర్వకంగా వ్రాసిన సంగతిని గ్రుడ్డి పాఠంగా వ్రాయడానికి పూనుకొని ఊరూ, వాడా అదే చేయడం మంచిదికాదంటాము.

మన దురదృష్టంకొద్దీ అలాగే జరిగింది మనగ్రంథాలలో. నాయికా నాయకులు చూచుకోవడమూ, ప్రేమపొందడమూ, విరహం అనుభవించడమూ, చంద్రుడినీ, గాలినీ తిట్టడమూ, పిట్టని, పిచ్చికనీ అడగడమూ, అన్నీ కాపీలుకొట్టడమే ప్రారం



భించాయి. అన్నీ రైలు పట్టాలమీదనే నడిచాయి. ఎక్కడో పింగలి సూరన్నలాంటి వాడు కొంచెం కొత్తదారి తొక్కితే నేమి? రైలుపట్టాలు రైలుపట్టాలే! ఆ రైలుపట్టాలని అనుసరించడంవల్లనే వాళ్ళ స్వాతంత్ర్యమూ పోయింది; మన అభిమానమూ పోయింది. ఇది మహానష్టం. ఈ నష్టంనుంచి తేరుకోడానికి ఇంకా మనకు శక్తి చాలకుండాఉంది. తక్కిన భాషలలో కవీశ్వరులు, వ్రాతగాళ్లు తమకు ఉచితంగా కనిపించినట్లు వ్రాస్తూఉంటే, మనవాళ్ళు పూర్వపువాళ్ళకి ఉచితంగా ఉన్నట్లు వ్రాశారు. ఎవరయినా, శేషం వెంకటపతిలాంటి వాడో, ముద్దు పళనిలాంటిదో, చూచినట్టు సంగతులని వ్రాస్తే కొంచెం బొమలు ముడిపడిపోయేవి. చెవులు మూతలుపడేవి. అసభ్యం అనీ, అనుచితం అనీ అనేక పేర్లుపెట్టేవారం. అంతేగాని, శృంగారంలో కొన్ని అసాధారణ ఘట్టాలని ఆ కవులు నిరూపించడానికి పూనుకొన్నారని అనలేదు. పింగలిసూరన్న కాబట్టి శాలీనుడు, సుగాత్రి అన్నవాళ్ళ ఇద్దరి శృంగారాన్ని అంగీకరించాము మూతివిరుపులతో నయితేనేమి. రూళ్ళకర్రలను దాటితే రోషం చూపించేవారం.

## నిర్జీవ గ్రంథాలు

ఇన్ని కారణాలచేత మనకున్న పుస్తకాలు నిర్జీవ గ్రంథాలయి పోయినాయి. పుస్తకాలు లేవని విచారంలేదు. కొనేవాడూ, చదివేవాడూ ఉంటే అవి చాలా ఉన్నాయి. అచ్చువేసే వాళ్లుంటే ఇంకా ఉన్నాయి. అవకాశంఇస్తే వ్రాసే వాళ్ళూ ఉన్నారు. గ్రంథసముదాయం ఉంది. కాని, వాటిలో

జీవం కనబడదు. సీసపు దిమ్మలను తీసిన అచ్చుబొమ్మలు, జీవ కళలుండవు. పట్టణాలన్నీ ఒక్కలాగే ఉంటాయి, నాయకు లంతా ఒక్కరీతే. నాయికలంటేనో, ఒక్క బ్లాకుతో చేసిన వారే. ఇంతకు వాళ్ళువట్టి విగ్రహాలే. తలా, మనసూ, బుద్ధీ అభిప్రాయమూ, ఇవి కలవాళ్లుకారు. వాళ్ళ ప్రేమించింది కూడా అకార సౌష్ఠవమే. ఎక్కడోగాని గుణము రంగానికి రానేరాదు. అలా అంటే పండితులు ఊరుకుంటారా ?

"యత్రాకృతిస్తత్రగుణాభవంతి"

అని, ఆకారం ఎక్కడ బాగుంటుందో అక్కడ గుణాలు బాగుంటాయి అని ఒక సూత్రం మన నెత్తిమీద వేస్తారు. ప్రపంచంలో అలా కనబడదండి అంటే, నువ్వు బాగాచూడ లేదు అంటారు. ఓడిన ఓడలేదంటారు. నమ్మినా నమ్మనట్టే కనబడతారు. పండితుల లక్షణమేఅది. క్రిందపడినా మీదనే ఉన్నానంటూ ఉంటారు. ఇలా వరసపెట్టి వస్తూ ఉండే బొమ్మ లనీ, శృంగారచేష్టలనీ పట్టిచూస్తే, అంతా బొమ్మలాటలాగ కనిపిస్తుంటుంది కాని, జీవులయిన మానవుల ఆటలులాగ కన బడవు. ఏదో పెద్ద బొమ్మలకొలువు లాగుంటుంది. జీవకళలుట్టి బడవు. నగరాదివర్ణనలుగాని, సూర్యోదయాది వర్ణనలుగాని అలాగునే జీవకళలతో నుండక అచ్చు బొమ్మలలాగున ఉంటాయి. కవిచూచి అనుభవించిన సంగతి ఆ పద్యాలలో ఉండదు. ఇన్నింటివల్లా గ్రంథాలు ఎన్ని ఉంటేనేమి ? కవులు ఎంత మంది ఉంటేనేమి ? పాండిత్యం ఎంత ఉంటేనేమి ? ఆ గ్రంథాలలో జీవంలేదు - అంటే చాలా వాటిలో జీవ



కళలూ, కవులదృష్టి కనబడే గ్రంథాలు చాలా తక్కువసంఖ్య. అద్దైనా చాలా స్వల్పంగా కనబడుతుందేగాని విశేషంగా కాదు. ఇలాంటి గ్రంథాలని పట్టుకొని ఇది మనసాహిత్యం అని అంటే ఇతరదేశాలవాళ్లు, లోలోపలనైనా, నవ్వుకోకపోరు. వాళ్ళకిసాహిత్యం అంటే ఉన్న అభిప్రాయాలువేరు. మనకే ఇలా కనిపిస్తూఉన్న గ్రంథాలు వాళ్ళకి ఎలాగుంటాయో ఆలోచించండి !



# 11

## చదివేవాళ్లు గట్టివాళ్లైతే సాహిత్యం చక్కబడుతుంది

ఆంధ్ర ప్రబంధ కవులు వాళ్ళ స్వాతంత్ర్యమూ, వాళ్ళ బుద్ధీ, వాళ్ళ పాండిత్యమూ, వాళ్ళ విమర్శనశక్తీ, వాళ్ళ అనుభవజ్ఞానమూ అంతా సంస్కృత కావ్యసూత్రాలకి ధార పోశారు. ఆ నియమాలకి బలిఇచ్చారు. ఆ గీటులలోనే ముగ్గులు వేశారు. ఆనందించారు. మనలని ఆనందించమన్నారు. మన పండితలోకంగూడా అదే మహానందం అనుకొని మురిసి పోయేవారు. గ్రంథాలని చదవడంగూడా అలాంటి ఆలోచనల తోనే చదివేవారు. చెప్పే చదువూ అలాగే చెప్పేవారు. తరాల తరబడిని వ్రాతా చదువూ అంతా అలాగే నడిచింది. ఏ పద్యాని కాపద్యమే కృషి. ఏ వర్ణన కావర్ణనే దృష్టి. కావ్యం ఏమిటి, అందులోని విషయం ఎలాంటిది, ఆ విషయా నికి ఈ వర్ణన అమరుతుందా, వర్ణన కీపద్యం అతుకుతుందా అన్న సంగతులను చూచేవాళ్లుకారు అంతగా. ఆ కవి అలా వ్రాశాడుకదా, మనం ఇలా వ్రాస్తాము అన్నదృష్టే ఎక్కువ



అయింది కవికి. ఆ తారతమ్యాలు చూచుకుంటూనే ఆనందిం చారు. చనివేవారు. వాడి పుష్పలావికావర్ణన అలా అంటే, వీడిది ఇలా అనుకుంటూ, అల్లసానివాడు అలా అలా ఏడ్చాడు, ముక్కు తిమ్మన్న ముద్దు ముద్దుగా ఏడ్చాడు, భట్టుమూర్తి బావురుమని ఏడ్చాడు అనుకుంటూ చదువరులూ, పండితులూ, విమర్శకులూ అంతా ఆనందించేవారు.

ఏడ్చెఁ గలస్వన-బుళో
మీటినవిచ్చు గుబ్బచను
మిట్టల నశ్రులు చిందువందఁగన్.

అని పెద్దన్న ఆ పరిస్థితిలో వ్రాయడం ఎంత సమంజసం అని గాని,

ఏడ్చె........బాలపల్లవ
గ్రాసకషాయ కంఠకల
కంఠవధూకల కాకలీధ్వనిన్

అని తిమ్మన్న వ్రాయడం ఆ సన్నివేశంలో ఎంత అమరి ఉంది అని గాని,

ఏడ్చె కిన్నరవధూ
రాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచి కారవసుధా
పూరంబు తోరంబుగాన్

అని రామరాజ భూషణుడు ఏడవడం ఎంత బాగుందని గాని, చూడడం తక్కువఅయింది. బాగుంటే ఆనందిస్తాం; బాగు లేకపోతే ఆగ్రహిస్తాం. అది వేరేసంగతి. అలా చూడలేదు.





ఒక స్త్రీని ఒక సమయంలో వర్ణించినప్పుడు ఆ వర్ణన ఆ సమయానికి అనుగుణంగా ఉందా, లేదా అని అడగడం లేదు. స్త్రీని వర్ణిస్తున్నాం, వాడిని మించిపోయిన వర్ణన వ్రాయాలి, కొత్తకల్పన పెట్టాలి అన్నదృష్టే చాలమంది కవులకి. ఇలాగ ఏమయిందంటే: నియమాలు కవులని కట్టివేస్తే, ఆచారం చదివేవాళ్ళని అణిచివేసింది. పాత పాఠాలే పాడేవారు పండితులంతాను. అంచేత ఎక్కడా లోపం ఉన్నట్టే కనబడ లేదు. బాగుకావడానికి దారి బంద అయిపోయింది. లోపం తెలుస్తేకదా దానిని నివారించడానికి ప్రయత్నం? సవ్యంగా ఉంది అంటే సర్దుకోవడానికి సాధారణంగా చూడ కదా! అలా లోపం కనబడలేదు. సూత్రాలకి ఎలాగో సరిపోయాయి. ప్రమాణాలకి కష్టంలేదు. పండితులు కాదనలేదు. చదివే వాళ్ళు సర్దాపడ్డారు. మరి మార్పు ఎందుకు? అంతా ఒక్క బడి చదువే అయింది. సూత్రాలవల్ల కవి, కవివల్ల పండితుడు, పండితుడివల్ల చదివేవాడు, చదివేవాడివల్ల మళ్ళా కవి అంతా ఆ పద్ధతులలోనే నడిచారు. అలా ప్రబంధ ఫక్కీ పెరిగెట్టింది కొన్నాళ్ళు. అంటే అర్థంఏమిటి? ఆ సంస్కృత సంసారం చదివేవాళ్ళనికూడా పాడుచేసిందన్న మాట.

పాఠకులు ఎంతముఖ్యం?

కవులు పాడయారంటే ఎంత ఉపద్రవం వస్తుందో, పాఠకులు పాడయారంటే అంత ఉపద్రవమూ వస్తుంది. కావ్యానికి పాఠకుడు, నాటకానికి ప్రేక్షకుడు చాలా ముఖ్యమైన అంగాలు.



ఈ సంగతి మనవాళ్ళలో చాలామంది మరచిపోతారు. శ్రీ హర్షుడు:

పరిషద ప్యేషా గుణగ్రాహిణీ

అని తన నాటకాంగాలలో ప్రేక్షకులనుగూడా చేర్చాడు. "ఒప్పుతప్పరయు రసజ్ఞు"లని చదివేవాళ్ళని కొంచెం దూరంగా చూపించాడు కని పెద్దన్న.

అల్లసానివాడి పాఠకులు

ఒప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ శైలి
యుంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినఁగాక యూరక కృ
తుల్ రచియింపుమటన్న శక్యమే?

అని వ్రాసినప్పుడు "ఆ పాఠకోత్తముల్" అంటే చదువుకునేవాళ్ళని కాదు అతని అభిప్రాయం. ఆ పాఠకులు పద్యాలని చక్కగా రాగవరసగా, వినడానికి ఇంపుగా చదవ గలిగే వాళ్ళన్న మాట. చదువుకునేవాళ్ళనీ, వినేవాళ్ళనీ, విమర్శకులనీ రసజ్ఞులలో ఇరికించాడు. కవికి ఉన్న ఊహని గ్రహించుకోగలిగిన వ్రాతగాడిని, పాటగాడిని ఒక కట్టగా కట్టాడు. అల్లసానివాడి పాఠకులు మనం ఈ ఘట్టంలో అను కుంటూఉన్న పాఠకులు కారు. మన పాఠకులు చదువుకొనే మహాజనులు. విద్యార్థులూ, విమర్శకులూ అందరూ అందులో ఇముడుతారు. వీళ్ళుగూడా సాహిత్యానికి గొప్ప సేవచేసే వాళ్ళే. వీళ్ళు గట్టిగా పట్టుబడితే ఏ సాహిత్యాన్నయినా

వాళ్ళు ఇష్టంవచ్చినట్టు మార్చగలరు. వాళ్ళకి రుచించే పుస్తకాలని పుట్టించగలరు. కవులకి మార్గాలు చూపగలరు. ఈ చదివేవాళ్ళకి శక్తి ఉండాలిగాని, సాహిత్యాన్ని ఒక మైనపు ముద్దలాగ, ఏ ఆకారాన్ని పడితే ఆ ఆకారానికి, తీసుకొని రాగలరు. వాళ్ళకున్న శక్తిని చక్కగా వీళ్లు ఉపయోగపరుచుకుంటే ఈ పాఠకులు కవులకి చేదోడువాదోడుగా ఉండగలరు. కవులలోని లోపాలను కంటికి చూపించి బాగు చేయడానికి మార్గం చూపించగలరు. కావ్యం వ్రాసేవాడికి, ప్రచురణ చేసేవాడికి ఈ పాఠకులు చాలా ఉపయోగిస్తారు. పాఠకులచేత కవీ, కవిచేత పాఠకుడూ, వీళ్ళిద్దరిచేత సాహిత్యమూ, దేశమూ అభివృద్ధి పొందుతాయి. అంత ముఖ్యం కాబట్టి చదివేవాడుగూడా సాహిత్య వికాసానికి ఒక ముఖ్య సాధనం అన్నాను.

కాని తెలుగువాళ్ళ దురదృష్టంకొద్దీ ఈ సాధనంగూడా ఆ కావ్యనియమాల దెబ్బకి తాళుకోలేకపోయింది. చదివేవాళ్లు గట్టివాళ్లైతే సారస్వతం చక్కగా ఉంటుంది. వాళ్ళే కొంచెం కళ్లువిప్పి జాగ్రత్తగా చూచారంటే సాహిత్యం బాగుపడుతుంది. అంచేత చదివేవాడు చెడ్డాడు అంటే సాహిత్యం చెడుతుంది అని ఒప్పుకోవలసివస్తుంది. కవి చదివేవాడి రుచిని అనుసరించి వ్రాస్తూ ఉంటాడు. ఎవ్వడో ముందు దృష్టితో

కాలోహ్యాయం నిరవధిః
విపులాచ పృథ్వీ



అని అనుకొనే మహాకవుల సంగతి వేరు. వాళ్ళని ఇలా కట్టివేయలేము. కాని, సాధారణంగా కవి చదివేవాడి రుచిని అనుసరిస్తాడు. వాడి సాయంకాల వర్ణనా, వీడి సాయంకాల వర్ణనా, తక్కెడలో తూచి అల్లసాని వాడిదే అగ్రస్థానం అన్న చదువు గాళ్లుంటే కవిమాత్రం ఏమి చేయగలడు? కానీ అని సాగదీసి కలాన్ని పరిగెట్టిస్తాడు.

రవిబింబపతన దీర్ణపయోధిగర్భ ని
ర్గత శేషఫణిఫణారత్న రుచియొ
దివసావసాన సందీప్తాస్తగిరి శిఖా
జ్యోతిర్లతావితానా తపంబొ

అంటాడు. అలా వర్ణనలనే చూస్తాడు గాని వావీ, వరసా మరి చూడడు. స్త్రీ వర్ణనల త్రాసు పట్టుకుంటూరు చదివేవాళ్ళంటే ఏ అంగానికా అంగం పట్టుకొని పద్యాలు వ్రాస్తారు. ప్రత్యేకంగా "రిజర్వు" చేసినట్టు అంగానికొక పద్యం, తరవాత రెండేసి, మూడేసి అంగాలని కలిపి "బాక్సు సీట్లు"లాగ ఒక్కొక్క పద్యం. అలా వ్రాసి చిందులు తొక్కుతారు. వాళ్ళకి భయంలేదు. ఎందుకుంటుంది? చదివేవాడి త్రాసు వాళ్ళకీ తెలుసును: వర్ణన అంటే వర్ణనే అని. ఈ వర్ణన పుస్తకంలో ఉన్న సందర్భానికి తగినట్టు ఉందా, లేదా అని చదివేవాళ్ళు చూడరు. అది కవికి తెలుసును. వర్ణిస్తూ ఉన్న పాత్రయేది? ఆ పాత్రను అలా అంగవర్ణన చేయడం న్యాయమా అని పాఠకులు అడగరు. అది కవికి తెలుసును. తల్లి రంకు అయినాసరే కూతురుముందు చెప్పవలసిందే. చెల్లెలి

కుచాలు అయినాసరే పెళ్ళికొడుకుముందు వర్ణించవలసిందే. ఆ కూతుకు మన సంతసొచ్చుకుంటుందో అని కవీ చూడడు, చదివేవాడూ అనుకోడు. ఈ సంగతులన్నీ వీడి కెలా తెలిశా యని పెళ్ళికొడుకు అనుమానిస్తాడన్న చింత కవికీలేదు; చదివే వాడికీలేదు. భార్య అవయవాల పటుత్వాదులయినాసరే, శోభనంనాటి రాత్రి ముచ్చట్లయినాసరే అలా ప్రపంచం అంతా వినేటట్టు చెప్పవలసిందే.

ఎందుచేత ? కావలసింది అంతా వర్ణన. అది ఉంటే చాలు. పాత్రకి పద్యం, పద్యానికి సందర్భం అతుకుతుందా అనే విచారనేలేదు. వర్ణనలకి వర్ణనలు బలిసిపోయాయి. సందర్భాలు బలిఅయిపోయాయి. "ఎవరికివారే" అన్నట్టు ఏ పద్యానికా పద్యమే అయింది. పై పద్యానికీ, క్రింద పద్యా నికీ సంబంధంలేదు .ఎక్కడ ? వట్టి వర్ణనలుచేసే చోటనేకాదు. కార్యగమనం చెప్పేటప్పుడూ, మానసప్రవృత్తి చెప్పే టప్పుడూ గూడా. పద్యాల అందమే చూచారుగాని ఔచితి అందం చూచేవాళ్ళు తక్కువ అయారు.

## జాగ్రత్తగా వ్రాసేవాళ్ల లేకపోలేదు

కొంతమంది మహానుభావులు ఎంతో ఆలోచనతో, ఎంతో జాగ్రత్తగా, ఎంతో శ్రమపడి వ్రాసేవాళ్ళు లేకపోలేదు. అక్కడక్కడ ఉన్నారు. అమృతంలాంటి సంగతులని వ్రాశారు. ఆనందాన్ని పైకపెట్టడానికి బీజాలు ఉంచారు కొన్నిచోట్ల. "ఆహా, ఈ సందర్భంలో ఇంత చక్కగ వ్రాశాను గదా" అని ఆ కవులు వాళ్ళలోవాళ్ళు మహానందాన్ని పొందిఉంటారు.

 

నిజంగాగూడా అది అలాంటిదే అయిఉంటుంది. ఎవడయినా ఆనందించడానికి తగినట్టే ఉంటుంది ఆ ఘట్టం. కాని, ఏమి లాభం? ఇంత ప్రయత్నమూ, ఇంత శ్రద్ధా, ఇంత గొప్ప తనమూ అంతా వృథాఅయిపోయింది. ఆ సంగతి గ్రహించిన వాళ్లు లేరు. గురువుగారు దానిమీదికి మనదృష్టి త్రిప్పరు. చదివేవాళ్లు అది ఉంది అని ఎరగనయినా ఎరగరు. రత్నంలాగ ఆ సంగతి అలా గ్రంథంలో ఉ టుంది. గుడ్డివాళ్లలాగ మనం ఒకటికి పదిసార్లు ఆ ప్రక్కనుంచి నడుస్తూనే ఉంటాము. దాన్ని శరీరంతో తాకుతూనేఉంటాము. దాన్ని త్రొక్కుకుంటూనే పోతూ ఉంటాము. కాని దాన్ని గ్రహించలేము. నాలుగువందల సంవత్స రాలు కానీయండి, వెయ్యిసంవత్సరాలు కానీయండి, అది అలా పడి ఉండవలసిందే. మనం ఇలా నడుస్తూ ఉండవలసిందే. పండితులు వ్యాఖ్యానాలు కూలంకషంగా వ్రాయవచ్చు, గురువులు పరీక్షాగ్రంథంగా నేర్పవచ్చు, విద్యార్థి అభిమాన గ్రంథంగా చదవవచ్చు, కవులు గౌరవంతో అనుకరించవచ్చు. అదిమాత్రం మనకు దొరకదు. మనకి ఆ దృష్టిని ఇవ్వలేదు మన చదువు పంథా.

దమయంతి సంభాషణ, ఎత్తుగడ

చూడండి మహాకవి శ్రీనాథుడు. హర్షుడి నైషధాన్ని "దోషంబుపరిహరించి," "గుణంబు పోషించి" వ్రాశాడు. రాచ బిడ్డ దమయంతి శుద్ధాంతఃపురములో చెలికత్తెలతో స్వేచ్ఛగా విహరిస్తూ ఎవరైనా చూస్తారేమో అన్నభయం లేకుండా

ఉంటుంది. అంతవరకు కనబడకుండాఉండే నలుడు తటాలున కనబడుతాడు. ఎలాగుంటుందో ఆలోచించండి !

ఉన్నది శుద్ధాంతం, అందులో స్వేచ్ఛావిహారం. పో పొమ్మనుటా, కంచుకిని పిలిచి దారిచూపించి పంపుటా, శిక్షకు పాలుసేయుటా ?

వచ్చినవాడు స్ఫురద్రూపి. అసాధారణమైన తేజస్సు గలవాడు. ఆకృతినిబట్టి గుణంఉంటుందంటారు. చూస్తూ చూస్తూ కొందరితో కటువుగా మాటాడలేము ఎంతకారణ మున్నప్పటికీ. పొమ్మనడం ఎలాగ ?

ఏ ఉద్దేశంతో వచ్చాడో ఇతను ? మంచిదో, చెడ్డదో! మంచిఉద్దేశమే అయితే అవమానించడం తప్పు. చెడ్డదేఅయితే సన్మానించడం దోషం. ఒకప్రక్క ఆతని చొరవకు కోపం, ఒకప్రక్క సుందరాకారుని ఎదట లజ్జ. ఏమిశుభమోఅన్న ఆశ ఒకప్రక్క, ఎలా వచ్చాడో అన్న ఆశ్చర్యం ఒకప్రక్క, ఉద్దేశమేమిటో అన్న భయం ఒకప్రక్క. ఇలా ఉంటుంది దమ యంతి మనసు ఆ సమయంలో. ఇన్ని సంగతులు చూపించాలి ఆచోట. నాటకం ఆడినప్పుడు దమయంతి పాత్రకి ఇదొక కష్టమైనజాగా. వ్రాసేటప్పుడు కవికీ ఇది అలాంటిదే. ఈస్థలంలో దమయంతి అంటుంది–

"అనఘ, యిదె హేమరత్న సింహాసనంబు
ఇచ్చగలదేనిఁగూర్చుండు మిందువచ్చి..."

ఇది మర్యాదచేసినట్టా ? అమర్యాద చూపినట్టా ? ఇలా సంధిగ్ధంగా ఉండడానికి కారణం ఏమిటి ? అని ఒక గుసువుగా



రయినా ఆలోచించారా? ఒక్క వ్యాఖ్యానమైన తెలియ జేసిందా? కవి పడ్డ శ్రమ అంతా ఏమయినట్టు?

ఇకను, ఆసంబోధన చూడండి. అనఘా అని ఎత్తు కొన్నది దమయంతి. శ్రీనాథుడు మహాకవి కాబట్టే అలా ఆ ఒక్కముక్కలో తన నేర్పంతా కనబరిచాడు. అమృతం కురి పించాడు. పద్యం అంతా అమృతమే. అంతా నేర్పే. మహా నేర్పు! అగ్నిపరీక్షకి ఆగాడు శ్రీనాథుడు అనిపిస్తుంది కదా శ్రద్ధగా చదివినవాళ్లకి! అలాటి ఈ పద్యానికి వ్యాఖ్యాతలు ఏమిటిచెప్పారో చూడండి. అర్థాలుచెప్పారు, వ్యుత్పత్తులు చెప్పారు, సమాసాలు చెప్పారు. అది చెప్పారు, ఇది చెప్పారు. కాని అసలు జీవం చెప్పలేదు. సన్నివేశంలోని కష్టం చెప్ప లేదు. పిలుపులోఉన్న భావం చెప్పలేదు. కవిలోఉన్న గొప్ప తనం చెప్పలేదు.

ఎంచుండి యెందుబోవుచు
నించులకే తెంచి నార లీరలు విద్య (త)

అన్న పద్యానికి ఎలా చెప్పారో అలాగే చెప్పారు దీనికిగూడా.

అంతేగాని మరి దృష్టి పైకిపోలేదు. సందర్భం గ్రహించు కోలేదు. పద్యం ఇమడడం తెలుసుకోలేదు. సన్నివేశానికీ, పాత్రకీ, భావాలకీ ఇక్కడ శ్రీనాథుడు అద్దం పట్టాడని అనుకోలేదు.

పెద్దన్నని చూడండి

• ఒక్కసంగతి చూడండి. ఊరకే సందర్భం వచ్చిందని చెప్పుతున్నాను. అంతేకాని చిన్నా, పెద్దా అని నిర్ధారణ చెయ్యడానికి కాదు. ఏమిచేసినా పెద్దన్న చిన్న ఎలాగవుతాడు? మనుచరిత్రలో ప్రవరాఖ్యుడు వరూథినిని చూచిన అవస్థలో – దారితప్పి తల్లడిస్తూఉంటాడు, పరస్త్రీ అభిలాష లేనివాడు, మహా ఆచారవంతుడు, గొప్ప పండితుడు – భీత హరిణేక్షణ అని సంబోధిస్తాడు. తరవాత తరవాత పెట్టిన ముద్దుపేర్లు వదలివేదాం. ఈ పిలుపులోని సొగసేమిటో ఆలోచించండి. పాత్రకి ఉచితంగా ఉందా, సందర్భానికి ఉచితమా? సౌందర్యదృష్టి అంటారా?

...విలోకనప్రభా
వీచికలన్ తదీయపద
వీ కలశాంబుధి వెల్లిగొల్పుచున్

అన్న పద్యం చూపిస్తారా?

...కనీనికల్ వికసి
తోత్పల పంక్తుల గ్రుమ్మరింపఁగాన్

అని అంటారా? ఆగండి.

ఇక్కడ చూడండి. నలుడు మహాస్ఫురద్రూపం కలవాడు. దమయంతి వివాహానికి సిద్ధంగాఉన్న రాచబిడ్డ. సౌందర్యాభిలాషగల చిన్నది. నిష్కల్మషమయిన తన హృదయాన్ని ఈ నలుడికే అర్పించి ఉన్నది. మరి ఈ దమయంతికి



సౌందర్యదృష్టి లేదంటారా? "మోహనకారా" అని ఆరంభించలేదేమి? "అనఘా" అని మాత్రమే అన్నది. ఎంచేత? కవి కడునేర్పుకలవాడు కాబట్టి. అలాంటి ఈ పద్యానికి మన పండితులేమి వ్రాశారు? అందులో ఉన్న మహాగుణాలు ఏమి చూచారు? చదివేవాళ్ళు ఏమి తలలూపారు? అలాంటి అనాదరణచూచిన తరవాత మళ్ళా ఎవడు అంతశ్రద్ధ తీసుకోవాలని చూస్తాడు? ఎందుకు తీసుకోవాలి? చేమకూరవాడు-

వెడవిలుకానికిన్ చెఱకు
విల్లును గల్వలకోరి కోరికల్

అని వ్రాసినప్పుడు ఆ వెడవిలుకానికి అన్నిటికీ చెప్పినట్లు మన్మథునికి అని అర్థం చెప్పేస్తే ఇంకేమి టుంటుంది? అలాగ వ్యాఖ్యానాలు వ్రాసేస్తూఉంటే పాపం, ఆ కవీశ్వరులంతా అలా ఖూనీ అయిపోతూనే ఉంటారుకదా! శ్రమఅంతా వ్యర్థం అయిపోయిందే అని అలా ఆ లోకంలో నిట్టూర్పులు విడుస్తూనే ఉంటారు కదా! చదివేవాళ్లే కొంచెం దృష్టివిప్పి చదివిఉంటే దానిని ఆమోదించిఉంటే తక్కినవాళ్ళుగూడా అలాగే సందర్భశుద్ధితో, అభిప్రాయంతో వ్రాసి ఉందురు. ఆ అదృష్టం మనకిలేదు.

## పువ్వులు ఏర్చే నేర్పేకాని దండలు గుచ్చే నేర్పులేదు

పాపం! కవులు వ్రాయకపోలేదు. అక్కడక్కడ మహానుభావులు ఉన్నారు. ఏపద్యాని కాపద్యమేకాదు. పద్యానికీ, పద్యానికీ అతకాలి అన్నవాళ్లు ఉన్నారు కొందరయినా. చదివే వాళ్లు ఆసంగతిని గుర్తించిఉంటే పద్యాలు పువ్వులులాగ ఉండ

డనే కాకుండా, ఘట్టాలన్నీ మంచినేర్పుతో గుచ్చిన పూల హారాలుగా కనబడిఉండేవి. కావ్యంఅంతా పువ్వులతొడుగుల సరస్వతీదేవిలాగ కనబడి ఉండేది. కాని ఆదృష్టి మనం ఉపయోగించలేదు. అలాంటి దండలు చాలా సుందరంగా, ఎక్కువ కళాదృష్టితో కూర్చినా, మనం మాత్రం ఈపువ్వూ, ఆపువ్వూ మాత్రమే చూచామగాని, దండలోని నేర్పు చూడలేదు. మన గురువులు అలా చెప్పలేదు. మనవ్యాఖ్యాతలకి అది ఉన్నదన్న సంగతయినా తెలుసునో, తెలియదో అనిపిస్తుంది. అందరికీ తెలిసే సందర్భాలేమయినా ఉంటే సాగదీసి వ్రాస్తారు. కొంచెం కనుమరిగి ఉన్న సంగతయితే చల్లగా ఊరుకుంటారు—తెలిసే అనండి, తెలియకే అనండి.

## కొన్ని చక్కని దండలు

పోతన్న గజేంద్రమోక్షంలో ఏనుగుని మొసలి పట్టుకున్నది మొదలు విష్ణుమూర్తి వచ్చినదాకా ఏన్నో పద్యాలున్నాయి, అన్నీ భక్తిరసం పద్యాలే. మొన్న మొన్నటిదాకా చాలామందికి కంఠగతంగా ఉన్న పద్యాలే. వ్యాఖ్యాతలు అర్థాలు వ్రాసినపద్యాలే. బడులలో గురువులునేర్పిన పద్యాలే. కాని ఒక్కసంగతి చూడండి. ఆ పద్యాలని ఒకడు వరసమార్చి అచ్చు వేశాడనుకోండి. మనలో ఎవరికయినా ఏమయినా లోపం కనిపిస్తుందా ? ఏముంది! ఈ వరసనే అర్థం చెప్పుకుంటాం. భక్తి పద్యాలలో వరసమారితే మాత్రం ఏమి ? "మాణిక్యవీణా" శ్లోకం చదివిన తరువాత "మాతా మరకత



శ్యామా” శ్లోకం చదువుతే ఏమి ప్రమాదమౌతుంది కావ్య దృష్టిని ?

కాని, పాపం పోతన్న వట్టి పువ్వులనిమాత్రం పెట్టలేదు. మహానేప్పథ్యంలో ఒక దండగూర్చాడు. పువ్వులు మార్చడానికి వీలులేదు. ఆ పద్యాల వరసతప్పించడానికి వీలులేదు. “అల వైకుంఠపురంబులో” అన్న పద్యం మరి రెండు పద్యాలమీదికి నెట్టడానికి వీలులేదు. పోతన్న మహాశిల్పం ధ్వంసం అయిపోతుంది. ఈ దృష్టిని మనవాళ్లు చదవలేదంటే సాహసంకాదు.



# 12

## కవుల కళాసృష్టి

చదివేవాళ్లు గ్రహించకపోవడంచేత చక్కని కవిత్వం చావవలసి వచ్చింది. ఆ మాట నిజమే సుమండీ అని నేను అనడమేకాదు. అనేకమంది కవీశ్వరులు ఆలోకంలోనుంచి అంటున్నారు. పోతన్నలాంటి వాళ్ళు, వైరాగ్యంచేత, పోనీ అని ఊరుకున్నా, ముక్కు తిమ్మన్నలాంటి వాళ్ళు మొర్రో అనకమానరు. అంత శ్రమా అడవిగాసిన వెన్నెల అయింది కదా అని ఆక్రోశించకమానరు. ఎందుకంటే, వాళ్లు కావ్యాలు వ్రాసినప్పుడు కడుపునిండా ఉద్దేశాలు పెట్టుకొని గంటాలు నడిపారు. సందర్భాలూ, సన్నివేశాలూ చక్కని పుష్పహారాల లాగ సమకూర్చి వ్రాశారు. వర్ణనకి వర్ణనా, పద్యానికి పద్యమూ అమిరేటట్టు చాలా జాగ్రత్తగా వ్రాశారు. ఇంత ఆలోచనతో వాళ్లు వ్రాసినా, మన చదువుగాడు ఏమన్నాడు.

"ముక్కుతిమ్మనార్యు ముద్దుపలుకు పాండురంగ విభుని పదగుంఫనంబును" అనేకదా! అంటే ఏమిటి? వట్టిమాటల పోకడ తెలిసినవాళ్ళు మాత్రమే అనికదా వాళ్ళ ఉద్దేశం. తిమ్మన్న ముద్దుగా ఉండే మాటలు వ్రాస్తాడు. రామలింగన్న



మాటకిమాట బాగా కూర్చున్నాడు. ఇది మనవాళ్లు వాళ్ళ కిచ్చిన గౌరవం. పాపం, వాళ్ళుపడ్డ శ్రమఅంతా వ్యర్థం అన్న మాటేకదా !

పారిజాతం మహిమ

పారిజాతపువ్వు రుక్మిణి కిచ్చిన తరవాత ఆయమ్మ ఆ పువ్వును తలలో పెట్టుకుంటుంది. అక్కడ తిమ్మన్న ఒక పద్యం వ్రాశాడు. ఎంత చక్కనిది ! ఎంత ఊహతో వ్రాశాడు ! అసలే అందంగా ఉంటుంది రుక్మిణి. ఈ పువ్వువల్ల ఆ అందం మరింత వికాసాన్ని పొందుతుంది. ప్రతి అవయవము లోనూ ఒక కొత్తకాంతి కనబడుతుంది. అదీ ముఖ్యమైన అభిప్రాయం. వ్రాసింది ఒక్క సీసపద్యం. ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క అవయవం చెప్పాడు. ఏ వరసని చెప్పితే ఏమినష్టం? మొదట కాళ్లో చేతులోచెప్పి, తరవాత కళ్లుచెప్పి, తరవాత ముఖం, ఆ పైని కొప్పూ చెప్పకూడదా? వర్ణన సారం అంతా పస్తుందికదా ? ముక్కువాడు అలా చేయలేదు.

మంచి కళాదృష్టిని సాగించాడు వర్ణన. పువ్వుపెట్టగానే ఎక్కువ అందాన్ని పొందినది కొప్పు. ఆ కొప్పువల్ల ఎక్కువ సొగసుగా కనబడేది ముఖం. ఇలా సక్రమంగా వర్ణన సాగించాడు. ఒక చిత్రకారుడు చేయవలసిన పనిఅంతా చేశాడు. చేస్తూఉన్న వర్ణనతో తానూ సాగాడు. ఎట్టయెదట ఆపువ్వు మహాత్మ్యం అలా సినిమా తెరమీద చూస్తూఉన్నట్టు చూచాడు. మహా ఆనందంతో వ్రాశాడు. ఎంతమంచి చదువు

గాళ్లు దాన్ని పోల్చుకున్నారు? ఎంతమంది వ్యాఖ్యాతలు ఆ సంగతి గుర్తించారు?

ఉత్తర పరుగు

బృహన్నలని పిలవడానికి ఉత్తర వెళ్ళడం చూడండి తిక్కన వ్రాసింది. ఉత్తర వడివడిగా పోతూఉంటే పాదాల కాంతివల్ల అడుగుపెట్టినచోట అంతా

...పద్మరా
గంబుల నెలకట్టు కరణినొప్ప,

కెంపుల చంద్రరేఖలు కనిపిస్తూ ఉండేవట. పాలిండ్ల తనుపు వల్ల

అసదుకొదీగ యల్లాడుచుండ,
తరివేచి వెనువెంటదగులు
కమాంధకా
రములీల క్రొవ్వెద కొమరు మిగుల

......మెరుగు మొయిలుచొచ్చు తెరగున ఉత్తర నర్తనశాల కరిగింది. ఇక్కడ చూచారా! కవిదృష్టి ఎలా ప్రసరించిందో. మొదట పాదాలమీద, తరవాత స్తనాలమీది కందామా, నడుముమీది కందామా! ఆ తరవాత తలవెండ్రు కలుమీదికి వెళ్లింది. కవి ఎక్కడున్నాడో కాంత ఎటుపరు గెడుతూ ఉందో మనకంటికి కనబడదు, సినీమా తెరమీద బొమ్మరాదు. ఏదో పసుగులో కనబడవలసినవన్నీ ఇరికించాడు.



## పెద్దన్న పరుగు

పెద్దన్నగూడా చిన్న పరుగు పరిగెత్తాడు కొంచెం జోరుగానూ, ప్రాణాపాయంలోనూ.

మట్టెల్ మ్రోయఁగ, గబ్బిచన్నుగవ కం
పంబ ద, వేణీభరం
బట్టిట్టై కటి చిమ్మచీఁకటులుగా
నశ్రువ్రజం బోడికల్
గట్టన్...............

కవి దృష్టి ఎంత క్రమంగా వెళ్ళిందో చూడండి. మట్టెల చప్పుడు మీదనుంచి గబ్బిచనుల మీదకే, అక్కడ నుంచి వెనుకనున్న జుట్టుమీదికి, తరవాత మొఖం త్రిప్పి కంటినుంచి కారుతూ ఉన్న కన్నీళ్ళమీదకీ అలా నృత్యం చేసింది. పద్యం చదువుతూ ఉంటే పాపమా మనోరమ పరిగెడుతూ వస్తూన్నట్టు కనబడదే. సినీమా చూచినట్టుండదే. ఏమి? కళాదృష్టి తక్కువ. శిల్పబుద్ధి లోపం.

## ప్రత్యక్షంలో వరస

క్రమంతో వర్ణించవలసిన వర్ణన అయితే అందరూ క్రమంగానే వర్ణిస్తారు. అందులో వరసతప్పితే కథే పాడవుతుంది. కవి ఎదటా, చదివేవాడి ఎదటా, పాత్ర ఎదటా, వరస ప్రధానంగా ఉంటుంది. ఒక సిద్ధుడు వచ్చాడు అంటే ఎదురుగా వెళ్ళడం, తీసుకరావడం, ఆతిథ్యం ఇవ్వడం వగైరా పనులలో వరస ఎప్పుడూ పోదు. ఎవ్వడూ, ఎంత చేతగాని

కవి అయినా ఆ వరస తప్పడు. అక్కడ వరస స్థూలంగా కంటికి కనబడుతూనే ఉంటుంది. అక్కడ వరసనీ, క్రమాన్నీ పాటించడం గొప్ప సంగతికాదు. అలాంటి స్థలాల్లో అది లేకపోతే తప్పు, లోపం అంటాము.

## పరోక్షంలో వరస

కాని, వరస పరోక్షంలో ఉంటే, కవిముందూ పాఠకుడి ముందూ స్థూలంగా లేనప్పుడు అలాకాదు. కళాదృష్టిలేని కవి అయితే పప్పులో కాలువేస్తాడు. ఈ వరస చాల సున్నితంగా ఉంటుంది. అందరు కవులూ పాటించలేరు ఆ వరసని. కళాదృష్టి ఉంటేనే గాని, కవి అయినా, పాఠకుడయినా దాన్ని గుర్తించలేడు. బొమ్మ పాఠకుల కంటికి కనబడదు. అలాంటి చోట్లే కవులకి పరీక్ష జాగాలు. అలాంటి దగ్గరే కవుల రంగు బయట పడుతుంది. మాణిక్యమేదో, మాయపూస ఏదో తేలిపోతుంది. అలాంటి స్థలాలలో గట్టిగానిలుస్తాడు తిమ్మన్న. అందుచేతనే అతనికి కళాదృష్టి బాగా ఉందన్నాం. ముద్దు పలుకులోనే మురిసిపోవడం మంచిదికాదన్నాం. అంత మాత్రంతో ఊరుకుంటే అసలు కవిగుణాన్ని చూడలేదన్న మాట అంటాము. అలాచేస్తే కవికి అగౌరవం, మనకి అపకీర్తి గూడాను.

## సత్య కోపం

చిన్న చిన్న వాటిలోనే అంతజాగ్రత్తగా వర్ణించేవాడు తిమ్మన్న. ఇక కతకంతటికీ ముఖ్యం సత్యకోపమూ, దాని ఉపశమనమూకదా! అందులో ఎంతజాగ్రత్త చూపుతాడో



అని అయినా ఆలోచించినామా? ఈ ఘట్టాలలో మరేమయినా కళాదృష్టి చూపించాడా అని చూచామా ? పద్యాలసొగసేనా పొందికసొగసు ఏమయినా ఉందా అని విమర్శించామా ? లేదు. పండితులే కానీయండి, పనికిమాలినవాళ్లే కానీయండి. అంతా ఒక్కలాగే చూచారు. చంద్రోపాలంభన, మన్మధ దూషణం, మలయమారుతనింద అనుకొంటూ శీర్షికలుపెట్టి, పేరులుపెట్టి చదివాము. అమరం పదిసార్లు ప్రమాణాలు చూపుకున్నాము. అలంకార సూత్రాలు చెప్పుకుంటూ, సామాన్యాలంకారమా మీలనాలంకారమా అని వాదించుకున్నాము. ఉత్ప్రేక్షలుచూచి ఉబ్బిపోయాము. మూడో తరగతి కవి వ్రాసిన పుస్తకం చూచినట్టే ముక్కుతిమ్మన్న పుస్తకంగూడా చూచాము. కష్టమూ, కళాదృష్టీ రెండూ గాలికి విడిచిపెట్టాము. ప్రధానమైన ఘట్టంలోగూడా కవి రహస్యాన్ని పట్టుకోలేకపోయాము.

## పూసలలోని దారం

పద్యానికిపద్యం చదివాం. మణిపూసలురా అన్నాం. అంతేగాని ఆ పూసలలోనుంచి పోతూ, వాటినన్నిటినీ ఒక హారంగా చేస్తూఉన్న దారాన్ని గుర్తించాముకాము. ఈమాట అనుకున్నప్పుడంతా హృదయం మహా ఆవేదనని పొందుతుంది. సాహిత్యంమీద, చదువుమీద ఒక్కలాగ విసుగుపుడుతుంది. అందుకే అన్నాను ముక్కుతిమ్మన్న మొర పెడుతూ ఉన్నాడని.

ఎత్తుబడి - భయంకరం

పాపం చూడండి. సత్య కోపంవర్ణనలో -

అన విని ప్రేటువడ్డ యుర
గాంగనయుంబలె, నేయివోయ బ
గ్గున దరికొన్న భీషణ హు
తాశన కీలయనంగ.

అని సత్యని చూపాడు.

అసలు నాగుపాము. అందులో ఆడది. దాన్ని ఒక ప్రేటు కొట్టాడు. ఎంత భయంకరంగా ఉంటుందో చూడండి. అలాగే అసలు అగ్గిమంట. అందులో భీషణమూ. దాన్లో ఇంత నేయి పోసి భగ్గున మండించాడు. ఎంత ప్రచండంగా ఉంటుందో చూడండి. అలా చిత్రించి చూపించాడు సత్యని. భయం పుట్టించాడు సత్యమనసు చూపించి. కరిచి చంపడమో, కాల్చి చంపడమో ఏదో జరుగుతుం దనిపించాడు. ఇదీ ఆ ఘట్టంలో ఎత్తుబడి.

ముగింపు - జాలి

ఇంత ఎత్తున ఎత్తుకున్న సత్యభామని ఏమి చేశాడు ఆఖరికి ? పది పద్యాల వర్ణన అయ్యేసరికి

మదహస్తి హస్తగత
పద్మినియుం బలె

ఉందని చెప్పాడు సత్యని. మాంచి మదించిన ఏనుగు తొండానికి చిక్కిపోయిన తామర తీగలాగుంది అన్నాడు.



తానేమీ చెయ్యలేదు, తనకేమిచేసినా తప్పించుకోలేదు ఈ తామరతీగ. ఎటుత్రిప్పితే అటు తిరగవలసిందే. నలిపేస్తే నలిగిపోవలసిందే. అంత జాలిపుట్టిస్తుంది. అంత కనికరం వేస్తుంది.

ఏమయింది ?

అక్కడ చూపించిన అగ్నిజ్వాల ఏమయింది ? ఆ క్రేటు వద్ద ఉరగాంగన ఏమయింది ? ఆ భయంకరమైన స్థితి అంతా ఏమయింది ? వజ్రాయుధాన్ని ఎత్తి పట్టి మైనపుముద్దని పడ వేశాడు కవి. రాతిని పట్టి రసంకన్నా పల్చనగా చూపించాడు. అంత ఎత్తున ఎత్తుకొని ఇంతలోతున దిగవిడిచాడు. అద్భుతమైన మార్పు.

ఎలాగ చేశాడు ?

ఇంత మార్పు ఒక్కసారి అవుతుందా ? అయిందంటే నమ్మేవాళ్ళుంటారా ! నవ్వకుండాఊరుకుంటారా విమర్శకులు ? ఇదంతా క్రమంగా కదా మారాలి ! అలా ఒక్కొక్క మెట్టు దిగుతూ, దిగుతూ కదా రావాలి అఖరి ఆవస్థకు ? వజ్రాయుధం లాంటిది—

......లోహమై,
          గ్రావంబై, దృఢదారువై, తరుణ వృ
క్షంబై, ఫలప్రాయమై,
          పూవై, తన్మకరందమై...

రానురానుగదా మెత్తబడి ఆఖరికి నీళ్ళకున్ పల్చనై ఉండవలసి ఉంటుంది ! అలా ఉండేనే క్రమం, న్యాయం

అంటాం. అలా లేకపోతే ఛీ అంటాం. అనాలి. ఆ మాప్పలో ఇన్ని అంతస్థులున్నాయి. ఇన్ని అంతస్థులనీ తిమ్మన్న అంత చక్కగా వ్రాశాడు. ఆ మధ్యనున్న పదిపద్యాలలోనూ ఈ మాప్పని అంతశ్రద్ధతో నిరూపించాడు. ఆ పరిణామాన్ని దృష్టినుండి తప్పించలేదు. ఆ మాప్పలో వరసని వదలలేదు. ముద్దులొలుకుతూఉండే మాటలతో మోహింపచేస్తూ ఉన్నా, మూలసూత్రాన్ని మాత్రం మరిచిపోలేదు. మహానేర్పుతో ఆ ఘనకార్యాన్ని సాధించాడు. ఈ భాగంలో అతను చూపించిన ప్రపంచజ్ఞానమూ, అనుభవమూ చాలా గొప్పవి. అతని శిల్పచాతుర్యం అసాధారణం. సత్యభామ మానసిక అవస్థని ఒక మెట్టుమీదనుంచి ఒక మెట్టుమీదికి దించుకుంటూ వచ్చాడు. ఆ పద్యాలలో ఆఖరిపద్యాన్ని అంత శ్రద్ధతో సమర్థించాడు. ఎంతశ్రమపడ్డాడో ఆలోచించండి. ఇంత శ్రమా ఏమయింది?

## మనమెలాగ చదివాము?

మనం ఏ పద్యానికాపద్యనే చదివాం. లోపల పోతూ ఉన్న ఈ దారాన్ని చూడలేదు. దారం ఉన్నదన్న సంగతే మన పండితులకి తట్టలేదు. ఈ పద్యాలన్నీ నేలను పొర్లుతూనో గాలిలో ఎగురుతోనో ఉన్నట్టే చెప్పారు అర్థాలూ పర్దాలూ. ఆ అంతస్థులు చూడలేదు. ఆ మెట్లు గుర్తించలేదు. ఆ మహాకవి చూపిన కళాదృష్టి గ్రహించలేదు. ఆ శిల్పచాతుర్యం అనుభవించలేదు. లాకలూకాయి కవిత్వంలాగే అనుకున్నాం.



మరి ముక్కు-బిమ్మన్న మొర్రపెడుతూ ఉన్నాడంటే తప్పా? నన్నె మొత్తుకుంటున్నాడంటే నేరమా?

పండితుల చదువూ - పట్టాలమీదనే

ఎందుచేత? పండితుల చదువూ పట్టాలమీదనే నడిచింది. స్థూలదృష్టికి వరస కనబడినప్పుడు సూత్రాలు అల్లుకుంటూ కనిపెడతారు మన పండితులు. సూక్ష్మంగా ఉండే వరస అయితే చూడన్నైనా చూడలేక సోదెలు చెప్పుకుంటూ. శోభనంగదిలోని పెళ్ళికూతుకు మొదటి బిగువుమాని ముచ్చట గూర్చినదాకా వర్ణించే పద్యాలయితే! ఇంకేముంది.

ప్రాజ్ఞామేతి మనాగనాగత రసం
ప్రత్యస్త ధైర్యం పునః
.......................
నిశ్శంకాంగ విఘూర్ణ బాధిక సుఖం
రమ్యం కులస్త్రీ రతం

అన్న పద్యాలలాంటివయితే గురువుగారి పంథాని కూనరాగాలతో అర్థమూ వరసా అంతా చెప్తారు. అలా కాకుండా, వరసని కొంచెం కన్ను మరిగించాడంటే తెల్లబోతారు.

చేమకూరవాడి -

గుట్టపియాంప గబ్బచను
గుట్టలపై పులకాంకురావళుల్

అన్నలాంటి పద్యమయితే ఏమనడం? - రసాభాస చేసి అర్థం చెప్తారు. కన్నూ, ముక్కూ, కొప్పూ, గిప్పూ

కనబడేటట్లు వ్రాసి, రంగులు పులుముతే ముఖం అని పోల్చుకో గలరు. దాన్ని గురించి తెరదీసి చెప్పగలరు. కాని,

సిగసంపెగ పూలొసపరి
వగ, కస్తురి నామమొఱపు,
వలెవా టొరా!
సొగ సిటు లుండఁగవలె నని
సొగసె లతా తన్వి వాని సొగసు
నుతించెన్

అన్నలాగ, కలం పట్టుకొని అక్కడి దొక గీత, ఇక్కడి దొక రేఖ, వ్రాసి చిత్రంచూపే కవి అయితే కంగారుపడి పోతారు. ఆ గీతలలో ఉన్న అర్థం గ్రహించలేక, అర్థం చెప్తా తారు అధ్వాన్నంగా. ఇదేవూరి సొగసురా నాయనా అని పిస్తారు విన్నవాళ్ళకి.

దరహాసము మీసముదీర్ప

అని వ్రాయగలిగిన కవికి ఎంత కళాదృష్టి ఉన్నా, ఎంత శిల్పచాతురి ఉన్నా, ఈ చదువుగాళ్ళదగ్గర పనికిరాకుండా పోతాయి. వాటిని చూచేవాళ్ళే ఉండరు.

## చూచేవాడు లేకపోతే - వ్రాసేవాడూ ఉండడు

చూచేవాళ్ళూ, ఆనందిచేవాళ్ళూ లేనప్పుడు వ్రాసేవా డెవడుంటాడు? ఎవడత శ్రద్ధతీసు కుంటాడు? ఎవడో భవ భూతిలాంటివాడు ఉంటే ఉండవచ్చును. అలాంటివాళ్ళు ఎంత మంది ఉంటారు? ఎవడికయినా, బ్రతికున్నరోజులలోనే పొగడ్త పొందాలని ఉంటుంది. చచ్చిన తరవాత సామ్రాజ్యం ఏలుదా



మనే ఉద్దేశం ఉన్నవాళ్లు చాలామంది ఉండరు. వ్రాసినదాన్ని చూచి నలుగురు ముచ్చటపడాలి, దాన్నిచూచి తాను మురిసి పోవాలనే చూస్తారు సాధారణంగా. నలుగురూచూచే సంగతులతోనే వ్రాస్తారు అక్కడనుంచి. చూడనివాటిని మాను కుంటారు. అంచేతనే మనవాళ్లు ముక్కుతిమ్మన్నలాగ ముప్పులో పడలేదు. చేమకూరవాడిలాగ చిక్కులూ పడ లేదు. స్థూలవర్ణనలూ మాటలసాములూ, ఉత్ప్రేక్ష ఊపులూ వీటితో నింపారు గ్రంథాలు. సున్నితమైనవరసలూ, పూసల లోని దారాలూ విడిచిపెట్టుకున్నారు.

## సాహిత్యం ఎలాగ దిగింది ?

ఈ రూపంగా దిగింది సాహిత్యచరిత్ర అంతాను. చదివేవాళ్లలోని సారంబోధపడ్డాది. ఉపాలంభనలూ, ఉత్ప్రేక్షలూ ఉద్రేకించి పోయాయి. శృంగారవర్ణనలు చెలరేగి పోయాయి. కవిచేతిలో ఉన్నది కలం అయినాసరే, గంటం అయినాసరే, కవి మొగవాడయినాసరే, ఆడదయినా సరే పరుగు ఎంతసేపూ శృంగారచేష్టల మీదకే. శృంగారం అంటే ఒకటే ఉరుకు, ఒకటే ఉబలాట. మాటమెలుపులూ చాటు అర్థాలూ మరీ ఎక్కువ అయిపోయాయి. ముక్కుపట్లు మాటలు మామూలు అయిపోయాయి. శృంగార రసం శరీరానికి బాగా పట్టిపోయింది కవులకి. ఆడవాళ్ళని ఎంత అల్లర పెట్టడానికి వీలుంటుదో అంత అల్లరా పెట్టారు గ్రంథాలలో. కళాశాస్త్రం తళుకులన్నీ కలంతో నడిపించి చూపారు. రతి రహస్యాలన్నటినీ రచ్చకీడ్చారు.

కామసూత్రాల జ్ఞానం కవిత్వంలో కనబరిచారు. అంతటితో ఊరుకున్నా ధన్యులమయ్యే ఉండే వాళ్ళం. కాని అంతటితో ఊరుకోలేదు.

## కవిత్వానికే గర్భాదానం కల్పించారు

నాయికలని దింపినట్టే మనకవులు కవిత్వాన్ని కూడా శృంగారచేష్టలలోనికి దింపారు. కళాశాస్త్రంలో చూపినట్టే కవిత్వాన్ని కూడా బంధాలలోనికి దించారు. కళాశాస్త్రంలో చౌసీతి అయినట్టే, కవిత్వానికీ నాలుగు ఎచ్చుతగ్గుగా కల్పించారు. అందులోలాగే ఇందులోనూ కష్టపద్ధతులు కొన్ని, సుఖపద్ధతులు కొన్ని. సృష్టికి ప్రతిసృష్టిచేసి చూడండి మా మహిమ అన్నారు. ఇదంతా బంధకవిత్వం అన్నారు. ఆ బంధాలతో ఆనందించారు, చిత్ర విచిత్రంగా ప్రవర్తించారు. మంచీ, మర్యాదా చూడలేదు. విన్నవాళ్లూ, కన్నవాళ్లూ ఏమనుకుంటారో అన్న చింతలేకుండా చెలరేగారు.

## గర్భకవిత్వం:

అలా చెలరేగి చెలరేగి గర్భకవిత్వంలోకి దిగారు. న్యాయమేగదా! కవిత్వానికి కడుపు పండింది వీళ్ల పుణ్యాన్ని. పద్యాలకి కడుపునిండా బిడ్డలు కలకలలాడుతూ కనిపించాయి.

అది మత్తేభమయినా సరే, శార్దూలమయినా సరే, మొగదయినా సరే ఆడదయినా సరే, ఈ బంధకవిత్వంవల్ల పిల్లలని కనవలసిందే. ఈ మహాశక్తికి లొంగిరావలసిందే. ఒక మత్తేభం కడుపులో నాలుగు పిల్లలు పుడితే, మరొక శార్దూలం



కడుపులో ఆసుపిల్లలు. ఒక సీసపద్యంలో చంపకమాల, కందం, ఆటవెలది పుడతే, ఒక చంపకమాలలో మరొక పది పుడతాయి. అలాచేశారు కవిత్వాన్ని. చదివేవాళ్ల సత్తా గ్రహించారు. సంతోషం కలిగించే మార్గం సరిగ్గా పోల్చుకున్నారు. కానుకలు పుచ్చుకున్నారు. గండపెండారాలు వేసుకున్నారు. గణపవరపు వెంకటకవిలాంటి వాళ్లని గట్టివాళ్లన్నారు. ఆంధ్ర కవిత్వం అంటే అసహ్యం కలిగేటట్టు చేశారు.



# 13

# వెనకచూపేగాని ముందుచూపులేదు

అమృతం కురిపిస్తూఉండే ఆంధ్ర కవిత్వాన్ని ఇలా అధ్వానంగాచేసి అసహ్యం కలిగేటట్టు చేసింది ఏమిటి? అని ఆలోచిస్తే తెలివితేటలు లేకకాదు. స్వతంత్రబుద్ధి లేకకాదు. విమర్శనశక్తి లేకకాదు అని చక్కగా తెలుస్తుంది. మరేమి? ఒక్కటే సమాధానం — ఆ సంస్కృత నియమాలే. చస్తూ చస్తూఉన్న రోజులలోని సంస్కృత నియమాలు తెచ్చి' వాటిని ఇనపకొంకులలాగచేసి, వాటితో తెలుగు కవిత్వాన్ని బంధించడం అనేదే సమాధానం. ఆ సంకెళ్ళలో తెలుగు ప్రతిభ అంతా అలా తెల్లవారిపోయింది. నిర్జీవమయింది.

## వెనకచూపేగాని - ముందుచూపు లేదు

ఈ సంస్కృత సంపర్కం ఏలాంటిదో! సాధారణంగా అది వెనకచూపునేకలిగిస్తాదిగాని, ముందుచూపుని కలిగించదు. ఎంతసేపూ బుద్ధీ దృష్టీ అంతా వెనకకే పరిగెడుతుంది. ముందుకి సాగదు. దీనిలో సాధారణంగా అంటున్నాను. అక్కడక్కడ కొందరు ముందుచూపుకలవాళ్లు ఉండవచ్చు. వెనకచూపులేనివాళ్లు ఉండవచ్చు. కాని నూటికి తొంభై

 

తొమ్మిదిమంది వెనకచూపుగాళ్ళే అనడం తప్పుకాదు. అది ఆ సంస్కృతంలో ఉన్న మహిమ. అనుకరించడానికీ, అనుసరించడానికీ, అవలంబించడానికీ, అంతటికీ వెనకదృష్టే కలిగిస్తుంది.

ఏరోప్లేనులు అనండి, గబుక్కున దృష్టి పుష్పకం మీందికి పరిగెడుతుంది. ఫిరంగి అనండి, శతఘ్ని అన్నారుకదా అంటుంది. ఎలెక్ట్రిసిటీ అనండి, ఎక్కడో హస్తిమీద పడుతుంది బుద్ధి. వైర్‌లెస్ అనండి, దూరదృష్టి, దూరశ్రవణం అని ఉన్నాయి కావా అంటుంది. అంతేకాని ఆ చూపు ముందుకి మరలదు. దానిసంగతి తెలుసుకోనివ్వదు. పని చెయ్యడం అసలే లేదులెండి. ఇవన్నీ కొత్త సంగతులు, వీటిని కనిపెట్టారుగదా అని మెచ్చదు ఆ దృష్టి.

మాంచి గొప్ప కవీశ్వరుడు ఒకడు బయలుదేరాడు అంటే కవిత్వం అన్నదంతా పాతవాళ్ళతోనే పోయింది, ఇంకేముంటుంది అని విననైనా వినదు ఆ బుద్ధి. ఏదో ఒక మహా ఉత్తమమయిన భావం చూపిస్తే అది తలకెక్కనియ్యదు. ఆ బుద్ధి కొత్తపోకడకి వెళ్ళదు. ఒకరువెళ్తే చూచి ఊరుకోదు.

రోజులు మారుతూఉన్నా స్త్రీ బుద్ధిని గురించీ, పతిభక్తిని గురించి, విధవాముండనం గురించీ మాటలాడుకుంటూ మురిసిపోతుందిగాని, ఆ బుద్ధి ముందుకి వెళ్ళదు. అన్ని సంగతులనీ ఆకళించి ఆలింగనం చేసుకోదు. మారిన రోజులు గ్రహించి మహా ప్రవాహంలో దిగదు.





మతం పేరెత్తండి, ఈబుద్ధి మరీ అన్యాయంగా వెనక పరుగు పెడుతుంది. అంతా మన పూర్వులు ఏనాడో చెప్పేసిన సంగతులే అంటారు, వెనక్కి చూచుకుంటూ. దాన్ని గురించి వ్రాయడానికి ఇది స్థలంకాదు. కాని చాలా ఉంది. జన సామాన్యం సౌఖ్యం గురించి అనండి: సర్వేజనాః సుఖినోభవంతు అన్నారు కాదా అంటారు. ప్రపంచ శాంతి అనండి: అన్నారుకారూ మనవాళ్లు ఓం శాంతి శ్శాంతి శ్శాంతి అని మునుపు అంటారు.

ఇలా ఎక్కడికక్కడ ఈ వెనకచూపే కనబడుతూఉంది సంస్కృత సంపర్కంవల్ల. తక్కిన దేశాలలో ఎలాగున్నా మన తెలుగు దేశంలో ఈ సంపర్కం చాల అన్యాయం చేసింది. ఎవరికయినా తలకెక్కించవచ్చునుగాని, సంస్కృతం చదువుకున్న వాడికి తలకెక్కించలేము ఏ సంగతైనా.

## దేవభాషలోని రహస్యం

ఉన్న సంగతేమంటే - సంస్కృతం చదువుకోగానే దేవభాష చదువుకున్నాననుకుంటాడు. ఆ భాషలో లేనిది మరేదీ లేదనుకుంటాడు. ఆ సర్వమూ తనకు వచ్చేసిందనుకుంటాడు. ఇకను తాను నేర్చుకోవలసింది ఏదీ లేదనుకుంటాడు. కొత్తది అన్న సంగతి ఒకటి ఈ ప్రపంచంలో ఉండడానికి వీలులేదు అనుకుంటాడు. తనలో కొంత గొప్ప ఉందనుకుంటాడు. తక్కినవాళ్లలో ఏమీ లేదనుకుంటాడు. ఏమి చెప్పండి ఎంత చెప్పండి ఆ బుద్ధి మరి తిరగదు; అన్నిటికీ తల్లి సంస్కృతం అన్నమాట వదలడు. మయూరం అన్నమాట



సంస్కృతం కాదనండి; మంటలుపుడతాయి శరీరంలో. ఈ అక్షరాలు సంస్కృతంవాళ్లు ఎరువు తెచ్చుకున్నారనండి, పళ్లు పటపట కొరుకుతాడు.

అంతే మరి ముందుకుసాగదు. ఆగిపోతుంది. కదలేందిరా అంటే వెనకకి నడుస్తుంది. కొన్నాళ్ళ కిందట ఒక ఊరిలో ఒట్కాలు ఇలాగే నడిచేకోవలో ఆగిపోయేవి. అక్కడనుంచి కదలనే కదలవు. కదిలాయా, వెనక్కి వెనక్కి పోయేవి. పాపం ఇప్పుడెలాగున్నాయో తెలియదు. ఆ వెనకదృష్టే మన తెలుగుని పెంచుకున్నాది. దగ్గిర దగ్గిర వెయ్యి సంవత్సరాలు మాటలనీ ఊహాలనీ అలా అరికట్టేసింది. భాషనీ భావాన్నీ పాడుచేసింది.

ఆత్మశ్లాఘ - పరనింద

సంస్కృతంలో అంతా ఉంది, మరొక దానిలో ఏమీ లేదు అన్నభావం అస్తిగతం అయినట్టే, తనకంతా తెలుసును, పైవాడికేమీ తెలియదు అన్న భావంగూడా బాగా ప్రకో పించి ఉంటుంది. ఇది మన తెలుగులో చాలా స్ఫుటంగా కనిపిస్తుంది. సంస్కృతంలో అక్కడక్కడ కొందరు వాళ్ళను గురించి వాళ్ళే కొంచెం గొప్పగా చెప్పుకొన్నారు. అందరూ కాదు. కొందరు. నాటకాలలో సూత్రధారుడి మాటలలో కొందరు చెప్పుకునేవారు. కాని మనకి అది ఒక పెద్ద ఆచార మైపోయింది. తననుగురించి తాను అతిశయోక్తులలో చెప్పుకో వడం వరస అయిపోయింది. వాగనుశాసనుడుగారు 'మత్స్య

మరాచార్యుడన్' అంటే తిక్కన్నగారు 'శిల్పములో పారగు డన్' అని డన్ డన్ లాడించాడు.

## కవుల డన్‌డన్‌లు

ఈ డన్‌డన్‌లు ఆంధ్రకవిత్వం అంతటిలోనూ అలా ప్రతిధ్వనిస్తూనే ఉంటాయి. వెర్రిమొర్రి తెలియని వెంగళప్ప గూడా ఒక్కసారి తన్ను గురించి గట్టిగా వ్రాసి, అతిశయోక్తికి లక్ష్యం ఇస్తాడు. ఆపద్యాలలో చెప్పినగుణాలు ఆ కవిత్వంలో ఉండవు సరేకదా, లక్షలకొద్దీ తప్పులుంటాయి. అయినా డన్‌డన్‌లు మాత్రం మానడు. అన్నీ తెలిసిన సంస్కృతంవారి దారినిపడ్డ అగచాట్లు ఇవి.

## కుకవి నింద

ఆత్మశ్లాఘతో తీరిందా? లేదు. ఇతరులకేమీ తెలియదన్నదృష్టి ఒకటి ఉందికదా సంస్కృతసంపర్కానికి. దాని అగచాట్లు ఏమిటంటారా? అది కుకవినింద అన్నపేరుతో రిజస్టరీఅయి ట్రేడ్‌మార్కు పొందింది మన గ్రంథాలలో. అదొక మహాకావ్యలక్షణం అయిపోయింది తెలుగువాళ్ళ పాలింటికి. దమ్మిడీ కవీ కుకవినింద చెయ్యడమే, ఏగానికవీ కుకవినింద చెయ్యడమే. ఇదొక చిత్రమైన ఆచారము. మన వాళ్ళ సొమ్ము. అందులో మనవాళ్లు చూపించిన మహాతేజస్సు అలా కళ్లు మిరుమిట్లు పడేటట్టు చేస్తాయి. మీదమీద తగిలేటట్టు తేలికగా చెప్పినవాళ్లూ, శ్లేషలో పెట్టి తిట్టే వాళ్లూ, చీపురుకట్టలతో కొట్టేవాళ్ళూ చాలా చిత్రంగా ఉన్నారు.



## పరిశోధనకు కొంత అవకాశం

ఎవరైనా పరిశోధన చెయ్యాలన్న ఉద్దేశం ఉండి, మరేదీ విషయం లేకుండా ఉన్న బుద్ధిమంతులుంటే, వాళ్ళకి ఇదొక మంచిసందు. మహోత్తరుణం. ఆంధ్ర కవిత్వంలో కవ్యహంభావ వికసనం అని తెలుగుపేరుతోగాని, ది ఇవల్యూషన్ ఆఫ్ కుకవినింద ఇన్ తెలుగూ లిటరేచర్ అని ఇంగ్లీషు పేరుతో గాని, ఒక పరిశోధనకు అవకాశం చాలా ఉంటుంది. శ్రమపడి వ్రాసేవాళ్ళుంటే చదవడానికి సర్దాపడేవాళ్ళు చాలమంది ఉన్నారు. చదవరేమో అన్న భయం మాత్రం అక్కరలేదు. శ్వేతపాకంనుంచి చిత్రాతి పాకందాకా దొరుకుతాయి అవకాశాలు.

కొండబియ్యు లానసలేక
అన్న దగ్గరనుంచి—
ఒకని కవిత్వమందెనయు
నొప్పులు తప్పులు నాకవిత్వమం
దొకనికి పట్టగా జనదు...
అలా పట్టడానికి ప్రయత్నం చేశారా—
సిక మొదలంట గోసెదను,
చెప్పున గొట్టెద, కాలదన్నెదన్.

అన్నదాకా దొరుకుతాయి. చూచారా, రామలింగ కవి ఆవేశం ఒప్పులు పట్టినా తంతాడట. ఈ తాపులలో కొన్ని భావరూపాలూ. కొన్ని వాగ్రూపాలూ, మరికొన్ని క్రియారూపాలూ. మనోవాక్కాయాలన్న త్రికరణాలు ఉపయోగం





లోకి వస్తాయి. ఈ కుకవి నింద అనే పరిశోధన పరిశ్రమలో ఆ యా కరణాల క్రింద సరిపడయిన అధికరణాలు ఏర్పరచు కొని యుగాలుయుగాలుగా విభజించి, జాతిమతాలని సమన్వయించి వ్రాసే మహానుభావులుంటే, తెలుగు దేశం అంతా ఒక్కసారి నవ్వి ధన్యం కాగలదు.

ఆంధ్ర కవితా పితామహుడు

అతనికంటె ఘనుడు ఆచంటి మల్లన్న అన్నట్లు, అందరి కంటే అధికుడు మన ఆంధ్ర కవితా పితామహ అల్లసాని పెద్దనామాత్యుడు. ఈ కుకవినింద రంగంలో ఈ మహామహుడు కుకవిని :

భరమైతోచు కుటుంబ రక్షణకుగా బ్రాల్మాలి...
.........అర్థపున్
దెసవాటుల్ దెగకొట్టి తద్జ్ఞ పరిషద్విజ్ఞాత
చౌర్యక్రియా
విరసుండైన కొఱతన్ బడున్.........

ఇతర కవుల అర్థాన్ని దారికాచి దోచుకుంటాడట; ఈ చౌర్యం పండితులకు తెలిసిపోతుందట: దానివల్ల రాజ సభలలో ఆ కుకవిని 'కొరత' వేసేస్తారట. (పాపం! ఇక్కడ పెద్దన్న గారు వ్యావహారికంలో పడ్డారు. శిక్షగా వేసేది 'కొరుత'; చిన్నతనాన్ని సూచించేది 'కొరత'. శ్లేషకోసం రెండర్థాలకూ, 'కొరత' అనే ఉపయోగించాడు. కొరతవేయడం అన్నదే వాడుక. కొరుత వేయడం అని ఎవ్వరూ వాడడు.)



పెద్దన్న గారి పద్యానికి ఏమయినా అర్థముంటే, మొట్ట మొదట 'కొరత' వేయవలసింది ఆ ఆంధ్ర కవితా పితామహుడినే అని నిష్కర్షగా చెప్పవచ్చును. మారన మార్కండేయ పురాణంలోనుంచి మక్కీకి మక్కీగా దోచుకున్న విషయాలు అనేకం. మచ్చుకి:

నీయందు యాహవనీ యాగ్నియును
దక్షిణాగ్నియు ప్రభవించె, నిఖిలదేవ
తలకును తృప్తి నీవలన సిద్ధించును ...

అని మారన వ్రాస్తే, దానిని మన పితామహుడు ఏమిచేశాడు:

దివిషద్వర్గము నీ ముఖంబునన
తృప్తింగాంచు ...
............యా
హవనీయంబును దక్షిణాగ్నియును
నీ యందుద్భవించుం...

అన్నాడు. శ్రీనాథుని దారికాచి ఎన్నెన్నో అర్థాలు దోచాడు. పిల్లలమర్రి పినవీరభద్రుడి శృంగార శాకుంతలం లోనుంచి వేటవర్ణన చాలవరకు దోపిడిచేసి తన మనుచరిత్రలో ఇరికించాడు. జక్కనకవి విక్రమార్క చరిత్రనుంచి కొంత చౌర్యం చేశాడు. ఇన్నింటిని దోచుకొని వచ్చిన అల్లసాని కవి, కుకవుల చౌర్యాన్ని అధిక్షేపించడం సాహసం! ఇంత యెక్కువగా, ఇంత బాహాటంగా దారికాచి దోచుకున్నవారు ఎందరో ఉండరు ఆంధ్ర ప్రబంధ కవులలో. తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు.





## చేమకూర కవి

చేమకూర వెంకట్రాజు జెట్టూ భేషజమూ లేని మహా సౌమ్యుడు; వినయధురీణుడు. ఒకరికి మనసు నొచ్చినట్టు వ్రాయడం అతనికి చేతగాని పని. కవులలో ఒకరినొకరు మెచ్చకుండా ఉండడం చూచి

ఏగతి రచియించిరేని
సమకాలము వారలు మెచ్చరే కదా!

అని చాల చక్కని పద్యం వ్రాశాడు తన విజయ విలాసంలో. దానిని ఇతర కవులు కుకవి నిందకింద గణించ లేదు. గణించకపోతే కావ్యంలో ఉండవలసిన ఒక ముఖ్య వర్ణన లోపించిపోతుంది. ఏమిచేయడం? చేమకూర కవి అష్టాదశ వర్ణనలూ వ్రాయాలని సూచించిన 'విధేయుడే'గాని, ఆ విషయంలో 'విప్లవకాముడు' కాడు. మరి కుకవి నింద ఏది? ఆ ప్రశ్నకు బదులుచెప్పి, నేనూ కుకవి నింద చేశాను సుమండీ అనడానికి

స్వకపోలకల్పిత మనో
జ్ఞ కళాగతి కెట్టులౌను సరి ఛాయా చో
రక రుచి సందర్భం బని
ముకురము నగు కరణి నవ్వుమోము చెలంగెన్.

అని అద్దములోని ప్రతిబింబాన్ని వర్ణిస్తూ సూచించాడు. కుకవి నిందే అని అనినా, ఎంత మెత్తగా ఎంత మర్యాదగా, ఎంత సత్య సమ్మతంగా నిందించాడో చూడండి. అంతేగాని



ఆ సూచనలో గూడా కుకవి 'ఛాయా చోర్యాన్ని' గురించి చెప్పకుండా ఊరుకోలేకపోయాడు.

అంత కరుడుకట్టిపోయాయి, ఈ వెనక చూపులు, ఈ ఆత్మశ్లాఘాలు, ఈ పరనిందలు. ఇదే ఆచారమయింది. ప్రధానమయిన విషయాలు అప్రధానమైపోయాయి. అప్రధానమయిన ఈ పుష్పలావికావర్ణనలు, కుకవినిందలు, నగరవర్ణనలు, చంద్ర, మందమారుత, మన్మధుల ఉపాలంభనలు ప్రకోపించి పోయాయి కావ్యాలలో.

విశ్వశ్రేయః కావ్యం

అయినా విశ్వశ్రేయస్సుకోసమే కావ్యమన్న సూత్రాన్ని మాత్రం పఠిస్తుంటారు. ఈ అష్టాదశ వర్ణనల కావ్యాలవల్ల ఏ పాటి విశ్వశ్రేయస్సు సాధించారో వేరే చెప్పనక్కరలేదు. నిజంగా మన కవులు చేసిందేమిటంటే, ప్రజల శ్రేయస్సుకోసం కావ్యం వ్రాయడం కాదు; ఏదో ఈ అష్టాదశవర్ణనల మాపికల బొంతలాంటి కావ్యాన్ని వ్రాసి, దానితో విశ్వశ్రేయస్సును సాధించామని ఉబలాట పడడం. ఈ బొంతతో లోకమంతా బాగుపడ్డదని సంతోషించడం, అదే మనవాళ్ళు చేసిన పని.

విశ్వశ్రేయస్సంటే ప్రజలశ్రేయస్సనీ, అంటే ప్రజలకున్న కష్టాలు తొలగిపోవాలనీ, వాళ్ళ సౌఖ్యాలు అభివృద్ధి పొందాలనీ, దానికి తగినట్టుగానే కావ్యాలు వ్రాయాలనీ వాళ్ళకు తెలియదు. కావ్యం చివరను ఈ కావ్యం చదివినా, వినినా, అందరికీ ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధి కలుగుతుంది

అని నాలుగు ముక్కలు వ్రాయగానే ప్రజా శ్రేయస్సుకి కృషి చేశామనే భావించారు.

అంతేగాని, ప్రజల జీవితం గ్రహించడానికి గాని, వాళ్ళకున్న సమస్యలను తెలుసుకోడానికి గాని, వారు ప్రయత్నించలేదు. ప్రజలను వారి జీవితాన్ని విడిచిపెట్టి పల్టీలు కొట్టారు – నేలవిడిచిన సాము. కాబట్టే మన సాహిత్యంలో మన జాతి జీవితం కనబడదు. కనబడకపోతే నేమి ప్రమాదమంటారా ? చాల ప్రమాదముంది.

## సాహిత్యం ప్రతిబింబము

సాహిత్యంలో జాతి జీవితం ప్రతిబింబించాలి అని సాహిత్యంలో ఒక ముఖ్యసూత్రము. సాహిత్యాన్ని పట్టి ఆ జాతివారి విజ్ఞానము, జీవన విధానము. ఆచారాలు, సంస్కృతి తెలుసుకోడానికి వీలుండాలి. సాహిత్యంలో జాతి కనబడాలి. జాతికి సాహిత్యం అద్దంలాగుండాలి. అది ఈనాడు లోకం అంగీకరించిన సూత్రం.

ఈ సూత్రానికి అనుగుణంగా ఉండాలంటే, కవి ప్రజలలో ప్రజలతో, ప్రజలకోసం, బ్రతకాలి. తలంతా కళ్ళు పెట్టుకొని ప్రజల జీవితం గ్రహించాలి. దానిలోని చెడుగును నిర్మూలం చెయ్యడానికీ, మంచిని పెంచడానికీ, తన శక్తిని ఉపయోగించాలి. కవి, తన మృదుమధుర రచనలతో, చెడుగును అసహ్యించుకోనేటట్టు చేయాలి: మంచి అంటే నోరూరేటట్టు వ్రాయాలి. ఎలాగ సంస్కరించుకోవాలో దారి చూపించాలి. మనిషికీ, సమాజానికి ఉన్న సంబంధం స్పష్టంగా



కనబడేలాగ చూపించాలి. సమాజానికి మనిషీ, మనిషికి సమాజమూ ఏవిధంగా తోడ్పడాలో చెప్పాలి.

ఈ దృష్టితో వ్రాసినప్పుడు, ఆ వ్రాతలలో జాతి జీవితం ప్రత్యక్షంగా కనిపించక తప్పదు. సాహిత్యం అన్న పేరు దానికి సార్థకమవుతుంది. అలా వ్రాసినప్పుడే మన తెలుగు సాహిత్యంలో తెలుగు మనుష్యులు, తెలుగు జీవితము, తెలుగు కష్టసుఖాలు, తెలుగుతనము కనబడతాయి.

మనసాహిత్య మెంత ?

ఈ దృష్టిని చూస్తే, మనకున్న లక్షలాది పుస్తకాలలో తెలుగు సాహిత్యం అనదగిన పుస్తకాలెన్ని ఉంటాయో చూడండి. సంస్కృతంలో నుంచి దిగిన సరుకంతా విజాతీయమే అవుతుంది. మనది కాదు. వాటిని ఆధారంగా తీసుకొని, అష్టాదశ వర్ణనలకు లోనయి, అల్లిన ప్రబంధాల సరుకు చాలావరకు విదేశీయే అవుతుంది. వీటిని మినహాయిస్తే ఇంక మిగిలిన వాఙ్మయం తెలుగువాళ్ళదేపాటి? అందులో నిజంగా తెలుగుతనం, తెలుగు జీవితం కనబడే గ్రంథాలుగాని, గ్రంథ భాగాలుగాని చాల తక్కువ అని అనక తప్పదు. ఆ నాలుగే మన తెలుగు సాహిత్యమని అనాలి, న్యాయంగా. తక్కినదంతా మనది కాదు, బిలాయతీ సరుకు.

కాబట్టి, గ్రంథాలయాలలో బీరువాలనిండా ఉన్న పుస్తకాలుచూచి, ఇవన్నీ మా సాహిత్య గ్రంథాలే, ఇదంతా మా వాఙ్మయమే అని మురిసిపోవడం, కొంచెం కారణంలేని కులుకే అవుతుంది. నిజమయిన తెలుగు సాహిత్యం తయారు




చేయవలసిన పని ఇంకా ఉంది. తెలుగు కవి, తెలుగు రచయిత, తెలుగు ప్రజల జీవితంలో ఉండి వ్రాయాలి. ఏదో వీణ పట్టుకొని, ఏ మేఘాల సందులోనో కూర్చుని, పాడుకో కూడదు. పాడుకోవడం తనసొత్తు. ఎక్కడ ఎలాగ పాడుకుంటే మనకేమి అనడానికి వీలులేదు. అదంతా తనదే కాదు; తెలుగు సంస్కృతి, తెలుగు గడ్డ, యుగయుగాలనుంచి వచ్చిన తెలుగు విజ్ఞానమూ తనకిచ్చిన శక్తి. అతను తెలుగు ప్రజకి ఋణపడిఉన్నాడు. ఆ ఋణం తీర్చాలి; తన ఇష్టంవచ్చినట్టు వినియోగించుకోకూడదు. మళ్ళీ ఆ తెలుగువాళ్ళకు తాను కొంత చెల్లించాలి.

వ్రాయవలసిన విషయం దీనివల్ల స్పష్టమవుతుంది. జాతి జీవితానికీ వ్రాతగాడికీ చాల దగ్గర సంబంధం ఉంది. ఆ జీవితానికి వికాసం కలిగించి, దాని అభ్యుదయ మార్గంలో నడిపించడం ప్రతి వ్రాతగాడికీ ప్రధానమయిన పని. ఇదే నా కొత్తపాళీకి కట్టిన రెండో సూత్రం – భావసూత్రం. ఈ అభిప్రాయాన్నే "గీటురాళ్లు...వ్రాత-కోత" అన్న గేయం స్పష్టపరుస్తుంది.



౨౩౩

## "గేటురాళ్లు....వ్రాత - రోత"

చదివిన విన్నా జనుల కందరికి
చక్కగ తెలిసితె వ్రాతా,
మెదడు చించుకొని నిఘంటులన్నీ
వెదికించిందే రోతా.
వాడుకమాటల వల్లనె భావాల్
ప్రకటించిందే వ్రాతా,
పాడుముష్టితో పెద్దసమాసాల్
వాడింద్దైతే రోతా.
చిన్నమాటలనె గొప్ప భావములు
చెప్పగలిగితే వ్రాతా,
మిన్నువిరిగినటు ధ్వనించి భావం
సున్నచుట్టితే రోతా.
అష్టకష్టములు అనుభవించుకవి
ఆవేదనయే వ్రాతా,
ఇష్టభోగముల ఊగాడుచు ప
ళ్ళిగిలించిందే రోతా.
హృదయంలోపల ఎడము చాలకే
ఎగుకుచు వస్తే వ్రాతా,





ఇదియని అదియని రానిదానిని
ఈడ్చుకవస్తే రోతా.
ప్రజల భావముల ప్రతిధ్వనిస్తూ
బాగుపరిస్తే వ్రాతా,
గజిబిజివ్రాతల కళ్లుమూసుకొను
గాలిమూటయే రోతా.
ప్రజలజీవనము పిడికిట పట్టుక
ప్రకటించిందే వ్రాతా,
రజతాచలముల పట్టీల్కొట్టుచు
వ్రాసిందంతా రోతా.
జీవనమందలి పెద్దసమస్యల
చిక్కువిప్పుతే వ్రాతా,
ఏవోపుక్కిటి పురాణములతో
బావురుమంటే రోతా.
కతలోసంగతి జీవకళలతో
కనబడితేనే వ్రాతా,
మృతదేహంవలె ముస్తీబులతో
మిటకరించితే రోతా.
ఊరూదేశం ఉద్రేకంతో
ఊపగలిగితే వ్రాతా,
సారంలేని చప్పిడిమోటార్
కారుకూతలే రోతా.
ఈ ప్రపంచమున జ్ఞానం ఎంతో
ఎరుగుచువ్రాస్తే వ్రాతా,



కూపస్థంవలె గ్రుడ్డిపారములు
కూటికిగ్రాస్తే రోతా.
మంచీచెడ్డల జంకులేక గ్రే
మించిచెప్పుతే గ్రాతా,
కొంచపుబుద్ధిని సంచినింపుకొన
కూసింద్రైతే రోతా.
చిత్రంలోవలె ఆయారోజుల
జీవంచూపుతే గ్రాతా,
సూత్రాల్‌చూచుక తెలిసీతెలియని
సోదెలుగ్రాస్తే రోతా.
అనునవునన్నటు హృదయంపట్టుక
ఆడించిందే గ్రాతా,
చెవులకుమాత్రం తగిలేటట్టులు
చెప్పింద్రైతే రోతా.
సలసలమరిగే కష్టావళిలో
మునిగిగ్రాసితే గ్రాతా,
తెలియనిదానిని వల్లెవేసుకొని
తెల్పేద్రైతే రోతా.
గతమునుబాగా విమర్శచేస్తూ
గతిచూపిస్తే గ్రాతా,
మతిసుతిలేని ఊహాశూన్యాల
మాటలగారడి రోతా.

కొత్త పాళీ సంపూర్ణం.



# అనుబంధము

[ కొత్తపాళీలో 'భావసూత్రానికి' అనుగుణంగా ఉంటుందన్న నమ్మకంతో 'ఓ కవీ' అని నేను వ్రాసిన ఈ పద్యాలు ఇక్కడ అనుబంధంగా ఇస్తున్నాను. శ్రీ హరీంద్రనాథ చటోపాధ్యాయులు ఇంగ్లీషున వ్రాసిన ఒక ఖండకావ్యాన్ని ఆధారంగా చేసుకొని దీనిని వ్రాశాను.]

## ఓ కవీ

అందమగు మేఘాల
సందులో, నొక చిన్ని
గొందిలో దూరి, యానందమునకై పాడు -
కుందామనే చింత కూడదది, కూడదది
పుట్టుగ్రుడ్డిగ పోకురా
ఓ కవీ
వట్టి మోడువు కాకురా !

"ఏకతార్" పాటలను
ఇంక చాలించరా;
కాకంతో జగమొక్క కమ్మచ్చునే తీసి,
లోకతంత్రుల గొంతులోన పల్కించరా



పాతరోజులు పోయెరా
ఓ కవీ
రోత పాటలు మానరా !

దిక్కులను చూచినా,
చుక్కలను కాంచినా,
ఒక్కరీతిని రక్త మోడికలు కడుతుంది
ఒక్కవారిని పోరు చక్కాడి పోకుంప
నిలిచి శాసించవేరా
ఓ కవీ
పలికి పురికొల్పవేరా !

గొంతులో ఒక యగ్ని
కొత్తగా రగిలింది,
తంత్రులన్నీ ఒక్క పుంతలోబడ్డాయి
ఇంతింత అనరాని వింత బలమొచ్చింది
స్వార్థగానము మానరా
ఓ కవీ
సార్థకానికి పూనరా !

క్రూరులై కల్పించు
ఘోర యుద్ధాలలో
కోట్లకొద్దీ జనులు కూడు గుడ్డకు లేక
పాట్లుపడి చచ్చారు పరికించలేదేమొ

తిండికొక్కటి కాదురా
ఓ కవీ
గుండె ధైర్యము నూదరా!

నీటిలో గాలిలో
నేలమీదను "చావు"
కోటి కోరలు చాచి వేటాడుచున్న; దా
ధాటి కోరవలేక దద్దరిలుచున్నావు
మెత్తదనమును వీడరా
ఓ కవీ
కత్తిసామును సాధరా!

అధిక బాధలతోడ
అటమటించే జనుల
కష్టాల కొలిమిలో కాగి మండిన గుండె
కత్తివాదరనైన మెత్తననిపించగా
మాటాడ నుంకించరా
ఓ కవీ
మానసము నురికించరా!

తూర్పు పడమర లనక
దొర్లుకొని వచ్చేటి
దుఃఖ వాహిని నాపి, దొడ్డశక్తిగ మార్చి
దుష్టరాక్షసి నొక్క త్రుటిలోన పరిమార్చ



కంకణమ్మును కట్టరా
ఓ కవీ
జంకెల్ల పోగొట్టరా !

పూలవర్షము కురియు
పాలమబ్బుల నుంచి
రాలుమండే అగ్నిగోళాల మంటలో
కాలకుండా ప్రజల కాపాడి రక్షించ
జాతి కాయుధ మీవెరా
ఓ కవీ
నీ తేజమును చూపరా !

మండు టాకలిలోను
ఎండు నాల్కలలోను
మొండిబారిన పేద బండగుండెలలోను
గాండ్రించు భావాల నిండించి నీ గొంతు
సింహనాదము చేయరా
ఓ కవీ
స్థిరమైన పేర్మోయరా !

చిదిగి శిథిలాలైన
హృదయాలు పెనవేసి,
అదుకు బెదురుల గుండెలన్నీ యొక్కటిచేసి,
పదును నాలుకతోడ పలికి సాధించాలి





వెనుకాడగా కాదురా
ఓ కవీ
వెనుక తరుణము రాదురా!

ప్రజల కవివై గొంతు
రగిలించి పాడితే
ఒక్కొక్కలు రేగ ప్రళయమారుతమల్లు
తక్కువెక్కువలెల్ల ఒక్క దెబ్బను కూల్చి
లోకాల నూగింపవా
ఓ కవీ
శోకాల తొలగింపవా!



Printed at Swatantra Art Printers, Vijayawada-2

